

ఒకటి ▪ రెండు ▪ మూడు!
అది తయారై పోయింది!
తేలికైన, రుచియైన

# రెక్స్ జెల్లీని

ఎంతో సులభముగా తయారు చేయవచ్చును!

రెక్స్ జెల్లీలోని పళ్ల కమ్మదనమును అంటే కుటుంబములో అందరూ యిష్టపడతారు మీరు దానిని తయారు చేసుకొందుకు యిష్టపడ తారు ఎందుకంటె, అది ఎంతో పుష్టికరమైనది, ఎదిగే పిల్లలకు అది దివ్యమైనది. అంతే కాకుండా అది త్వరగా జీర్ణముఅవుతుంది. కనుక దానిని రోగమునుండి కోలుకుంటున్నవారు, చిన్న పిల్లలు కూడ తిన వచ్చును!

రెక్స్ జెల్లీని యీ 6 రుచికరమైన రకములలో దేనినైనా చేసుకోండి: రెస్ప్ బెర్రీ, స్ట్రా బెర్రీ, పైన్ ఆపిల్, ఆరెంజ్, లెమన్, చెర్రీ.

ఈ సులభమైన మూడు పద్ధతులను అనుసరించండి:

1. రెక్స్ జెల్లీ గడ్డను వేడి నీళ్లలో కరగ నివ్వండి.
2. తగినన్ని చన్నీళ్లను కలిపి దానిని 1 పైంట్ (20 ఔన్సులు) కొలత అయేలా చేయండి.
3. దానిని ఏదేని పాత్రలో వేసి మంచువేసి జెల్లీ అయేలా చూడండి.

తరచుగా రెక్స్ జెల్లీని తినండి. అది మంచిది.



**కార్న్ ప్రాడక్ట్స్ కో. (ఇండియా) ప్రయివేట్ లి.**

CPT-12-TEL.

Brooke Bond

Café BRAND

French coffee

NETT WEIGHT WHEN PACKED 100 gms.
BROOKE BOND INDIA PRIVATE LIMITED
COIMBATORE
CODE NO. C.L.

JWTBB 433



తాజాగా వుండేది
కమ్మని సువాసన గలది
సంతుష్టి నిచ్చునది

● చికోరీతో బ్లెండు చేయబడినది

కేఫే బ్రాండ్ ఫ్రెంచి కాఫీ

బ్రూక్ బాండ్ వారి ఉత్పత్తి

# ఉత్తరాలు

## దీపావళి సంచిక

అర్థంలేని భావాలను పొందుపరిచి వ్రాసిన కథానికలకు బహుమతు లివ్వడం విచిత్రంగా ఉంది. ఉత్తమ భావాలతో, చక్కటి భాషతో వెలువడాల్సిన పోటీ కథానికల స్థితి ఇంత పేలవంగా ఉండటానికి రచయితల అసమర్థత నిదర్శనమేమో అనిపిస్తుంది. తెలుగులో ఈమధ్య ఉత్తమ రచనలు రావడంలేదన్న చెడ్డపేరు ఉండనే ఉంది. 'పత్రిక' జరుపుచున్న పోటీలవల్ల ఆ పేరును మాన్పించుకోగలుగుతామన్న ఆశ వీటిని చూసిన తర్వాతపూర్తిగా పోయింది.

"కథానికల పోటీల" ఉద్దేశ్యం రచనా శక్తి పెంపొందించడానికనీ, ఉత్తమ రచనల్ని పాఠకుల కందించడానికనీ రచయితలు గమనిస్తే సంతోషం. వచ్చే 'పోటీలలో' ని కథానికల స్థాయి చక్కగా ఉంటుందని ఆశించడంలో పొరపాటు లేదనుకుంటాను.

డి. మధుసూదన్ ( హైదరాబాదు )

## ముఖచిత్రం

వసంధ్యైన పద్మనేత్రి "సుజాత" ముఖచిత్రము చాలా బాగుంది. ఆంధ్రసచిత్ర వారపత్రిక ద్వారా ఇలా క్రొత్త సినీతారల పరిచయం చేయడం చాలా సంతోషం. రెండు సంవత్సరాల క్రితం మా ఊరిలో నాగభూషణంగారి నాటకం "రక్త కన్నీరు" లో నటించిన సుజాత ఇంత తొందరగా పైకి వచ్చినందుకు చాలా సంతోషం.

బి. వి. నర్సింగ్‌రావు ( నిజామాబాద్ )

*   *   *

సుజాత ముఖచిత్రం నేత్రానందకరంగా ఉంది. ఎన్నిసార్లు చూసినా తనివితీరటం లేదు. ముఖచిత్రంపై కార్టూను పక్కలు పిక్కటిల్లేట్టు నవ్వించింది ఇంతకీ ఆ కార్టూను వేసిం దెవరు ?

మూల ప్రభాకరరెడ్డి ( హైదరాబాద్ )

*   *   *

పత్రిక అట్టమీది బొమ్మలు ఈ సినిమా తారల బొమ్మలకంటే మన దేశ నాయకుల బొమ్మలు అప్పుడప్పుడూ వేస్తూంటే బాగుంటుంది.

కొంపల్లి కోటిలింగం (గుంటూరు)

*   *   *

## 'కట్నపిశాచీ-ప్యాన్సీడ్రెస్'

'కట్నపిశాచీ ప్యాన్సీ డ్రెస్' కథ, దానికి వరాగం వేసిన బొమ్మ చాల బాగున్నవి. అయితే స్కూటర్ ఉండగా, శేఖర్, రాధారాణి కాలేజీకి రిక్షామీద ఎందుకు వెళ్లారో ? స్కూటర్‌మీద భార్యని ఎక్కించుకొని కాలేజీకి వెళ్లడం శేఖరానికి సిగ్గా ? లేక భయమా ?

బ్రహ్మచారి త్రయం ( పులివెందల ) ★




# నీల్-కాల్ సిరా

సిరాలన్నిటిలో ప్రశస్తమైనది

## ఉచితం

నీల్ - కాల్ సిరా 2 oz బాటిలు కొన్నవారికి, లక్ష్మి, గణేశ్, వెంకటేశ్వర, వహీదారహమాన్, స్నానసుందరి మొదలగు పెద్దసైజు (19" × 14") వర్ణచిత్రములలో ఒకటి యివ్వబడును.

కళా పరిషత్ - తెనాలి




రాజా టాల్కం పౌడరు మంచి సువాసనగలది

మణ్యాం & కంపెనీ, బెంగుళూరు-20.

క్రింది చోట్లయందు లభించును.

బెజవాడ వెంకన్న & సన్సు, రాజమండ్రి. • పువ్వాడ పుల్లయ్య & సన్సు, విజయవాడ. • రామా ఏజెన్సీస్, నెల్లూరు. • రవి & కంపెనీ. 63, బందరువీధి, మద్రాసు-1. • సిటీ ఎంపోరియం, మాణిక్యమందిర్, కాకినాడ.

లక్షలాది జనులకు ఆనందం కలిగించే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో

ప్రకటనలు వేసి మీ వ్యాపారాభివృద్ధి చేసుకొనండి.

# మృదువైన చర్మానికి

అమృతాంజన్ వారి
కొత్త బాధా నివారిణి

# అనోలియం

ఎంత మంచిదంటే అది చిన్నపిల్లవానికికూడా వాడతగినది. అయినా దానికి మంచి తైలమునకుండు శక్తి యున్నది.

Ano Anoleum
FOR EXTERNAL USE ONLY
COUGHS AND COLDS: Rub over chest and cover with warm cloth. Apply also over and around nose. Can be used for pains etc.
MADE IN INDIA
AMRUTANJAN LTD.,
14/15, LUZ CHURCH ROAD, MADRAS-4
COMPOSITION
MENTHOL B.P.
CAMPHOR B.P.
METHYL SALICYL B.P.
OL. TEREBINTH I.P.
OL. EUCALYP I.P.
OL. CAJEPUT B.P.
BASE

వెంటనే పనిచేయు అనోలియం హాయిని కలిగించు ఒక క్రొత్త ఉపశమనకారి. పిల్లల చర్మమునకు మంట కల్గించదు. అయినప్పటికి దానియందలి శక్తివంతమైన వస్తువులు జలుబు దగ్గులనుండి అతి త్వరగా ఉపశమనము కల్గించగలవి. రాత్రులందే పిల్లలు జలుబు, దగ్గులవల్ల ఎక్కువగా బాధపడతారు. అనోలియంలోని సుఖమునిచ్చు ఓషధులను రొమ్ముపై బాగా మర్దనచేయండి. అవి నెత్తురు నాకేచోట చేరనీయక సక్రమంగా ప్రవహించుటకు తోడ్పడుతవి. మీ పిల్లవాడు హాయిగా నిద్రించి ప్రొద్దున్నే చలాకీగా ఆరోగ్యంగా మేల్కొంటాడు.

అనోలియం మీకు కూడా తగినది.

ఎప్పుడైనా మీకు తలనొప్పిగా వుంటే మరేం లేదు కొంచెం అనోలియం తీసుకొని మీ కణతలకు రాయండి. అది ఎంత ఉపశమనం కల్గిస్తుందో మీకే తెలుస్తుంది. అనోలియం వాడినపుడు జిడ్డుగా కన్పించదు.

**అమృతాంజన్ లిమిటెడ్**
14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1

IWT-AM/AN/1721a




వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 16—11—62
శుభకృత్ సం॥ కార్తిక॥ బ॥ పంచమి
సంపుటము : 55 సంచిక : 11
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1




రాజశ్రీ

## మనలో మాట

కొత్తరకం ముఖచిత్రం వచ్చినట్లు పాఠకులు వ్రాస్తూనేఉన్నారు! ఈ సందర్భంలో కొందరు వర్థమాన నటీనటులను తెలుసుకునే అవకాశం కూడా కలిగింది! ఇంకా మరికొందరిని తెలుసుకోగలుగుతామనేధైర్యం ఉంది......

* * *

న్యూస్‌ప్రింట్ కొరతవల్ల ఈవారం నుంచి 56 పేజీలు మాత్రమే వేస్తున్నాము. దీనివల్ల కొన్ని శీర్షికలు తీసివేయవలసి వస్తుంది! పాఠకులు, రచయితలు ఎప్పటివలే మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

* * *

వచ్చేవారం ప్రారంభించే శీర్షిక రచయిత ప్రస్తుతం ప్రయివేట్ డిటెక్టివ్‌గా పనిచేస్తున్నారు! నిజమైన అపరాధ పరిశోధకుడు ఒక తెలుగు పత్రికలో వ్రాయటం(మాకు తెలిసినంతవరకూ!) ఇదే మొదటిసారి.





ఏంరా నాన్నా! ఈ చైనా రాకాసులకేం మందు యివ్వాలంటావ్?

ఎదుర్కొని పోరి వాళ్ల కాళ్లకు బుద్ధిచెప్పేలా చేయాలంటాను.

## విషయానుక్రమణిక


హలో! మాక్‌మిలన్ జీ! భారత
దేశానికి సాయం చేయకండి! అవ
తల చైనా భూతం మనమీద
పండి పడుతుంది..


భారత చైనా సంగ్రామం యొక్క
తొలి పరిణామం


చైనా భారత్
యుద్ధం వల్ల ఫలితం
ఐక్యత
భారత్
ప్రజానీకం


నాశనం!
హిట్లర్
యొక్క
భూతం
చైనా
చైనా రాక్షసి నిముకుటన
తాడేసి ఆడించేది
హిట్లర్ భూతమైతే..


సిగ్గు!
ముస్సోలినీ
యొక్క
భూతం
పాకిస్తాన్‌ను ఆడించేది ముస్సోలినీ దెయ్యం

# రక్షణ కూర్పు లేని కేంద్ర రక్షణశాఖ

**శ్రీ కృష్ణ**

దీపావళి వచ్చింది. పోయింది. కాని మన మనస్సుల్లో మాత్రం అంధకారం తిమిరాలు ఆవరించినాయి. 1857 తర్వాత మళ్ళీ ఇప్పుడు మన దేశానికి ఛిన్న స్థితి ఏర్పడింది. చైనావాళ్ళ మన గడ్డమీద కాలు మోపటమే గాక, మన ప్రాంతాన్ని కొంత కబళించి కూచున్నారు. లోగడ లార్డ్ బైరన్ బెల్జియం రాజధాన్ని గూర్చి ఇలా చెప్పాడు.

"నిశీధిలో విప్లవ ఘోషలు చెలరేగుతున్నా, బెల్జియం రాజధాని అంతా దీపాలంకరణలతో స్త్రీ పురుషుల ఆనంద కోలాహలాలతో మార్మోగి పోయింది. ధీరులంతా వివాహానికి వలే బయల్దేరారు." (ఇది భావం మాత్రమే.) న్యూఢిల్లీని చూస్తే ఈ మాటలు జ్ఞప్తికి వస్తాయి. భారత స్వాతంత్ర్య రక్షణకుగాను ధీరపురుషులు వేలాది తమ సర్వస్వాన్ని త్యాగం చేస్తుంటే, ఇక్కడ మన రాజధానిలో యధాప్రకారంగా ఆహ్వానాలు, సన్మానాలు, నృత్య కాలక్షేపాలు ఒకటేమిటి అన్నీ యధావిధిగా జరుగుతున్నాయి. ఏదో అవాంతర పరిస్థితి ఏర్పడిందన్న భావాన్ని, ఆందోళనను ప్రజల్లో కలిగించరాదనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఇలా ఉండి ఉంటుంది. అయినా శాంతికావలంటే శస్త్రాన్ని చేపట్టమనే సామెత ఉండనే ఉందికదా!

నీఫాలో మన పరాజయాలకు బాధ్యులైనవారెవరో తెలుసుకోనవలసిందనీ, దూరాక్రమణదారులను వెనక్కు తరిమివేయవలసిందని పార్లమెంటులోని కాంగ్రెస్ పక్ష సభ్యులు, న్యూఢిల్లీలో ఉన్నవారు, ప్రభుత్వాన్ని కోరారు. అలా కోరడం కూడా సరిగ్గానే ఉంది.

నీఫా అంటే ఈశాన్య సరిహద్దు ప్రాంతంను కామెంగ్, సుబాన్‌సిరి, సియాంగ్, లోహిత్ అని నాలుగు భాగాలుగా విభజించటం జరిగింది. కామెంగ్ ప్రాంతంలో పోరు ముమ్మరంగా ఉంది. సుమారు 350 సంవత్సరాల క్రితం స్థాపింపబడ్డ తవాంగ్ పట్టణం దగ్గరగా పర్వత ప్రాంతాల మధ్య పదివేల అడుగుల ఎత్తు పీఠభూమిలో టిబెట్ భూటాన్‌లతో అంతర్జాతీయ సరిహద్దుల పైన ఈ ప్రాంతం ఉంది. తివాసీల తయారీకి, వ్యవసాయానికి పేరుపొందిన మోపాలనే తెగల ప్రజలు ఇక్కడ నివసిస్తారు. ఈ ప్రజకు గుర్రాలు, జడల బర్రెలు, గొర్రెలంటే మంచి అభిమానం.

ఈ ప్రాంతమంతా చలిమయం. గ్రామాలన్నీ 12000 అడుగుల ఎత్తున ఉండే ఈ ప్రాంతానికి ముఖ్య కేంద్రం బొమ్డిలా పట్నం. సుమారు 9 వేల అడుగుల ఎత్తునున్న ఈ కేంద్రం దేశంలో అతిముఖ్యమైన పరిపాలనా కేంద్రంగా చెప్తారు. అలాటి ఈ ప్రాంతంలో మన సైనిక సమీకరణం ఇలాఉంది :

లడక్‌లో పర్వతశ్రేణి దిగువగా స్థావరాలేర్పరచుకున్న చైనీయులు మామూలు రోడ్డుమీద తమవారికి సామగ్రి సరఫరా చేయగలరు. భారత సైనికులకు ఏదైనా సహాయం కావాలంటే విమానాలద్వారా సరఫరా చేయాల్సిందే. ఇక నీఫాలో చైనావాళ్లు మనకన్న ఎక్కువ ఎత్తులో స్థావరాలు ఏర్పరచుకున్నారు. వాళ్లకు సరఫరాలకు రోడ్లు చక్కగా ఉపయోగిస్తున్నాయి. భారత సైనికులకు మందుగుండు సామగ్రి, తిండి, తిప్పలు అన్నీ విమానాలద్వారానే జరగాలి. కారణం పర్వత ప్రాంతం కావటంవల్ల మనకు అనుకూలంగాలేదుట!

ఇప్పు డేర్పడ్డ ఈ విషమ పరిస్థితికి కారకులెవ్వరు ? ఉన్నట్టుండి పుట్టుకొచ్చిన 'దయ' తో కావాలని చైనాకు అప్పనంగా టిబెట్‌ను పువ్వులో పెట్టి ఇచ్చిన మహానుభావు కారణమని చెప్పాలి. ఆరోజునుంచీ చైనా టిబెట్టు వరకూ రోడ్లు, విమానాశ్రయాలు నిర్మిస్తున్నది. ఏదైనా వార్త తెలియాలన్నా ముందు దాని విషయమే తెలుస్తుంది. నీఫా ప్రాంతంలో రోడ్లు నిర్మించేందుకు మారుగా మన రక్షణశాఖ ఎక్స్‌ప్రెస్ కాఫీ యంత్రాలు, తదితర ప్రజావసర వస్తువులు, వాణిజ్య సంబంధమైన వాహనాల తయారీతో వ్యష్టి రంగంతో పోటీ పడుతూ కూచుంది ! కర్మంచాలక ఎవరన్నా మనం జాగర్తగా ఉండాలయ్యా అంటే వాళ్ళని పట్టుకుని యుద్ధోన్మాది అంటున్నారు !

దేశంలో ఒకప్రక్కన ఇలా ప్రభుత్వ విధానాల పట్ల తీవ్రమైన విమర్శలు ఎదురవుతుంటే, చైనాను సంతృప్తిపరచే ప్రయత్నాలు గతవారం వరకూ జరిగాయి. సమితిలో చైనాకు సభ్యత్వం ఇవ్వాలని భారతదేశం ఇంకా వాదిస్తూనే ఉంది. ఆ వారంలోగానే రెండుసార్లు శ్రీ కృష్ణమీనన్ సవ్యమైన షరతులపై చైనాతో చర్చలు కొనసాగించేందుకు కూడా సిద్ధపడ్డారు. ఒకప్పుడు భారతదేశం దక్షిణాఫ్రికా, పోర్చుగల్‌లతోడి దౌత్య సంబంధాలకు తెంచివేసుకుంది. చివరకు ఆ దేశాలలో వ్యాపారం కూడా మానేశారు. అయితే ఈ రెండు దేశాల్లోను ఏది, కూడా భారత భూభాగాని ఆక్రమించుకోలేదని అందరికీ తెలుసు. ఇప్పుడు యుద్ధం ప్రకటించకుండానే చైనా భారతదేశంపై దండయాత్ర చేస్తున్నా, అన్నీ నెమ్మదిగా సద్దుకుంటాయనే అపోహ పుణ్యమా అని, అసలు నీఫా లడక్ ప్రాంతాల్లో ఏమీ జరుగలేదన్నట్లుగానే,చైనా దౌత్య కార్యాలయం పనిచేసే అవకాశాన్నికల్పించాం.

కాంగ్రెస్ సభ్యులు అడిగిన ఇంకో ప్రశ్న కూడా సవ్యమైందే. మన సరిహద్దులు చాలా పటిష్టంగా ఉన్నాయని పార్లమెంటులో హామీ ఇవ్వటం జరిగిన తర్వాతనే నీఫా ప్రాంతంలో పరాజయంలు సిద్ధించటం, పార్లమెంటులోని కాంగ్రెస్ సభ్యులను విభ్రాంతుల్ని చేసింది. ఈ పరిస్థితి ఇలా ఏర్పడటానికి, భ్రాంతిలో పార్లమెంటును ఉంచటానికి బాధ్యులను కనుక్కొని గట్టిగా శిక్షించాలని కూడా ఆ సభ్యులు కోరారు.

మన ప్రధాన మంత్రి కూడా భ్రాంతిలోనే న్నారనేది నిజం. లేకపోతే చైనీయులను త్రోసి పారవేయమని సేనకు ఆయన ఉత్తర్వులిచ్చేవారు కాదు. ఈవిధంగా తప్పుత్రోవ త్రొక్కించటానికి కారణం, చైనావారికి నేఫా ప్రాంతంలో పెద్దగా ఆశలు లేవనే ఉద్దేశం ఆయనకు మనస్సులో ఉండటమే. అంతేగాని, నేఫా ప్రాంతం పర్వతశ్రేణులు మన కనుకూలమైపోయి మాత్రం కాదు. అన్నిటికన్న శోచనీయమైన నగ్నసత్యం ఇంకొకటుంది. చైనా పట్ల మన విధానమేపూర్తిగా తప్పు. చైనాపట్ల మన విధాన నిర్ణేతలు, చైనీయుల మనస్సు ఎలా ఉంటుందో అర్థం చేసుకోలేదు. ప్రపంచంలో అన్ని సామ్రాజ్యాల మాదిరి కాదు ఈ చైనాలో. ఇక్కడ ప్రతి కూలీ కూడా వో సామ్రాజ్యవాది.

టిబెట్ స్వయంపాలనానికి ఏర్పడ్డ ప్రాతిపదిక తయారీ సంస్థ తాత్కాలిక అధ్యక్షుడు శ్రీ పొచెన్ ఎర్డెనీ, మెక్‌మాహన్ రేఖ అనేది చట్టరీత్యా ఏర్పడ్డది కాదని దాన్ని చైనా ఎప్పుడూ గుర్తించలేదని సెప్టెంబరు 29 ప్రాంతంలో ప్రకటించారు. అంతేగాక "మెక్‌మాహన్ రేఖ" కు దక్షిణంగా హిమాలయ పర్వత పాదభాగం వరకున్న ప్రదేశమంతా చైనాకి చెందినదేనట.

ఇక భారతీయుల సైనిక సన్నాహాలు ఎలా ఉన్నాయో చూద్దాం. కాంగోనించి ఇటీవలే తిరిగి వచ్చిన సైనికులు కొంతమంది దూరపు లక్ష్యం కొట్టే విషయంలో భారత సైనికుల తుపాకులకన్నా అక్కడ నీగ్రోలు వాడిన తుపాకులు ఎన్నో రెట్లు నయమని, నాణ్యమైనవని చెప్పారు. యుద్ధశిక్షణ నేర్పటానికి బదులుగా మన సైన్యాన్ని, అపరిశుభ్రంగా తయారైన సచివాలయంలో ముగ్గు తొలగింపులో వినియోగిస్తున్నారు.

పర్వతశ్రేణికి సంబంధించినంతవరకు ఆ పర్వతపు వాలులు చైనాకు అనుకూలంగా ఉన్నమాట నిజమే. అయినా భారతదేశం కాస్త ముందు చూపుతో రోడ్లను నిర్మించి ఉండాల్సింది. మరి ఈరోజున భారతదేశం నిస్సహాయ స్థితిలో ఉంది. అక్కడ రోడ్లు లేవు. అక్కడ సరఫరాలేవి కావాలన్నా విమానాలమీదనే అందజేయాల్సి వస్తుంది. చైనావారు భారీ ఫిరంగులు, టాంకులు వాడుతున్నారని అంటున్నారు. వారలా చేయగలుగుతున్నారూ అంటే వాళ్లకు రవాణా సదుపాయాలు చాలా బాగా ఉన్నాయన్నమాట.

దేశంలో ఇంత ఉద్రేకస్థితి ఏర్పడినా భారత రాజధానిలో అత్యవసర పరిస్థితి ఏర్పడినట్లు ఎక్కడా దాఖలా కనిపించలేదు. ఆహారధాన్యాలు, రవాణా పరిస్థితి, ఇంధన సామగ్రి పరిస్థితి తెలుసుకొని అదుపులోకి తేవాల్సిన సమయం ప్రభుత్వానికి ఆసన్నమైంది. క్యూబాలో అమెరికా రష్యాలు ఆసియాలో చైనా—భారత తగాదాలవల్ల ప్రపంచ శాంతికి ప్రమాదం ఏర్పడింది. ప్రణాళికలో అని గోల పెట్టేబదులు ప్రభుత్వం ముందు భారత రక్షణ ప్రణాళిక అమలుజరిపితే బాగుంటుంది. ★



# సరాగమాల

వి ఎ కె రంగారావు

## మహామంత్రి తిమ్మరుసు

శాస్త్రీయ సంగీతమును, అతి లలితముగా, మృదుల స్వర, స్వన మిళితముగా సినిమాల కనువైనట్లు మలచి, అటు శాస్త్రీయ సంగీతప్రియులను, ఇటు లలిత సంగీతాభిమానులను, మధ్య సాధారణముగా సినిమాసంగీతమన్న పెడచెవి పెట్టువారిని, తమ ప్రావీణ్యముతో రంజింపజేసి, సంగీతాలయ ప్రాంగణములో తమ కళామూర్తిని సుస్థిరముగా ప్రతిష్ఠ చేసుకున్నవారు శ్రీ పెండ్యాల.

వీరెన్నడూ ఒకేసారి పది చిత్రాలకు సంగీతమందించ ఒప్పుకోలేదు. పది చిత్రాలలో యెనభై పాటలు సాధారణమైనవి, వినిపించేకన్న, మూడునాలుగు చిత్రాలలో ప్రతిపాటను రసస్పష్టిగా, రాగవృష్టి రూపొందించడమే వీరి అభిమతం; అనాదిగా ఉన్న అలవాటు. అందువలనే వీరి పాటలు కేవలం సాధారణ శ్రోతలనేకాక యితర సంగీతదర్శకులను తమ స్వంత సంగీత మాధురిని పయనింపజేయవలసిన వెలుగుబాటలుగా, వింతసంగతులు వెల్లివిరిసిన పూదోటలుగా, సొంపైన శబ్దసంపదలు మధుర వాహినులై ప్రవహించు చోటులుగా ఆకర్షించి, ఆనందపరుస్తాయి. అటువంటి పాటలలో ఒకటి పి. లీల, ఘంటసాల పాడిన "జయవాణి".

"తిమ్మరుసు" చిత్రంలో యిది రెండవ పాట. స్వర రచన చేయుటలో పెండ్యాల లాలిత్యమునకన్న ప్రౌఢత్వమునకే యెక్కువ ప్రాముఖ్యత ఇచ్చారు. ఇది సరి. శృంగార కేళీ లీలావిలాస వినోద సమయములకు లాలిత్యమూ, లావణ్యమూ, నీ నాట్యమెక్కువా, నా సంగీతమెక్కువా యనుప్రశ్న పొడచూపినపుడు ప్రౌఢత్వానిదే పైచేయి. పాండిత్య ప్రకర్షకే పట్టము. జటిల రాగ, తాళ శబ్దములదే ప్రత్యేకత.

మాల్కోసు రాగమున్న ఈ పాట ఒకయెత్తు, పంచమ స్వరమును కలుపుకొని యెలనాగులనూ అలరించు విధాన చివరను వినిపించిన నాగస్వరమొక యెత్తు. సాధారణముగా యిటువంటి భావాలను వినిపించుటకు యే పున్నాగవరాళినో యెన్నుకుంటారు. ఉన్న కళలనే వినిపించి శ్రోతలచే భేషనిపించుకుంటారు. వేరే రాగమును తీసుకొని పంచమాన్ని కలిపి నాగస్వరచ్ఛాయలు చూపిన ఘనత వీరిదే. ఆ సామర్థ్యముకూడ వీరిదే. అలనాటి ఉలూచి ఈ స్వరమును వింటే పార్థుని కాదని పెండ్యాలనే వరించేదేమో ?

పింగళి సాహిత్యం నృత్యానికే కాక అభినయమునకూ అనువైన పదజాలంతో అమరినది.

కలిమిలేములు నెం. 69738

ఆనందావధికి అవతలి అంచు యేది ? సంతోష లహరిలో మహోత్తుంగ తరంగమేది? స్వప్నజగతిలో సప్తస్వరాల సౌందర్యం సంతరించుకొని సంతతం సురభిళ పరిమళాన్వితమై యుండు సరాగమాల యేది ? పై మూడుప్రశ్నలకు ఒకే జవాబు "కలిమిలేములు" చిత్రంలో ఘంటసాల, జానకి పాడిన ఆరుద్ర రచన. "చిలిపి చిలకమ్మ ఆగు, నా చేతిలో ఉయ్యాలలూగు, చేల నందనమందు పాల పిట్టల ముందు చిలికించుతేనెవాగు" అని ప్రియుడు లాలిస్తే "కొంటెకోణంగి ఆగు, నా కొంగు జలతారు పోగు, కొత్త ఊహలలోన, రత్నపల్లకిలోన కోరి పెళ్ళాడి ఊరేగు" అని ప్రేయసి ఊరించదా ? ప్రేయసీప్రియుల రహస్య సంభాషణలను పొంచి విని పాటలోకి యింత రసవత్తరంగా దించటం యెవరికి చేతనౌను? ఆ ఆరుద్రకే. ఈ అపూర్వ శృంగారలీలకు "జగముల నూగించు సమ్మోహడోల" దూ అనగ వరసచేసిన దెవరు ? క్రొత్త గతులలో క్రొంగ్రొత్త సంగతులతో శ్రోతలను పరవశులనూ స్వరవశులనూ చేయటమే చేతయిన అశ్వత్థామ.

ఆరుద్ర, అశ్వత్థామ కలసి ఇంత చక్కగా పాటను సృష్టిస్తే, మనం పాడటం అందుకు యెందుకు తీసిపోవాలని పందెంవేసుకొని పాడారు జానకి, ఘంటసాల. లేదు. త్రుటిలో భూనభోంతరాళమున్న శ్రోతలనందరినీ తమ గాత్రమాధుర్యంచేత మెప్పించగల రెండు గాంధర్వ వివాహంగాలు. కాదు కాదు. మనసునూ, మనసునున్న మమతనూ, మమతనున్న మోహమునూ తమ కంఠపు తీయ దేనియలచే మరపింప చేయుగల ఒక కోయిల జంట.

రెండవప్రక్క ముక్కామల సునంద పాడిన "కలలోని గాలిమేడ" శ్రీశ్రీ వ్రాసిన విషాదగీతం. ఈ పాట కంత ప్రత్యేకత నిచ్చినది సునంద కంఠం. ఇటువంటి కంఠం యిప్పటి సినీజగత్తులో లేదు. ఆ కంఠంలో తిరిగినట్లు సంగతులు బరువుగా మరే కంఠంలోను పలుకవు. ఈ బరువే పాట కొక వింత అందాన్ని సంపాదించిపెడుతున్నది. వాద్యానుసరణలో వినిపించిన విలపిస్తున్న సన్నాయి అశ్వత్థామ మేథకు మరొక తార్కాణం. ఈ రెండు పాటలూ వినండి. భేషనకుండా ఉండగలిగితే నాకు వ్రాయండి.

* * *

నెల్లూరు నారాయణమూర్తిగారికి: "లీలాకృష్ణ", తిమ్మరుసు" చిత్రంలోనిది. పెండ్యాల యింతవరకు సినిమాలలోగాని ప్రైవేటు రికార్డులలోగాని పాడలేదు. వారు పాడగా వినాలని మీకు అంత కోరికగా ఉంటే ఒకటే మార్గం వున్నది. వారు తీరికగావుండే సమయం తెలుసుకొని వారింటికి వెళ్ళి పాడమని ప్రాధేయపడటం. వారి సంగీత సరస్వతిని పూజించే మీలాంటి అభిమానుల కోరికను వారు నిరాకరిస్తారని నే ననుకోను. మీరు కోరినట్లే త్వరలో "బర్త్ ఆఫ్ ఎ సాంగ్" ధోరణిలో ఒక వ్యాసం అందజేయటానికి ప్రయత్నిస్తున్నాను. ఇందులో పాట వ్రాయటానికి కవి మొదట శ్రీకారం చుట్టిన దగ్గరనుంచి సినిమాలో ఆ పాట మీకు వినిపించేదాకా జరిగిన తతంగమంతా వుంటుంది.

ఏమిటే, మీ మిత్రులు నేను వీణ—రంగారావునని వాదిస్తున్నారా ! కాదండోయ్. నేను వి. ఎ. కె. రంగారావును. వారు వీణ (ఎస్) రంగారావు. ఇంతకు ముందు గీతాంజలి వాద్యబృందాన్ని నడిపేవారు. నాలుగేళ్ల క్రిందట "సుమంగళి" అనే తమిళ చిత్రానికి సంగీత దర్శకత్వంవహించి, "విధిసెయిద సదియో అత్తాన్" అన్న పాటకు రెండు శ్రుతులలో అద్భుతమైన వరసకట్టి, బాలసరస్వతీదేవి, శీర్కాళి గోవిందరాజన్లచే పాడించి విన్నవారందరిచేత సెభాష నిపించుకున్నారు. ఆ రికార్డు నంబరు ఎన్. 65648

విస్సాకోడేరునుంచి వ్రాసిన చెరుకువాడ వెంకటరామయ్యగారికి: "చివరకు మిగిలేది" చిత్రంలో పాటలు చాలమట్టుకు శ్రీ మల్లాదివారి కవితా లతను పుష్పించిన పరిమళసుమాలే. ఎం. ఎస్. రామారావు అందులో పాడిన పాట సరాగమాలలో యెప్పుడో పరిచయం చేశాను. ఘంటసాల పాడిన రెండు పాటలనూ త్వరలోనే సమీక్షిస్తాను. వాటి నింతవరకు ఉపేక్షించిన కారణం అవి హేమంత కుమార్ "దీప్ జలే జాయ్" చిత్రానికి సృష్టించిన వరసలకు అనుకరణలు కావటమే.

రామారావు ఈ మధ్య యే పాటలూ పాడలేదు కాని పాడటం విరమించారని అనుకోను. ఒకరోజు వారింటికి వెళ్తే, తాము సంవత్సరంపాటు కృషి చేసి, గీతగోవింద హృదయాన్ని అర్థంచేసుకొని కొత్త రాగాలు కూర్చిన రెండు అష్టపదులు విన్పించారు. అందులో "రమతే యమునా పులిన వనే" అతి రమ్యంగాఉంది. ఇటువంటి చక్కని పాటలు రికార్డులుగా రావాలంటే, మీ కోరికను తెల్పుతూ రికార్డింగ్ రిప్రజెంటేటివ్, సరస్వతిస్టోర్స్, మౌంట్ రోడ్, మద్రాసు—2కు వ్రాయండి. ఏమైనా ఫలితం ఉండవచ్చు.

సరాగమాలలో ప్రైవేటు రికార్డులకి కూడ స్థానమివ్వాలనే నా ఉద్దేశం. కాని ఈమధ్య మంచివేవీ విడుదల కాలేదు. శ్రీనివాస్, జానకి పాడిన పెళ్లిళ్ల పాటల రికార్డు ఒకటి వచ్చింది. వినటానికి అతిపేలవంగా, చప్పగా, అతివిసుగ్గా ఉంది. పేరుప్రఖ్యాతలు ప్రతిభాసంపద గలిగిన యిటువంటి పాటకులు ఈ చవుకబారుపాటలు పాడటమేమిటూ అని నాకు ఆశ్చర్యంకలిగింది. శ్రీనివాస్, జానకివంటి వాళ్ళు పాడతామంటే పాడమనే వాళ్లేకొదవా! నేనూ పాడమంటాను "రామునా చందినాలూ నానోమినా నోమన్నాలాలో" అని. ఎక్కడైనా రికార్డు వేయించి పొలంలో ఊడ్పులు చేయించవచ్చు.

గుప్తస్వరం :

వారంవారం 'చిత్రవ్యక్తులు' మీకు అందజేస్తున్న శ్రీ సుకుమార్, "అతను యెవరు" అనే చిత్రంలో మాధవపెద్ది, సంగీతదర్శకులు వ్యాల్లేశ్వరరావుతో కలసి ఒక బృందగానం పాడారు. ★



నా జూ కు నా తి ఫోటో : గోపు.

# రాణింపుగలనటి 'రాజశ్రీ'

"నిజానికి నాకు మెత్తని పాత్రలూ, ప్రేక్షకాభిమానం సంపాయించే పాత్రలూ అంటే చాలా ఇష్టం. అటువంటి పాత్రలలో కనుపించాలని నాకు ఎంతో ఆశ. ఐతే మనం అనుకున్నవన్నీ అనుకొన్నట్టు జరగవుగా. అందుకనే అన్ని రకాల పాత్రలూ, 'వ్యాంపు' లతో సహా—వేస్తున్నాను." అన్నది రాజశ్రీ నాజూగ్గా సన్నగా నవ్వుతూ, షోగ్గా పొడుగ్గా ఎదిగిన తన గోళ్లవంక ఆప్యాయంగా చూస్తూ.

రాజశ్రీ సినిమాల్లోకి తమాషాగా ప్రవేశించింది. రాజశ్రీ వాళ్లక్కయ్య నిర్మలాదేవి—నటీమణి. ఈమె 'నవ్వితే నవరత్నాలు' చిత్రంలో నటించింది. తర్వాత ఆమె ఆరోగ్యం బాగులేక విరమించుకొన్నది. రాజశ్రీకి ఐదు సంవత్సరాల వయస్సున్నప్పుడు——ఆమె తన అక్కయ్యతో కలిసి, ఏదో పనిమీద ఏ. వి. ఎం. స్టూడియోకు వెళ్లింది. సినిమా స్టూడియోను చూడగానే ఆ అమ్మాయికి స్వర్గాన్ని చూసినట్టు అనిపించింది. అక్కడి మనుషులూ, కెమెరాలూ, లైట్లూ ముఖాలకు రంగులు వేసుకున్న తారలు—వంటివన్నీ ఆ అమ్మాయిని ఆకర్షించాయి. ఆ ఆకర్షణలో పడిపోయి, ఆమె నెమ్మదిగా తన అక్కను వదిలి—ఆ 'తమాషాలను' చూసే కార్యక్రమంలో పడింది. ఆపిల్ల అట్లా సెట్టులోకి వెళ్లి—అక్కడేదో రిహార్సలు జరుగుతూ ఉంటే, కళ్లప్పజెప్పి చూస్తూ నించున్నది. ఆరిహార్సలు ఐపోయాక—"ఇంకొకసారి చెయ్యండి—నేను చూడాలి" అందాపిల్ల. 'సినిమా డైరెక్టరు' అనవలసిన ఈ మాటలు అంటున్నది ఎవరా అని అందరూ ఆశ్చర్యంగా అటు తిరిగారు.—నిజం డైరెక్టరుతో సహా! ఒక చిన్నపిల్ల కనిపించింది.

"ఎవరమ్మాయీ నువ్వు?" అని అడిగారు—దర్శకుడు నారాయణమూర్తిగారు, ఆపిల్ల తనేమిటో చెప్పింది.

అంతలోనే ఆయన ఏమనుకున్నారో గాని—"సరే—మా సినిమాలో వేషం వేస్తావా?" అని అడిగారు. 'హూ' అంది రాజశ్రీ.

"మీ పెద్దవాళ్లు ...."

ఈ సంభాషణలు జరుపుతూ ఉండగానే నిర్మలాదేవి అక్కడికి రావటం, జరిగిన వ్యవహారం తెలుసుకోటం జరిగాయి.

ఆవిధంగా రాజశ్రీ 'నాగులచవితి' చిత్రంలో—మూడు భాషలలోనూ 'చిన్న బహుళ' పాత్రలో (చిన్న జమున) ప్రప్రథమంగా కనిపించింది! 1944 డిసెంబరు 7 వ తేదీన విశాఖపట్నంలో జన్మించిన ఈ పిల్ల—సంవత్సరం వయస్సప్పుడే మద్రాసు రావలసి వచ్చింది— నిర్మలాదేవితో. అంచేత రాజశ్రీ జీవితం అంతా దాదాపు మద్రాసులోనే—సినిమా వాతావరణం మధ్యనే గడచింది. రాజశ్రీ తండ్రిగారు స్టేషనుమాస్టరు ఉద్యోగంచేసి—కాలం చేశారు. వాళ్లమ్మగారికీ అక్కగారికీ ఈ అమ్మాయి అంటే చాలా ముద్దు. ఆ ముద్దు మురిపాలను వారు తీర్చుకునే కార్యక్రమంలో ఆపిల్లకు నాట్యం నేర్పించాలనీ, పాట నేర్పించాలనీ కాన్వెంటులో ఇంగ్లీషు చెప్పించాలనీ—ఇటువంటివన్నీ ఉన్నాయి. మద్రాసులో రాజశ్రీ పెరగసాగింది. ఆమెను కాన్వెంటులో వేద్దామని వాళ్లు అనుకున్నారు. కాని—బొత్తిగా ఇంగ్లీషుచదువులో పడిపోతే, తెలుగు అసలు రాకపోతుందేమోననే భయంచేత, ఆ పిల్లను కాన్వెంటులో పెట్టలేదు—మైలాపూరు కేసరి హైస్కూలులో పెట్టారు. అక్కడ రాజశ్రీ ఐదవఫారందాకా నిరాఘాటంగా చదివింది. రాజశ్రీని పదవఏటనే నృత్యంలోకూడా పెట్టారు. బడిలో చదువుకుంటూనే, ఆ అమ్మాయి అంత శ్రద్ధగానూ నృత్యం నేర్చుకోసాగింది. ఐదారు సంవత్సరాలపాటు ఆ నృత్యాభ్యాసం సాగింది. కొంతకాలం ఆమె ప్రఖ్యాత నృత్యకారుడు—దండాయుధపాణిపిళ్లె దగ్గర కూడా నేర్చుకున్నది.

బడిలో చదువుకుంటున్నప్పుడు—చదువుతోపాటు జరిగే ఆటపాటల్లో ఆమె విధిగా పాల్గొనేది. చిన్న చిన్న నాటకాల్లో కూడా పాత్రలు ధరించేది. ఈవిధంగా జరుగుతూ ఉండగా—నాగయ్యగారి 'రామదాసు' చిత్రంలోకి—ఒక అమ్మాయి కావాలసి వచ్చింది. చిన్న గోపన్న భార్య వేషానికి—ఎవరా అని వెతికి వెతికి—రాజశ్రీకి ఇచ్చారు నాగయ్యగారు. అప్పుడామె నాలుగోఫారం చదువుతున్నది.

ఏ. వి. యమ్. స్టూడియో అధిపతి—మెయ్యప్పన్, కొత్త ఆర్టిస్టులను తయారుచేసే ఉద్దేశంలో వుండి—రాజశ్రీకి అవకాశం కల్పించారు. కన్నూ ముక్కూ తీరుగావుండి, ఆ ఉత్సాహంఉన్న వాళ్లకోసం ఆయన వెతకసాగారు. అప్పుడే ఆయనకు రాజశ్రీ తారసిల్లింది.

"ఈ అమ్మాయికి నాజూకైన ముక్కూ, గుండ్రని ముఖమూ, మంచి కళ్లూ ఉన్నాయి. బాగా నాట్యం చేస్తుంది. నాటకాల అనుభవంవుంది. ఇటువంటి అమ్మాయిని తయారుచేస్తే బావుంటుంది" అని మెయ్యప్పన్ భావించి—రాజశ్రీని అడిగారు. ఇంట్లో వాళ్లంతా కలిసి కొన్ని తర్జన భర్జనలు సలుపుకుని—చివరకు అంగీకరించారు. ఎంచేతంటే ఆ అమ్మాయి చదువు మధ్యలో చెడుతుంది! అప్పుడామె ఐదోఫారం చదువుకుంటున్నది. స్టూడియోలో చేరాలంటే చదువుకు స్వస్తి చెప్పాల్సిందే! ఐతే ఈ ఉత్సాహంకన్నా ఆ ఉత్సాహమే ఎక్కువగా ఉండటంవల్ల రాజశ్రీ స్టూడియోవేపు మొగ్గింది—స్కూలుకు గుడ్‌బై కొట్టి.

—45 వ పేజీ చూడండి



చిన్నప్పుడు

# ఆపదలో ఆదుకోలేని నాయకత్వం

ఐ. ఎల్. ఎస్.

దీపావళి పండగంటె పిన్నలకు, పెద్దలకూ కూడా సరదే! పండగ ఇంకా రెండుమూడురోజు లుందవంగానే, హడావిడి యెక్కువయిపోతుంది. ఢాం ఢాం మోతలతో దద్దరిల్లుతూ ఉంటుంది. ఇవన్నీ హర్షామోదాలు వ్యక్తం చెయ్యటానికే! దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగిననాడు ప్రజలు పరవశులై తమ సంతోషాన్ని తరతరాల్నుంచి ఈ విధంగా ప్రదర్శిస్తూనే ఉన్నారు. నరక చతుర్దశని ఆ రాక్షసుని పేరే పిలుచుకుంటున్నాం. ఎప్పుడో ఎక్కడో పురాణాల్లో హతమార్చబడ్డ ప్రజాకంటకుడు నరకుని పేర ఈనాటికీ దీపాలు పెట్టుకుంటూ మతాబులు కాలుస్తున్నాం; టపాకాయలు పేలుస్తున్నాం. దుష్టత్వం నశించిందంటే, ఈజాతి ఎంత ఉత్సాహపడుతుందో ఇదే నిదర్శనం. సర్వేజనాః సుఖినో భవంతు అని భారతీయుల ఆశయం, ఇతరులకు చెడు కోరలేని మనస్తత్వం, మన మంచితనాన్ని యితరులలో చూసుకుంటూ తృప్తిపడే అమాయక ప్రజ.

ఇలాంటి ప్రజ ముచ్చటగా, దీపావళి అమావాస్యనాడు, తీరుగా దీపాలు పెట్టుకుని, సంతోష సంరంభాలలో మునిగితేలుతూఉంటే ఇలాంటి ప్రజలనుగన్న భారతదేశాన్ని కబళిద్దామని, కమ్యూనిస్టు చైనా విజృంభించి, మర ఫిరంగులు కాల్చింది. శాంతి-దాహంతో, దేశదేశాలు తిరిగిన మన నాయకుల్ని అపార్థం చేసుకుంది. మన మంచితనాన్ని, దౌర్బల్యంక్రింద జమకట్టేసింది. ఏమిటి ఈ అకారణమైన దండయాత్ర? వేలసంవత్సరాల్నుంచి, ఇరుగుపొరుగు దేశాలుగా మెలగుతూ, సాంస్కృతిక సంబంధాలు నెలకొల్పుకుంటూ, పంచశీలకు బద్ధులమై ఉంటామని ఉభయులం ప్రమాణాలు చేసుకున్నామే! ఈ పరిస్థితుల్లో, కమ్యూనిస్టు చైనావారికి మన దేశంమీద ఈ దారుణమైన క్రౌర్యం ఎందుకుఅని అందరి మనస్సులను కలవరపెట్టేసింది. చైతన్య హీనులైపోయారు. పండగనే భావం మనస్సుల్లోంచి తొలగిపోయింది. ఇది భారతదేశ మనుగడకే తీరని ముప్పు! ఏమిటి చెయ్యటం! మన నాయకులు ఏం చేస్తున్నారు? ఆ దురాక్రమణను తట్టుకునే సైన్యం మనకున్నదా! అధునాతన మారణ యంత్రాలు ఉపయోగిస్తున్న కమ్యూనిస్టుచైనాను, మన సైన్యం తట్టుకోగలదా! మనకు కూడా అలాంటి సామగ్రి ఉన్నదా! మనమీద ప్రేమ చూపిస్తున్న రష్యావారు యిప్పుడు ఏమంటారు! మన విదేశ విధానాన్ని, భేషుగ్గా ఉందని మెచ్చుకున్న రాజ్యాలు మూగనోము పట్టినాయి! భారతీయులుగా వుంటూ, మనం ఈ విషమ పరిస్థితుల్లో చెయ్యాలసిన కర్తవ్య మేమిటి? ఈ సామాన్య ప్రశ్నలన్నీ అందర్నీ నిలవేసినాయి! ప్రతి హృదయం చివుక్కుమంది.

గతించిన చరిత్ర ఇట్టే స్ఫురణకు వచ్చింది. నిన్న మొన్నటిదాక, దేశ స్వాతంత్ర్యం కోసం పోట్లాడి, అపారమైన త్యాగాలు చేసి మాతృదేశ గౌరవాన్ని నిలబెట్టుకున్నాం; స్వేచ్ఛా వాయువులు పీల్చుకుంటున్నాం. మనవాళ్లే మనల్ని పరిపాలించి, మనకేదో ఒరగపెడతారనుకుంటే, ఆ యోగ్యత లేకపోయింది. ప్రణాళికలమీద ప్రణాళికలు వేస్తున్నారు. రూపాయి నోట్లు అచ్చుకొట్టి, దేశంమీద విరజిమ్మేశారు. అందినవాళ్లు సుఖపడుతున్నారు. అందనివాళ్లు బాధపడుతున్నారు. రోజురోజుకు పన్నులు అధికమవుతున్నాయి. ధరలు పెరిగిపోతున్నాయి. ప్రభుత్వం వారిని నిలవేసి అడుగుతుంటే—ఇది సంధియుగం, ఆర్ధిక సమానత్వం సంపాదించటానికి మేము ఎన్నో విధాలుగా ప్రయత్నాలు చేస్తున్నాం. ప్రజలందరూ కూడా శక్తివంచనలేకుండా, ఈ మహాయజ్ఞంలో బలి అయిపోవాల్సిందే! ఇంకా యెన్నో త్యాగాలు చెయ్యాలి; ఇప్పుడే భయపడిపోతే యెట్లాగు! భావి తరంవారిని దృష్టిలో ఉంచుకుని, వాళ్ల శ్రేయస్సుకోసం, ఏత్యాగం చేయటానికైనా సిద్ధపడాలి అని ఉద్బోధిస్తున్నారు. నిజం గాబోలు అనుకున్నారు కొంతమంది. ఇది మహా అన్యాయం అని ఆక్రోశించారు కొంతమంది. ఏమైనా బాధలు త్యాగాలు తప్పలేదు. కష్టాలు అంతకంటే మీదకొచ్చిపడుతున్నాయి. చేసేదేమీలేక, అన్నింటిని తప్పనిసరిగా భరిస్తూ, గుణుస్తున్నారు.

కాని, ఈనాడు వాటన్నింటికి మించిన విపత్తు వచ్చిపడింది. స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవలసిన అవసరంవచ్చింది. ప్రతి భారతీయుడు నడుంకట్టి, దేశభక్తిని చాటాలిసిన ఆవశ్యకత యేర్పడింది. ప్రజలంతా ఉద్రిక్తులయ్యారు. దేశంకోసం, మేము యేమి చెయ్యటానికైనా సిద్ధంగా ఉన్నామని ఘోషపెట్టారు. రక్తదానం చేస్తామంటున్నారు. ఉత్తర సరిహద్దుల్లోకి వెళ్లి, శత్రువులను చీల్చి చెండాడుతామంటున్నారు. డబ్బు విరాళాలు యిస్తామన్నారు జాతీయ రక్షణ నిధికి. ఈ ఆవేశం, ఈ ఆత్మార్పణం ఒకరు చెప్పితే వచ్చిందికాదు. నరనరాల్లో జీర్ణించుకుపోయిన దేశభక్తి ప్రజల్ని ఈ విధంగా ముందంజ వేయిస్తోంది.

కొంతమంది నవయువకులు, కవులు, మిత్రులు, దేశభక్తులు కలుసుకున్నారు.

'తెల్లని శాంతి ప్రవహించే హిమాలయాలకు రక్తంమంటలు అంటుకున్నాయి' అన్నాడు ఓ యువకుడు.

'మా నెత్తురుతో నిండిన దేశం—దీపం, చివరి చుక్కవరకు జ్వలిస్తూ వుంటుందంటూ, నేఫా కొండలు దద్దరిల్లుతున్నవేళ, మంచు కురుస్తున్న రాత్రి, మెషిన్‌గన్‌ల మెరుపుల్లో మా కన్నుల దీపాల వెలుగులో జాబు వ్రాస్తున్నానంటూ ఘోషించాడు ఓ దేశభక్తుడు.

బహిరంగ సభ జరిపారు; సుల్తాన్‌బజార్ నడివీధుల్లోకి వచ్చి 'చైనాసురుణ్ణి' దగ్ధం చేశారు.

కాని హృదయంలో రగుల్కొన్న మంటలు ఇంకా ప్రజ్వరిల్లుతూనే ఉన్నాయి.

మన సైనికులు వీరోచితంగా పోరాడి తల్లి ఒడిలోకి ఒరిగిపోతున్నారనే వార్తలు కలవరపెట్టేస్తున్నాయి. ఇప్పటికే ఆవిధంగా ఆత్మార్పణం చేసినవారి సంఖ్య వేలల్లోకి వచ్చేసింది. కాని శత్రు విజృంభణ తగ్గుమొహం కనిపించటంలేదు. ప్రజలంతా నిస్సహాయులై ఉద్రిక్తులయిపోతున్నారు.

ఏమి చెయ్యటానికైనా తయారని తమ సంసిద్ధత తెలియపరుస్తున్నారు. వివిధ పార్టీలవారు, వర్తకులు, వాణిజ్యప్రముఖులు, కార్మికులు, కర్షకులు, కళాకారులు—అందరూకూడా ఒక్కుమ్మడిగా ఈ దుర్మార్గాన్ని ఎదుర్కొనటానికి సిద్ధంగా ఉన్నారు. అయితే ఆనాడు దేశప్రజల్ని ఉద్రూతలూగించిన గాంధీజీ నాయకత్వంలాంటి నాయకత్వం ఈనాడేది? కాని ప్రభుత్వం మన చేతుల్లోనేఉంది. మనదేశానికి ఏది మంచో చక్కగా ఆలోచించి చెయ్యవలసిన బాధ్యత ప్రభుత్వాధిపతులమీద ఉందనటం నిర్వివాదాంశం. ఏళ్లతరబడిగా మనదేశాన్ని ఆక్రమించుకుందామనే శత్రువు దురుద్దేశాన్ని మన నాయకులు గుర్తించలేకపోవటం దురదృష్టకరం! ఇది పరిపాలనాదక్షత అనిపించుకోదు. దేశాన్ని సమర్థవంతంగా పరిపాలించలేదంటానికి యిదొక నిదర్శనం. ప్రతిదేశ అంతరంగిక వ్యవహారాల్లోనూ అవసరమున్నా, అవసరం లేకపోయినా, సలహాలు యిస్తూ, శత్రువులను చేసుకున్నాం. మనకు సహాయం చేస్తామన్న దేశాలను వద్దని కసరికొట్టాం. మాలో అతీతమైన శక్తి వకటిఉంది; మీ అందరి దేశాలకు వ్యతిరిక్తంగా, మా విదేశవిధానాన్ని రూపొందిస్తామని సగర్వంగా చెప్పుకున్నాం. టిబెట్టును చేతులారా పోగొట్టుకున్నాం. నేపాల్‌తో విరోధం తెచ్చుకున్నాం. ఇవన్నీ ప్రభుత్వాధినేతలు ఈ పదిహేనేళ్లనుంచి సాధించిన ఘనకార్యాలలో కొద్దిమాత్రమే!

ఇప్పుడు గతించిన విషయాలను విమర్శిస్తూ కాలయాపన చేస్తే ప్రయోజనంలేదు. మన దృక్పథంలో పూర్తి మార్పు రావాలి! మన విదేశ విధానాన్ని పరిస్థితులకు అనుగుణంగా మలుచుకోవాలి. మన నాయకుల దృష్టి యితర దేశాలమీదనుంచి మరలి మన దేశ భవిష్యత్తువైపుకు మరలాలి. కమ్యూనిస్టు చైనాను తీవ్రంగా ప్రతిఘటించి, అంతిమ విజయం మనదేనని కార్యరూపేణ చూపెట్టాలి. ప్రజలలో, ఈ విషయాన్ని గురించిన పూర్తి విశ్వాసాన్ని నెలకొల్పాలి. దేశభక్తి ప్రబోధితులై, ఉద్రిక్తులయిఉన్న ఈ ప్రజలకు ఈ ప్రభుత్వ విధానాలపట్ల విశ్వాసం లేకపోతే, మరింత ప్రమాదం. ఇంకా వారు చొచ్చుకు రాకమునుపే, తగిన ఆయుధాలను ఇచ్చి, సైనికులకు మరింత ఆత్మవిశ్వాసం కలుగచెయ్యాలి. ఇంత ప్రమాద పరిస్థితుల్లో కూడా, తక్షణం మన దేశానికి యేది మంచో నిర్ణయించుకోలేకపోతే, ప్రజలే తగిన గుణపాఠం చెప్పగలరు. 



# విశాలనేత్రాలు

పిలకా గణపతి శాస్త్రి

## జరిగిన కథ

నిచుళానగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరిని అర్ధరాత్రి కలుసుకొనవచ్చి రంగనాయకుడు, కావలివారిని గాయపరిచిపోతాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం హేమసుందరిని వలచిన తన ప్రియుడు తిరుమలరెడ్డికి చెబుతుంది. రంగనాయకుడు, హేమసుందరికోసం ఆలయ గోపురంమీదకిపోయి రెడ్డి పంపిన సింహాచలాన్ని ఎదుర్కొని బలమైన గాయాలతో ఇంటికి చేరుకుంటాడు. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేస్తుంది. నాంచారమ్మ సాయంతో రంగనాయకుడు హేమసుందరిని కలుసుకుంటాడు. తిరుమలరెడ్డి ఇంటో దొంగతనం జరుగుతుంది. రంగనాయకుడు, హేమసుందరి శ్రీరంగం పారిపోతారు. హేమసుందరి కన్యకాదని రంగనాయకుడు తెలుసుకుంటాడు. తనని గాయపరచవచ్చిన సింహాచలాన్ని చంపివేస్తాడు. విశాలనేత్రాల మొక్కు చెల్లించి వస్తుండగా హేమసుందరీ రంగనాయకులకు రామానుజ యతీంద్రుల దర్శనం కలిగి గాఢాభిమానంగా మారి అంతేవాసులకు అసూయ రేకెత్తిస్తుంది. యతీంద్రుని దయవల్ల రంగనాయకునికి విశాలనేత్ర దర్శనం కలుగుతుంది. రంగనాయకునిలో మార్పు గమనించిన హేమసుందరి రామానుజులకు సందర్శిస్తుంది.

## 24

రంగనాయకుడు రామానుజ మఠ ప్రాంగణంలో అడుగుపెట్టిననాడే అతనినిగూర్చి పుకారు లొకటి రెండు బయలుదేరాయి. క్రమక్రమంగా అతని యెడల ఆచార్యుని వాత్సల్య దృష్టి అతిశయించిన కొద్దీ అవి మరింతగా విజృంభించాయి. రంగనాయకుని భుజంమీద ఆలవోకగా ఆనుకొని రామానుజుడెంతో ఆత్మీయతతో ప్రసంగిస్తూ శ్రీరంగేశుని సందర్శనంకోసం బయలుదేరడం మొట్టమొదట మఠ బ్రహ్మచారులలో కొందరి కెంతో విడ్డూరంగా కనబడింది. అయితే ప్రముఖులయిన అంతేవాసులెవ్వరు దానికంతగా ఆశ్చర్యపడలేదు. ఆశ్రయించిన అనుచరుల యెడల రామానుజుని అపూర్వాదరణ ధోరణు లింతకుమునుపు వా రెన్నో మారులు తామై స్వయంగా పరిశీలించారు. అందుచేత మరికొన్నాళ్ల వరకు కేవలం తటస్థదృష్టితో తమ కేమి పట్టనట్టు మాట్లాడకూరుకొన్నారు. కాని క్రమక్రమంగా రంగనాయకుని యెడల రామానుజుని వాత్సల్య వైఖరి బాగా మితిమీరిన పిమ్మట వారిలో వారి

47 వ పేజీ చూడండి

# హరివంశము

హారీత శివశర్మ

## ఉజ్జయినీపర్వం-5

మహాకాళనాథుని ఆరాధించి రాజదంపతులు ఇంటికి వచ్చువేళకు పెద్దయు ప్రొద్దుపోయినది. మహారాజునకుగాని, మహారాణికిగాని ఆరాత్రి సుఖముగా నిద్ర పట్టలేదు. వారు ఆలోచనాధీనులయినారు. ఆచార్య సాందీపనితో గూడ రామకృష్ణులును, ఇతర యాదవ కుమారులును వచ్చుచున్నారు. వారనిన తమ బిడ్డలకు పడుటలేదు. ఈ పడకపోవుట ఎట్లు పరిణమించును ? మరియు ఈ విందుడును, ఈ అనువిందుడును ఇప్పుడే వారిని అమర్యాద చేయుచో నేమి చేయవలయును ! అవమానించుచో నేమి చేయవలయును ! మహారాజునకు తాను చేయుచున్న ఈ ప్రయత్నమిట్టుల వ్యర్థమగునేమో యన్న భయము లోపల గట్టిగా నున్నది. ఆ రాత్రి యంతయు నాయన దానిని గూర్చియే తలపోసెను. మహారాణి యాలోచనములు వేరు. ఆమె తన కుమార్తె మిత్రవిందను గురించియే ఆలోచించెను. ఈ బిడ్డ తన మేనల్లునియందు చేయుచున్న ప్రేమ తన పుత్రు లెరుగుదురో యని ఆలోచించెను. ఇప్పుడు మిత్రవింద ఏమి చేయుచుండును. పిల్లదాని మందిరములు తన మందిరములకు కొంచె మావలగా నున్నవి. వృద్ధనారీ పరిరక్షణలో ఆమె సుఖముగా నిద్రించి యుండును. ఆ ఆలోచనము రాగా ఆమెకు నవ్వు వచ్చెను. తనలో తాను నవ్వుకొనెను. వామాక్షియు, మిత్రవిందయు శ్రీ కృష్ణుని గురించి మాట్లాడుకొనుచుండురు. పోయి పిల్లను చూచి వత్తునా అనుకొన్నది రాజాధిదేవి. మరల మనస్సును కట్టుకొన్నది. ఆమె ఆలోచనము లిప్పుడు విందానువిందుల గురించి సాగినవి. ఈ రెండు దినములుగా వారు తనకు కన్పించలేదు. మహారాజునకు కన్పించినారు గనుకనా ! ఎప్పుడు వచ్చుచున్నారో, ఎప్పుడు పోవుచున్నారో ! మహారాజు గూడ వారిని గురించి తనకేమియు చెప్పుటలేదు. తన ఇంటిలోని ఈ స్థితిని తలంచుకొని, ఉస్సురని యామె మహాకాళనాథుని స్మరించినది. ఆకాశములోని బహుళ సప్తమినాటి చంద్రుడు గవాక్షముల నుండి పరమశివుని తలమీది చంద్రవంక వలె వెలుగొందినాడు.

తెల్లవారి రోహిణితో కూడిన అష్టమి. విస్పష్టమైన సూర్యదేవుని కాంతి జాలముల విచ్ఛలోని ఎఱ్ఱని లేతదనము నంతను తనయం దిముడ్చుకొని ఉషస్సు తూర్పు దిగ్భిత్తికలలో ఆ తెల్లవారి విస్తరించినది. అంతవరకును మందేహులవెడి రాక్షసుల శరీరముల కాంతులను పోని చీకటు లా కాంతుల చేత గ్రసింపబడినవి. ఆదిమత్స్యమైన విష్ణువు సోమకుని సంహరించి ఉషస్సూక్తములతోడి వేదములను రక్షించిన సంతోషములో మధుర మహాట్టహాసముతో వికసించినట్లు, మందర పర్వతము యొక్క ఒరిపిడివలన పుట్టిన వేడిమికి తాళుకొనలేక పాలసముద్రము సలసల కాగి ఆదికూర్మము యొక్క వెన్ను భాగమును ఎఱ్ఱవడిన తన నురుగులతో ముంచి ఎత్తినట్లు, రక్తో హిరణ్యాక్ష నిర్మథనవేళా సంజనిత రక్తధారా తరంగ సందోహ సమాచ్ఛాదిత ఆది వరాహ దంష్ట్రాగ్రస్థిత వసుంధరా సుందర మందహాస సమ్మిళిత కవోష్ణ వ్రీడావృడాసీ మధురాంపాంగములు చిమ్మరేగినట్లు, నృసింహావతార ఆవిర్భావ వేళయందు హిరణ్యకశిపు మందిర స్తంభము ఫెడేలున విరిగి మహావిష్ణువు అంగీకరించిన కపట నృహరివేష శిరఃకాంతిచ్ఛటా సటాజాలములు ప్రొద్దు సహోదయాంశువులు పోసినట్లు, బలి ప్రబల శోభన ప్రతిఘటనోద్భటుడైన వామనుడు త్రివిక్రమస్ఫూర్తితో భూర్భువస్సువర్లోకముల నాక్రమించినవేళ బింబఫలములను పోని ఆయన ఊర్ధ్వాధరోష్ఠముల కాంతులు గుత్తుగుత్తులై అంతరిక్ష పూర్వార్థ దిక్కుడుంగములలో మంకెనపూవులు పూసినట్లు, ఏకవింశతి వారములు దుష్ట క్షత్రకంఠనాళములను గండ్రగొడ్డలితో కుద్దాలించి ఆ రక్తములచేత తడిసి ముప్పందుమైన తన కుఠారమును శమంతక పంచకములో కడిగి పదునుపెట్టగా కృపీటయోని కాంతులను ధిక్కరించుచు పుట్టిన నిప్పుకల రవ్వలు బంధూకపుష్ప మర్యాదములై ఆబద్ధమాలారవ్యముగ ఉదయ పర్వత సానుదేశములయందు ఆరక్తధాతు కాంతి మచ్ఛటా సుందరములై వ్యాపించినట్లు, సీతా ప్రథమ సందర్శనవేళా మహోద్విగ్న శ్రీరామచంద్ర హృదయాంతర పరిస్పందిత కవోష్ణ రక్తధారా ప్రవాహములు మధుర వ్రీడా సంశ్లిష్ట బంధుర మందహాస సుందరములై వినిర్మల నీలాకాశమును పోని ఆయన శరీరమునం దెఱ్ఱని కాంతులై తత్క్షణమాత్ర వ్యాపకములైనట్లు ఆ అష్టమినాటి యుషస్సు సుందరమై వేదమువలె అర్థవంతమై, పరమేష్ఠి ప్రథమ సృష్టివలె మనోహరమై, సర్వ లోకములకు సుఖమై ప్రకాశించినది. ఆహ్లాద సంజనకమై విస్తరించినది. శ్రీ కృష్ణునితోడి రథసారథ్యమున జిగీష పెంచుకొని పిచ్చుకకుంటు హెచ్చిన రోషముతో సప్త వర్ణకములు సుందరములు నైన హయములను పూన్చిన సూర్యుని రథమును తొందరించినట్లున్నాడు, ఉషస్సు తెల్లపోయినది. ఉతికి చలువచేసిన చెంగావి పాత వస్త్రమువలె కొంతకు తెల్లబడినది. మహారాజు నిత్యాగ్నిహోత్రి. అగ్నిగృహములో ఆయనచేత అర్చింపబడిన జాతవేదుడు ఏడు జిహ్వలతో ప్రదక్షిణ జ్వాలారమ్యముగా వెలుగొందినాడు. రాజాధిదేవి ఆ కాంతులలో వశిష్ఠునితోడి అరుంధతి వలె ప్రకాశించినది. రాత్రి నిద్రలేమి ఆమె కన్నుల పంకజమిత్రుని కాంతులకు తాళక ముకుళితములైన ఎఱ్ఱ కల్వపూవుల రేకులవలె అర్ధనిమీలితములై యున్నవి. క్షత్రియోచిత నిత్య నైమిత్తిక వైదిక కర్మలను సపురోహితుడై జయత్సేనుడు ముగించినాడు. మంత్రులును, దండనాథులును, బంధువులును, పురప్రముఖులును వచ్చి రాజుయొక్క యాగమనము కొరకు వేచియున్నారు. రథములు సిద్ధము చేయబడి యున్నవి. మహారాజు భార్యాద్వితీయుడై రాగా, సర్వ ప్రకృతిజనమును జయజయ ధ్వానములు చేసినారు. మహారాజు అచ్చట నందరను చూచినాడు. ఆ చూపులతోడి కన్నులను రాజాధిదేవి కన్నులయందు లగ్నము చేసినాడు. ఆ కన్నులలో ప్రశ్న యున్నది. ఆమె కా ప్రశ్న యర్థమైనది. విందానువిందులు ఇంకను రాలేదు. వారు రారు. తండ్రిని ప్రతి చిన్న విషయమునను కికురించుట వారికి నైజమై పోయినది. ఆమె ఉస్సు రనుకొన్నది. మహారాజు మందహాసము చేసినాడు. మహాకాళనాథుని దేవాలయ శిఖరముల యందలి బంగారు కుంభములు సూర్యదేవుని ఉదయకిరణ మందహాసములలో పరమశివుని మూడవ కంటి కనీనికలను పోలి ప్రకాశించినవి. ఆ దర్శనము మహారాజునకు కించిద్దుఃఖమును కల్గించినది. మహారాణి మహాకాళనాథావసథము దిక్కునకై చేతులెత్తి నమస్కరించినది. అమ్మవారిని మనస్సులో స్మరించినది.

(సశేషం)

# శ్రీవారితో చెప్పకూడనిదేమిటి?

కన్నెకంటి పార్వతీదేవి

శ్రీవారితో కూడా చెప్పకూడని రహస్యాలంటూ శ్రీమతికి ఉంటాయా? అసలు అలా ఉండవచ్చా? అట్లా ఉండటం తప్పుకాదా? కాదు .... ఎందుకంటే కొన్ని విషయాలు శ్రీవారికి తెలియకపోతే నష్టంలేదు సరికదా జీవితంలో ఆ విషయం తెలిసినందువలన తుపానులు చెలరేగవచ్చు. అగ్ని పర్వతాలు బ్రద్దలవవచ్చు. ఎందుకంటే స్త్రీ, పురుష మనస్తత్వాలలో చాలా భేదముంది. అన్యోన్యంగా సంసారం గడపటానికి కొన్ని విషయాలను గోప్యంగా ఉంచాల్సిందే..అలాకాక వారికి, నాకు మధ్య రహస్యాలేమిటి? అని మీరు నిష్కల్మషంగా అన్నీ వారితో చెప్తారా? అందులో వారికి బాధను కలిగించేవి ఉంటే ఆ బాధను వారు జీవితాంతం మరచిపోలేరు. ఒకటి ఆలోచించండి. మీ భర్త మీ వివాహానికి పూర్వము ఒక అమ్మాయిని వివాహం చేసుకోవాలని మనసు పడ్డారనుకోండి. విధి అనుకూలించక వారికి వివాహం కాక, మిమ్ములను చేసుకొన్నారనుకోండి.. నిజంగా మిమ్ములను ఎంతగానో ప్రేమిస్తున్నారు మీవారు.. ఈ విషయం మీకు తెలియకపోతేనే మంచిది. తెలిసిందా! మీవారు ఏ పనిచేసినా మీకు అనుమానమే! మీవారు ఇంకా ఆ అమ్మాయిని మరచిపోలేదని మీరు అనుకుంటారు. మీ మనసుఎంతో వ్యథ పడుతుంది. చూశారా! ఈ విషయం మీకు తెలియనందువలన నష్టంలేదు సరిగదా, తెలిసినందువలన కష్టపడ్తారు. ఇలాగే కొన్ని విషయా లుంటవి.

మీరు అందంగా ఉండటం, అనుకూలంగా ఉండటమే ముఖ్యంకాదు. సమయాసమయాలెరిగి మాట్లాడటం, మెలగటం చాలా అవసరం. వారిని మీరు ఏమైనా అడగాలనుకున్నా, లేక వారికి ఏ విషయమైనా చెప్పాలనుకున్నా వారి మనస్సును తెలుసుకోవటం చాలా అవసరం.. అలా చేయకపోతే మన కోరికలు నెరవేరవు-సరికదా తిరుగా చివాట్లు కూడా పొందవలసి వస్తుంది.. మీరు మంచివారు కావచ్చు. మీ కోర్కె సమంజసమైనదే కావచ్చు. మీ భర్త ఉత్తములే కావచ్చు. కాని అసందర్భ సంభాషణ వారిలో అలజడిని కలిగింపవచ్చు.. అందుకని వారితో మాట్లాడేముందు ఆలోచన, విధానం ఎంతో అవసరం. ఇది వారికి సంతోషాన్ని కలిగించటమే కాకుండా, మీపై ప్రేమను, సానుభూతిని అధికతరంచేసే అవకాశంకూడా ఉంటుంది. మిమ్ములను మెచ్చుకొని అభినందిస్తారే కాని తిరస్కరించరు. కాని సమయాన్ని గుర్తెరగక మీరు ఎంతో ప్రేమతో ఆనందంతో చెప్పిన విషయమే వారికి చిరాకు కలిగించి బాధపెడుతుంది. ఇలాటివి నిత్యజీవితంలో [illegible] తప్పుకుకూడా మనం శిక్ష అనుభవించాల్సివస్తుంది.. ఆ శిక్షనుండి తప్పించుకోలేము. ఎందుకంటే తెలిసి చేసినా, తెలియక చేసినా నేరము నేరమే. తెలివిగా మెలగి ఈ పరిస్థితుల బారినుండి మనం తప్పించుకోవచ్చు. ఇవి నివార్యాలేకాని అనివార్యాలుకావు.

మీ శ్రీవారు ఆఫీసులో ఉద్యోగిగా ఉన్నారనుకోండి. వారు పగలల్లా ఆఫీసులో పనిచేసి అలసి సాయంత్రానికి ఇంటికి వస్తారు. కొద్దిక్షణాలు క్రితం వారు ఏ వాతావరణంనుండి వచ్చారో మీకు తెలియదు. ఆఫీసులో పై ఆఫీసరుచే అవమానింపబడినారో.. లేక అభినందింపబడినారో.. అప్పుడు మీకు రిబ్బను తెమ్మని చెబుదామనే ఆలోచన వచ్చింది. వారు రాగానే "ఏమండీ! ఒక నైలాన్ రిబ్బను తేవాలండీ" అని అన్నారనుకోండి.. వారు ఆఫీసులో అవమానింపబడినారా "ఆ.. నీ ముఖానికి అదొకటే తక్కువ ఇప్పుడు.. గుడ్డపేలిక కట్టుకో" అని విసుగుగా విసురుగా అంటారు.. అలా అంటే మీ మనసు ఎంత బాధపడుతుందది చెప్పండి.. మీ వదనంలో విషాదమేఘాలు అలముకొని హాసం మాసిపోతుంది.. ముఖంమాడిపోతుంది.. అలాకాక అభినందనలు పొంది వచ్చారనుకోండి. అప్పుడు 'ఆ వెధవ నైలాన్ రిబ్బనేమిటి. అసలు నీవు జడకుప్పెలు అడిగి ఉండాల్సింది?'' పోనీలే.. అలానే తెస్తాను'' అని అంటారు చిరునవ్వులు చిందిస్తూ. చూశారా! మీరు వారి మనస్సు అర్థం చేసుకోక పోవటమువలన ఒక ఛాన్సునే పోగొట్టుకున్నారు. అలా మనం సమయాసమయాలను ఆకళింపు చేసికొంటే అవాంఛనీయ పరిస్థితులనుండి తప్పించుకొని జీవితాన్ని, సంసారాన్ని సుఖమయం చేసుకోవచ్చు.. పొందదగినదానికంటే ఎక్కువ సుఖాన్ని, సంతోషాన్ని పొందవచ్చు. మీ గృహాన్ని స్వర్గసీమగా చేసికోవచ్చు. అందుకు అవసరమయ్యే కొన్ని విషయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను?

ఎప్పుడైనా కాని మీ శ్రీవారితో మీ వివాహానికి పూర్వము మీకు వచ్చిన సంబంధాలను గురించి కాని, మిమ్ములను వివాహంచేసుకోవాలని కోరుకున్నవారిని గురించి చెప్పటంకాని, వారి గుణగణాలను పొగడటంకాని చేయకండి. అలా చేస్తే వెంటనే మీవారు "ఆలా అయితే అతనినే వివాహంచేసుకో పోయావా?" అని అంటారు.. అలా అన్నప్పుడు వారి హృదయమేకాక, మీ హృదయంకూడా బాధ పడుతుంది.

ఒక్కొక్కసారి వారు "అబ్బ! మా అమ్మ వట్టి పిచ్చిది." అని మీతో అన్నారనుకోండి.. అప్పుడు మీరు "అవును మీ అమ్మ చాలా పిచ్చి [illegible]'' [illegible] నిజంగా మా అమ్మ పిచ్చిది అని అనటంలేదు.'' అని అంటారు.. అప్పుడు మీ పరిస్థితి?! సందిగ్ధంలో పడుతుంది.. అందుకని "ఆ. అమాయకురాలు.. వృద్ధాప్యంలో ఒంటరిగా ఉంటోంది. ఆమెకు మనం ఇంకా చేయాలండీ'' అని అన్నారా మీభర్త సానుభూతిని ఎంతో సులభంగా పొందుతారు.

"చూశారా...." "ఫలానా ఆవిడ ఎంత బాధ పడుతుందో'' అని వారితో అనకండి. అలా అన్నందువలన ఆమె భర్తను ఆక్షేపించిన వారౌతారు. అందువలన మీవారిదృష్టిలో మీరు చేయని నేరము చేసిన వారవుతారు.. అలాకాక "ఫలానా దంపతులు ఒకరి నొకరు అర్థంచేసుకోలేక పోతున్నారు'' అని అన్నారా.. మీరు మీవారిని అర్థంచేసుకొన్నట్లు భావించుతారు.. సంతోషిస్తారు..

"నేను అలసిపోయాను'' అని వారితో ఎప్పుడూ అనకండి. వారు మీ మాటకు సమాధానమివ్వరు.. "ఆ.... ఎవరి పనివారు చేసుకోవటంలో తప్పేముంది'' అనో "ఆ.ఎవరికి, పనిచేస్తున్నావ్. నీవారికి నీవు చేస్తున్నావ్'' అనో అంటారు.. అలా అంటే మీ ఆత్మాభిమానం కొంత దెబ్బతింటుంది.. మీరు ఆశించిన సానుభూతివాక్యం రానందున కొంచెం బాధపడతారు. కాని వారు ఎప్పుడైనా "....చాలా అలసినట్లున్నావ్'' అనిఅంటే "ఆ.... అదేమిటిలెండి.... ఏదో కొద్దిగ'' అని అన్నారా? బాగుంటుంది.

శ్రీవారితో మాట్లాడేటప్పుడు "ఆ.. పరవాలేదులెండి.... నేను చేస్తానుగా'' అనిగాని "మీరు చెయ్యరా?'' అనిగాని అనకండి.. ఎందుకంటే అలా చెయ్యటం మీకు సంతోషం. అలా చేయించుకోవటం వారికి ఆనందం. ఈ పై మాటలు మీ మనసులను కొంత దూరంగా తీసుకపోయి కర్తవ్యాన్ని నెరవేర్చనివ్వవు.. ఇది జీవితంలో చాలా ముఖ్యం. సరిగా అర్థంచేసికుంటే ఈ రెండే జీవితాలను ఏకం చెయ్యగలవు.

మీ భర్తదుస్తుల శోపాలముగురించి వారితో వాదించకండి. వారికి అవసరమైనన్ని దుస్తులు లేకపోవచ్చు. అలా అడిగితే వారికి లేమిని గుర్తుచేసిన వారవుతారు ... అందువలన వారు బాధపడతారు. వారి బాధనుమాత్రం మీరు సహించగలరా?

ఈలాగే మరికొన్ని: అన్నంతినేటప్పుడు మాట్లాడించటం. అర్ధరాత్రి లేపి, మీకు వచ్చిన కలలను గురించి చెప్పటం పనికిరాదు.. కొందరు సోదరీమణులు ఈ లౌకికము తెలియక బాధలకు గురి అయ్యారు. అవుతున్నారుకూడా. శ్రీవారియొక్క మనస్తత్వాన్ని చదవటం శ్రీమతియొక్క ప్రథమ కర్తవ్యం. ఇలా చేస్తే వారి జీవితాలు [illegible] ★







వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
1, తంబుచెట్టి వీధి,
మద్రాసు-1

## సిటీలో సినిమాలు

వ్యాసం బాగుంది. రచయిత్రి చెప్పినట్లుగా సిటీకి వెళ్ళాలంటే కొంతమంది చాలా సరదా పడతారు; క్రొత్త క్రొత్త సినిమాలు రిలీజ్ అయిన వెంటనే చూడవచ్చుకదా అని. కాని సిటీలలోనే ఉండి ప్రతిసినిమా 2, 3 రూ. ల ఖర్చుతో వెళ్ళలేక సినిమాలన్నీ కొంతఉన్నవారు పడే అవస్థ బాగా వివరించారు రచయిత్రిగారు.

ఓ. సరోజ (బళ్ళారి)

* * *

వ్యాసం అంత బాగుండలేదనుకొంటా. ఏ వ్యాసమైనా, పాటించదగినదైతే, ఫర్వాలేదు. కాని, సినిమాల గురించి కూడా వనితావాణిలో వ్యాసం వ్రాయుట అనేది వింతగా ఉంది. ప్రయోజనాత్మకమైన వ్యాసాలైతే బాగుంటుందని అంటాను.

యస్. సత్యవతి (నెల్లూరు)

* * *

వ్యాసం చదివాను. నేను చదివేటప్పుడు మావారు విన్నారల్లే ఉంది. "ఆ టిక్కెట్ల కొరత, ఆ బాధ మీ ఒక్కరికే కాదు; మాకుగూడా ఉంది" అని అంటూ 'మగవాళ్ళ సీట్లకంటె ఆడ వాళ్ళసీట్లు తక్కువగాఉండటం సహజం. ఎందుకంటే మగవాళ్ళ కంటె, ఆడవాళ్ళే తక్కువగ చూసేవాళ్ళుంటారు. ఈ టిక్కెట్లకోసం నిలబడే క్యూ హనుమంతుని తోకలా మాకే గాకుండా మగవాళ్ళకుగూడ ఉండటం కద్దు! అందుకని సినిమా విడుదలైన వారం పది రోజులైన తర్వాత వెళ్లితే చాలవరకు "రష్" తగ్గి, మనకు కావలసిన టిక్కెట్లు లభ్యంకాగలవు. అన్నారు. కాని ఈ సలహా సోదరి "జగదీశ్వరిగారికి" నచ్చుతుందో నచ్చదో మరి!

వి. లీలావాణి (బందరు)

## రాజకీయాలలో స్త్రీల పాత్ర

వ్యాసము చదివితిని. రచయిత్రి ఎ. ఛాయాదేవిగార్కి అభివందనములు. స్త్రీకి ఉన్నటువంటి ప్రాథమిక హక్కులు మనస్సులో పెట్టుకొని, స్త్రీలు పాల్గొనే ప్రతిది ఒక పాత్రగా చక్కగా వర్ణించారు. ఛాయా దేవిగార్కి ధన్యవాదములు.

కోకిలాంబ (తుని)

* * *

వ్యాసంలో స్త్రీల పాత్రగురించి ఛాయాదేవిగారు చక్కగా వర్ణించారు. మహాను నిత్యంగాను దేశసేవ, ప్రజాసేవలనే రాజకీయాలు అంటారని నిర్వచించారు. కాని అది సరికాదేమోనని నా అభిప్రాయం. ఈకాలంలో రాజకీయాలతో సంబంధంలేని వాళ్ళరుదు. రాజకీయాలలో ప్రవేశించగానే దేశసేవకులుగా పేరు వస్తున్నారని అంటారా? ఈ కాలంలోని నిజమైన దేశభక్తులను వేళ్ళమీద లెక్కించవచ్చు. నలుగురికి చదువు చెప్పడంవంటి మొదలైనవాటిని దేశసేవ అని అంటారే కాని, రాజకీయాలని చెప్పరుకదా? ప్రజాసేవ చేయాలంటే రాజకీయాలలో పాల్గొన అవసరంలేదు. దాని కెన్నో మార్గాలున్నాయి. రాజకీయాలకు, దేశసేవకు హస్తిమశకాంతరంఉంది.

కె. ఇందిరాదేవి, (హైదరాబాద్)

* * *

వవని నిర్మల ప్రభావతిగారి రెండవ బహుమతి పొందిన వ్యాసం చాలా బాగుంది. మన స్త్రీలలో చాలా మంది రాజకీయాలంటే ఎంతో నిరసనభావం చూపెడతారు. అందుకే మన భారతదేశం అన్నిదేశాల కంటె ఎంతో వెనుకపడిఉన్నది. నాకుమాత్రము రాజకీయాలంటే చాలా ఇష్టము. నేను ఊహించుకొనే

అభిప్రాయములన్నియు చాలా బాగా వ్రాసినారు. ఇంత మంచి వ్యాసం వ్రాసి, బహుమతి పొందినందుకు రచయిత్రికి నా అభివందనలు.

పి. పెద్దపిన (నారాయణపురం పేట్ల)

* * *

## యువతులూ—ఉద్రేకాలూ

వ్యాసం చాల బాగుంది. స్త్రీని పుష్పంతో పోల్చి వారు చెప్పిన విధానం శ్లాఘనీయముయినది.

నేటి సామాజిక పరిస్థితులను అతివాస్తవంగా సుందరశైలిలో పాఠకుల కందించినందులకు మా కృతజ్ఞత.

విషమ పరిస్థితులలో చిక్కుకుని స్థైర్యం కోల్పోయి, సంఘంలో చెడుగా భావింపబడి మరణించే వారు చాలామంది కలరు. అలాంటి పరిస్థితులలో ముఖ్యంగా ఆత్మస్థైర్యం అవసరంగా ప్రకటించి మారుతిగారు చెప్పుట గొప్పగా ఉన్నది. నేటి పరిస్థితు లలో ఇటువంటి వ్యాసాలే ఆదర్శ జీవనానికి ఆధార మవుతాయి. "మనసు శుద్ధ లంపెట్టినా ఆత్మ శుద్ధ చేసుకుంటుంది. స్త్రీ జీవితం కుసుమం వంటిది." మొదలగు చిన్న చిన్న వాక్యంలో గొప్ప భావాలను మారుతిగారు తెలియజేశారు.

మారుతిగారు అన్నట్లు "యవ్వనం పాలపొంగు వంటిది."

మానవ జీవిత దశలో అతి భయంకరమయినది యవ్వన దశ. ఈ యవ్వన దశలో వయస్సు పరువళ్ళు త్రొక్కుతూఉంటుంది. యవ్వనాన్ని బంధించు టకు పగ్గాలుండవు. మానవుల మనస్సు గాజారాయి వంటిది. ప్రక్కరంగులకు లోబడి వ్యక్తిత్వాన్ని కోల్పో తుంది. అలాంటప్పుడు వయస్సులా ఆడిస్తే అలా ఆడతారు. యవ్వనంలో మగవారు ఎన్ని తప్పులు చేసినా సమాజం క్షమిస్తుంది; గౌరవిస్తుంది. కాని అది స్త్రీయన్న, మనుష్యులైనా పాటువేయ ప్రయత్ని స్తుంది. అందుచేతనే స్త్రీలు (మనం) అత్యధి జ్ఞానంతో ప్రవర్తాలి.

"ప్రేమించినవాడు నిరాకరిస్తే ఆ స్త్రీకి కలిగేది బాధఒక్కటే. కాని, ప్రేమించానని నమ్మించి, నిరాక రిస్తే సహించడం కష్టం. నిరాకరణవల్ల బాధఒక్కటే. నిరాశవల్ల వ్యథ, అవమానము రెండు ఏర్పడుతాయి. ఫలితం మరణమే; భ్రూణహత్యలకుకూడ దారితీస్తుంది. నేటి సభ్య ప్రపంచంలో ఇలాంటి చర్యలు విచార హేతువులు." ఆత్మనెప్పుడు నిర్లక్ష్యంచేసినా అధో గతి తప్పదు. మంచి చెడుల మధ్య జరిగే సంఘర్షణే మానవ జీవితము.

"ఈ జీవితంలో సుఖదుఃఖాల రెంటిలో ఏదీ సత్యంకాదు. సుఖదుఃఖాలు రెండూ చంచలలక్షణాలే. అవి అదృశ్యమయ్యేటప్పటి నవ్వడే సత్యం. బుద్ధితో హృదయంతో వాటిని పొంది, గడిపే జీవితమే యథార్థం." మారుతిగారికి నా అభివందనములు.

మల్లాప్రగడ కమలాంబ (గుంటూరు)

## తలనొప్పి మిమ్మల్ని క్రుంగతీస్తూంటే...









సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిశ్చయముగా, నిరపాయముగా స్వస్థత కలిగించును. తలనొప్పి, ఒంటినొప్పి, పంటినొప్పి, జ్వర చిహ్నములు, మామూలు అస్వస్థతలకు సారిడన్ వేసుకోండి.

పెద్దవారికి: 1 బిళ్ల. పిల్లలకు: ¼ నుండి ½ బిళ్ల వరకు.

# సారిడన్ 'రోష్'

త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహము కలిగించును




ఒకే ఒక బిళ్ల చాలును
ఒక బిళ్ల ఖరీదు 13 నయా పైసలు

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు, వాల్టాస్ లిమిటెడ్

JWT-VT 3525(a)

# మనమూ - మన దేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## త్రేన్పులు

ఉదరం, ఆరోగ్యస్థితిలోనూ, అనారోగ్యస్థితిలోనూ ఎలా మార్పులు చెందేదీ, ఆ మార్పులకు కారణములను ఎలా పరిశీలించేదీ తెలుసుకున్నాము. కడుపు ఉబ్బరింపుకు సాధారణ కారణం, కడుపులో గాలి చేరడం.

ఉదరంలో గాలి జఠరాశయంలో మాత్రమే ఉండవచ్చును, లేక ప్రేగులలోనూ ఉండవచ్చును; రెండింటిలోనూ ఉండవచ్చును.

జఠరాశయంలో గాలి సాధారణంగా త్రేన్పుల ద్వారా బయటికి వస్తుంది. క్రింద ఉన్న గాలి అపాన వాయువులద్వారా వెలికి పోతుంది.

జఠరాశయంలో (Stomach) గాలి అనేక కారణములవల్ల చేరుతుంది. జఠర రసములలో లోపంవల్ల, ఆహారం పొందవలసిన రసాయనిక వికృతులు పొందక, గాలి ఏర్పడవచ్చును. అప్పుడు ఆహారపదార్థములు పులిసి కొన్ని వాయువులు ఏర్పడుతవి. ఆ స్థితిని "ఫెర్మెంటేషను" (Fermen—tation) అంటారు. ఈ విధంగా ఏర్పడిన గాలిలో కొంత భాగమును, జఠరాశయం గోడలలో ఉన్న రక్తనాళములు ఆహరించుకొంటువి. మిగతా వాయువు త్రేన్పులద్వారా బయటికి పోతుంది. జీర్ణప్రక్రియలో ఏవో కొన్ని వాయువులు యేర్పడకతప్పదు. అవి ఆహరింపబడనప్పుడూ, బహిర్గతములు కానప్పుడూ కడుపులో గాలి అధికమవుతుంది. కొందరికి గాలి మ్రింగే అలవాటు ఉంటుంది. ఈ వాయుగ్రసనమును "ఏరోఫేజీ" (Aerophagy) అంటారు. ఏరో అంటే వాయు సంబంధమైన; "ఫేగోస్" అంటే మ్రింగడం.

జఠరాశయంలో హైడ్రోక్లోరిక్ ఏసిడ్ తక్కువగా ఉత్పత్తి అయినప్పుడు ఆహారం పరిపూర్ణంగా జీర్ణంకాక కొన్ని వాయువులు ఉత్పత్తి అవుతవి. అయినా, అది పొట్ట ఉబ్బరించేటంత అధికంగా ఉండడం అరుదు. కాని, జఠరాశయం అంత్రాంతమైన పైలోరస్ భాగంలో కేన్సరు ఏర్పడినప్పుడు అక్కడ జఠర రసములు సరిగా ఉత్పత్తి కావు. అల్పామ్లస్థితి (Hypochlorhydria) ఏర్పడుతుంది. ఆహారం శీఘ్రంగా డుయోడినంలోకి పోక, నిలవఉండి, పులిసి, కుళ్ళుతుంది. అప్పుడు దుర్గంధంతో కూడిన త్రేన్పులు వస్తవి. దుర్గంధంతో కూడిన త్రేన్పులు జఠరాశయంలో ఏర్పడే కేన్సరుకు ప్రారంభ లక్షణములు కావచ్చును. జఠరాశయమునకూ, డుయోడినమునకూ మధ్యఉండే పైలోరిక ద్వారమునకు దీర్ఘమయిన ఆటంకం ఏ విధంగా కలిగినా ఆహారం కడుపులో నిలవఉండి దుర్వాసనతో త్రేపులు రావచ్చును. కాని కేన్సరు ఏర్పడినప్పుడు త్రేన్పులు మరీ అధికంగా, దుర్గంధభూయిష్ఠములై ఉంటవి. ప్రేగులలో దీర్ఘమైన ఆటంకం ఉన్నప్పుడు, ఆహార గమనానికి నిరోధం కలిగి, మలం — వాసనతో కూడిన త్రేన్పులు ప్రారంభమవుతవి. ఏ వాసన లేకుండా వచ్చే పుల్లత్రేపులు సాధారణంగా పైలోరస్‌కు ముందునుంచే వస్తవి. వాయుగ్రసనం (Aerophagy) కడుపులో గాలి చేరడానికి ప్రధానకారణం. నైరికమైన అజీర్ణ రోగంలో (Nervous Dispepsia)— దీనిని గురించి వేరే వ్యాసంలో వివరిస్తాను — గాలి మ్రింగడం సాధారణంగా జరుగుతుంది. పిత్తాశయము (Gall Bladder) ఇన్‌ఫ్లేం అయినప్పుడు జఠరాశయంలోనో, డుయోడినంలోనో, పుండు ఏర్పడినప్పుడు కూడా గాలి మ్రింగడం సాధారణంగా జరుగుతుంది. రోగి జఠర భాగంలో ఏదో బాధను అనుభవిస్తూ, త్రేన్పితే ఆ బాధ పోతుందేమోనని భ్రమలో బలవంతంగా "బ్రేవ్ బ్రేవ్" మని త్రేపుతాడు. కాని త్రేన్పిన వెంటనే మళ్లీ గాలి మ్రింగుతూ ఉంటాడు. నరోద్రేకం (Nervousness) అధికంగా ఉన్నవారిలో ఈ లక్షణం మరీ అధికంగా ఉంటూ ఉంటుంది. నిజానికక్కడ గాలి ఉండదు. కాని, త్రేన్పులు తెచ్చుకోవాలని తెచ్చుకున్నప్పుడల్లా గాలి పోయి జఠరాశయం గాలితో నిండి ఉబ్బిపోతుంది. అప్పుడు రోగులు కడుపు చేతితో నొక్కుకుంటారు. అప్పుడు త్రేపు వచ్చి కొంత గాలి పోవడం, అంత గాలీ మళ్ళీ లోపలికి మ్రింగడం జరుగుతుంది. ఇలా ఒక విష—పరిభ్రమణం ప్రారంభమవుతుంది. అంతకంతకు త్రేన్పులు పెద్ద శబ్దంతో కూడుకుని ఉంటవి. సాధారణంగా ఇటువంటివారిలో, నోటిలో లాలాజలం కూడా అధికంగా ఊరుతూ ఉంటుంది. జఠరాశయంలో అల్సరు ఉన్నప్పుడు ఆమ్లస్థితి (Acidity) ఎక్కువగానే ఉంటుంది. ఇటువంటివారిలో నోటిలోనూ నాసికా ప్రదేశంలోనూ క్రిమిదోషం సాధారణంగా ఏర్పడుతుంది. గాలితోబాటు ఈ ఉమ్మినీ వారు మ్రింగుతారు. ఉమ్మి క్షారగుణం (Alkaline) కలది. ఈ ఆమ్ల క్షార ద్రవముల రసాయనిక సంయోగంతో ఇంకా గాలి అధికమవుతుంది. నరముల ఉద్రేకం అత్యధికంగా ఉండే స్త్రీలలో ఈ వాయుగ్రసన గుణం అత్యధికంగా ఉంటుంది. అటువంటివారు సానుభూతి లభించినకొద్దీ నిరంతరాయంగా గాలి మ్రింగడం, బ్రేవ్‌మని త్రేపటం గంటలు తరబడి చేస్తూ ఉంటారు. కొంతమంది రోగులు ఇలా చేయడంలో ఒక రకమయిన ఆనందం పొందుతారుకూడా. నిజమయిన వాయుగ్రసన స్థితిలో త్రేన్పుకు ఏ వాసనా ఉండదు; ఏ రుచీ ఉండదు. ప్రొద్దున్నే పరగడుపుతో వచ్చే త్రేన్పులు సాధారణంగా వాయుగ్రసనంవల్లనే వస్తవి. త్రేన్పులు వ్యాధివల్లనో, వాయుగ్రసనం వల్లనో తెలుసుకుంటానికి ఎక్సురే పరీక్ష చాల సహకరిస్తుంది. వాయువు లోపలికి పోవడమూ, బయటికి రావడమూ ఎక్సురే స్క్రీన్‌లో చూడవచ్చును కాని అది వైద్యులకు మాత్రమే సాధ్యమయిన పని.

చివరలో బల్ల కట్టి, పోర్టల్‌వెయినుకు ఆటంకం ఏర్పడ్డప్పుడు, హృద్రోగంలో శరీరభాగములకు పోయిన రక్తమును మళ్ళీ వెనక్కు గుంజుకునే శక్తి హృదయానికిలేక, శరీర భాగములు నంజుతో నిండినప్పుడు, బ్రాంకైటిస్, ఉబ్బసం వంటి వ్యాధులలో దగ్గుతో వాయుగ్రసనం జరిగి త్రేన్పులు ఏర్పడవచ్చును. జ్వరం, కళ్ళె, నంజు ఉన్నప్పుడు అతిశీఘ్రంగా వైద్యసహాయం పొందదగిన చికిత్స చేయించడం అవసరం.

కొన్ని పరిస్థితులలో ఈసోఫెగస్, జఠరాశయం కలిసేచోట గాలిని లోపలికి పోనిచ్చి బయటికి రానివ్వని రీతిగా కొన్ని మార్పులు జరుగుతవి. ఈసోఫెగస్ క్రిందిభాగంలో దుస్సంకోచము (Spasm) ఏర్పడినప్పుడు సాధారణంగా ఈ స్థితి యేర్పడుతూవుంటుంది. ఆ దుస్సంకోచము దీర్ఘకాలము ఉన్నప్పుడు అక్కడ అల్సరు ఏర్పడుతుంది. ఈ స్థితిలో జఠరాశయంలో విపరీతంగా గాలి చేరి, ప్రాణం తల్లడిల్లిపోతుంది. కడుపులోకి రబ్బరు గొట్టం పంపి, గాలి తీసివేస్తే వెంటనే బాధ పోతుంది.

జఠరాశయంలో గాలి చేరి, ఆ ఉదరాంగము ఉబ్బినప్పుడు ఏవి లక్షణములు ఏర్పడతవో ఊహించాలంటే, జఠరాశయం పరిసరములలో ఉన్న ఇతర అంగములకూ దానికీ ఉండే అన్యోన్య సంబంధమును దృష్టిలో ఉంచుకోవాలి. ఉదరం పైభాగమునకు, రెండువైపులా ఉన్న ప్రక్కటెముకలతో ఏర్పడిన ఆర్చి ఉంది. దానిక్రింద జఠరాశయంఉంటుంది. ఈ ప్రదేశమును ఎపిగేస్ట్రిక్ ప్రదేశం (Epigastric—region) అంటారు. గేస్ట్రియా అంటే జఠరాశయము 'ఎపి'—అన్న ఉపసర్గకు 'ఊర్ధ్వము' అని అర్థము. జఠరాశయం ఏ కారణంచేత ఉబ్బినా, ఈ ప్రదేశం ఉబ్బరిస్తుంది. ఈ ఉబ్బరింపుతో ఉదరముకు వక్షముకు మధ్య ఉన్న డయాఫ్రమ అనే కండరం పైకి త్రోయబడుతుంది. ఆ ఒత్తిడి దానిని అని ఉన్న ఊపిరితిత్తులకూ, హృదయానికీ తాకుతుంది. అప్పుడు ఊపిరి ఆడకపోవడమూ, గుండె పట్టుకున్నట్లయి, దడదడ కొట్టుకోడమూ ఏర్పడుతుంది. అంతకుముందే బ్రోంకైటిస్, క్షయ, నెమోనియా, ఆస్త్మ మొదలయిన శ్వాసకోశ వ్యాధులతో బాధపడేవారిలోనూ, హృదయం పెద్దదైనవారిలోనూ జఠరాశయంలో గాలి చేరడం మరీ బాధ కలిగిస్తుంది.

43—పేజీ చూడండి

# కాల్గేట్ వాడి నోటినింది దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్ల తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియని యనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటలో పళ్ల పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్ల తోముకోండి. దాని మరకైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లతోము కొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటె దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!




కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్ల తోముకొంటే
- ✓ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✓ దంతక్షయమును నిరోధించును
- ✓ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును

మీరు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు ...ఒక డబ్బా వెంటు వస్తుంది!

నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లతోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు





## "నా కంపోజిషన్‌లో నాకం, పొజిషన్"

పరవనితాధర పీయూషం
కరువుదీర తెగ(త్రా)గిన
సర్వ సుపర్వ సార్వభౌముడు
ఆమయాల మయంలో పడి
వెలి చపులకు వెల యేమో
తొలి పనులకు ఫలమేమో
తుది ఘడియలు గడియ దీసి
తొంగిచూచు సమయంలో
తులనాత్మక పరీక్షతో, చే
తుల నాత్మ కానించుకొని
జీవన్మరణ సందేహారణ్యంలో
అణు గణనం చేస్తున్నాడు.
రంభోరువైన రంభ
దంభోళిధారి- జారిపోతున్నాడని
కాంభోజీరాగ సమా
రంభం సాగిస్తున్నది.
నకనకలాడే నాకాధిపతి
వేక నామేనికా!
మేనకా! కానమే! అంటే
మే-మే-అంటున్నది
మేకలాంటి మేనక
ముందు గతులు గానక.
ఉత్క్రాంతి వేళ
ఉత్కృష్టత నిచ్చే
ఉత్తమ తిలాంజలికై
తిలోత్తమ
తికమకపడుతున్నది.
విరసాల రసాల రసాపానంలో
రదాలలో చిక్కిన నారను
దుడుగ్గా లాక్కుంటున్న
నారదుడు
"నారాయణ నారాయణ
దించండి మంచంమీద
నుంచి" అన్నాడు.
కుక్కు-రొకొ మంటూ
ఎక్కడనుంచో ఒక
దిక్కుమాలిన కృకవాకం
వెక్కిరిస్తూ కొక్కిరిస్తున్నది.
గౌతమ సతి గౌరవాన్ని
గంగలో గలిపేసేందుకు
తాను కూసిన
తప్పుడు కోడికూత,
పరస్త్రీల యౌవనాల
పకోడీల మేత,
పది లక్షల పళ్లతోడి
పాపపు రంపాల కోత
నేడీ ప్రస్థానానికి
వాయించిన
భజంత్రీల మోత!
రుజనెరుగని మా రాజుల
జులుంలో
గాజులు తొడిగించుకున్న
రోజులు
జూలు నులిపి పరిగెత్తే-వా
జూలవలె బిలబిలమని
చూపు కందకుండ నే
చూలికలై పోయినాయి.
పక్వమైన పాపానికి
ప్రతివాడూ ఫలహార మేనని
వితంతువైన
తుంబురుని
తంబూరా
వెక్కి వెక్కి యేడ్చింది.

గుమ్మడపు రామకృష్ణారాయణం,
(హైద్రాబాదు).

## సరికొత్త పాతపాట!

[ఈ పైనం అనగా యీ క్రింది పాట లేక భక్కి మనకు దాఖలా దొరకని ఆది మానవుని కాలంనుంచీ హమేషా తమాషాగా యిలా జరుగుతూనే ఉందనడానికీ... మానవుడు ఆయుధాల అ(న)ర్థం కనుక్కోకుండా వున్నప్పుడే ఈ చూపుల తూపులదాడికి గురి అయ్యేడనడానికి చరిత్రలో బోలెడుదాఖలా లున్నాయి. పైగా ఇది ఇంకా ఇలాగే జరగ్గలదనే జోస్యానికి ఢోకాలేదు.]

ఈటె ఎందుకూ?
కత్తి ఎందుకూ?
అహా!..చిన్న దానిచూపు చాలునూ
అది ఎదనుగుచ్చునూ

కళ్లెమెందుకూ
బల్లెమెందుకూ
అహా! కన్నెపిల్ల కొంగుచాలునూ
అది నిన్ను పట్టి లాగునూ!

విల్లు ఎందుకూ
బాణమెందుకూ
అహా!...చిన్న దాని కన్ను చాలునూ
అది గుండె దూసునూ

డబ్బు ఎందుకూ
దర్పమెందుకూ
అహా!...చిన్న దానివల్కు చాలునూ
మదికొండ ఎక్కునూ

లోకమెందుకూ
నాకమెందుకూ
అహా!..చిన్న దాని పలుకుచాలునూ
అది మత్తు ఇచ్చునూ

—పి. కృష్ణానంద. ★



# పునర్నిర్ణయం

మూలం: త్రివేణి
—అనువాదం—శర్వాణి

తెల్లటి గుడ్డమీద రంగుదారంతో పూలుకుట్టడం అయిపోయింది. ఆకుపచ్చదారంతో కొన్ని ఆకులు కుట్టాను. కుట్టుపని చాలా నెమ్మదిగా సాగుతోంది. ఇంకా కుట్టని ఆకులు రంగు పూసుకోని పటునిలా ఆకారమాత్రంగా గుడ్డమీద కనిపిస్తున్నాయి.

సంధ్య మసక వెలుతురులో గదిలోని వస్తువులు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. కుట్టుమీదే దృష్టి నిలపటంవల్ల కళ్ళల్లో నీరు వచ్చింది.

చకచకా కుట్టగలిగే నా చేతి వ్రేళ్ళు వయస్సుతో పాటు తమ చలాకీతనాన్ని పోగొట్టుకొన్నాయి.

"లేస్తే చూద్దాం" అనుకుంటూ కుట్టుగుడ్డ పక్కకు పెట్టి లేచి లైటు వేశాను.

వండుకోవలసిన పనేమీ లేదు. నా ఒక్కదాని కోసం నేనెప్పుడూ రెండు పూటలు వండేదాన్ని కాదు. ఒకేసారి వండి పడేసేదాన్ని.

మరునాడు పిల్లలకు చెప్పవలసిన పాఠం చేతికి తీసుకున్నా.

సరిగ్గా అప్పుడే ఎవరో మృదువుగా తలుపుకొట్టిన చప్పుడయింది.

ఈ సమయంలో ఎవ్వరొచ్చారబ్బా? అని గడియారం వేపు చూశాను. అప్పుడే ఏడున్నర దాటింది.

మళ్ళీ తలుపు చప్పుడయింది.

కొంచం చికాగ్గానే 'ఎవరది' అన్నాను.

"నేను" అతి వినయంగా జవాబు వచ్చింది.

ఎవరో నా విద్యార్థుల తల్లిదండ్రులై ఉండవచ్చు. తమ పిల్లల చదువుగురించి అడగడానికి వచ్చిఉంటారు అనుకుంటూ లేచి తలుపు తెరిచాను.

బయట నుంచున్నతనికి సుమారు ఏభై ఏళ్ళుండవచ్చు. చీకటిలో నుంచోవటంవల్ల అతని మొహం కనిపించటంలేదు.

తలుపు బార్లా తెరచి "రండి" అన్నాను.

—40 వ పేజీ చూడండి—







మీరు ఎక్కడి దాకా వెళ్తున్నారండి?
విజయనగరం కాలేజీ.



అక్కడ శర్మగారని ఒక రచయిత గారున్నారుట మీకు తెలుసా?
ఆ తెలుసు ఆయనతో మీకు పనేమిటి?



అవేమీ లేదులెండి. మా కాలేజీలో ఓ డ్రామా వేస్తున్నాము ఆయన వ్రాసిన కొత్త నాటకం వేద్దామని నాటకం కోసం ఆయన దగ్గర కెళ్తున్నానండి
ఆయన నాటకాలని గురించి మీ అభిప్రాయమేమిటి?





మీరెప్పుడైనా శర్మగారిని చూశారా?
లేదండీ... పైగా ఆయన ఇల్లు కూడా నాకు తెలీదు కాస్త చూపిస్తారా?
సరే





ఇప్పుడు వివరంగా చెప్పండి ఏ పనిమీద వచ్చారో?





## జరిగిన కథ

రామచంద్ర పురవాస్తవ్యుడు ప్రసాదరావుగారి కుమార్తె, నిర్మలకు అజంతా విహారాలు చూపేందుకు సహోధ్యాయులతో వెళ్తుండగా త్రోవలో కారు చెడిపోయి ప్రయాణంబాగా బాధపడ్తున్న ఓ లెక్చరర్ దంపతులతో పరిచయం ఏర్పడుతుంది. ఆ లెక్చరర్ భార్య రుక్మిణమ్మగారు నిర్మలకు తన అక్కగారి కుమారుడు ప్రకాశ్‌తో, వసంతకు చేట్ల పాలెంలోని ఒడిసంతులతో వివాహం జరుగుతుంది. కళీబీ, కుసుములకు కూడా ప్రసాదరావుగారు వివాహాలు చేస్తారు. కొండంటీకం ధరించలేని కుసుమకు భర్త అనుమతిలో ప్రసాదరావుగారు ఇంటికి తీసుకువస్తారు. ప్రకాశ్‌కు మనః స్థిమితం తప్పగా బొంబాయి పిచ్చి ఆస్పత్రిలో చేరుస్తారు. రాజారావుగారు తమ భార్యగారికి పిచ్చి ఉండేదన్న విషయాన్ని వెల్లడిస్తారు. భర్త వ్యసనాలకు లోనయ్యాడని విని కుసుమ ఆత్మహత్యకు పూనుకుంటుంది. ఈ సంగతి విన్న సుబ్బారావు అన్న ఇంటినుంచి వెళ్ళగొట్టి, భార్యదగ్గరకు బయల్దేరాడు.

## 9

తన కన్సల్‌టేషన్ రూమ్‌లో కూచున్న రాజారావుగార్ని చూచి ఆశ్చర్యపడింది డాక్టర్ శాంత. ఆమెకు నమస్కరిస్తూనే వచ్చిన పని చెప్పాడు: "నిర్మల రోజురోజుకీ అదోలా అయిపోతోంది. సరిగా భోంచెయ్యదు. నిసుగు, కోపం, యెక్కువై పోతున్నాయి. ఎవ్వరితో మాట్లాడదు. పాపతోకూడ యెక్కువ మాట్లాడి ఆడదట. అలా ఆలోచిస్తూ గంటలు గంటలు కూచుంటుంది. ఆమెను మార్చే భారం మీదే. ఈ పరిస్థితినుంచి తప్పించే శక్తి మీకుందని నా దృఢ నమ్మకం."

దూరంగావున్న పేషంట్లవైపు చూస్తూ అంది ఆమె: "నిర్మలతో మాట్లాడాలని యెప్పటినుంచో అనుకుంటున్నాను. సరే.... ప్రయత్నిస్తాను. రేపు ఆదివారం కదా! నాకు పనిలేదు. నిర్మలను గండి పేటకు తీసుకువెడతాను."

"మీదే భారం. నిర్మలమ్మ దుఃఖజీవి. ఆమెకు సంతోషంలేదు. కాని జీవం మాలాగున ధైనిక జీవితం గడుపగల్గితే మా కెంతో తృప్తిగా ఉంటుంది....."

"అలాగే .... ప్రయత్నిస్తాను .... నిర్మల మామూలుగా ఉండాలనే నా కోర్కకూడ" అంది.

రాజారావుగారు నెమ్మదిగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయారు.

నిర్మలతో మరునటిరోజు గండిపేట చేరేసరికి బారెడు ప్రొద్దెక్కింది. యవ్వనంతో ఉన్న సూర్యుడు తన ప్రభావాన్ని చూపుతున్నాడు. ఋతుపవనాల ధాటి తీక్షణంగాఉన్నా, యెండలో తీక్షణతమాత్రం తగ్గలేదు.

బృందావన్‌ను గుర్తుచేసే అక్కడి చిన్న పూదోటలు, ఆ నీటి అల్లరిని అరికట్టే అందమైన కొండలు, వారి నాహ్వానిస్తున్న కెరటాలు, ప్రకృతి కిస్తున్న గలిబిలిలోగూడ యేదో గంభీరమైన ప్రశాంతత; వింత పరిమళంతో మందమారుతం వారి నాప్యాయంగా ఆలింగనం చేసుకుంటే యిద్దరూ కాంటీన్ వెనకవైపు కెళ్ళి బండల మీద కూచున్నారు.

ఇల్లు వదిలింది మొదలు యిప్పటివరకు యెవ్వరూ నోరు విప్పలేదు. ఈ సౌందర్యసీమలో తన వికృతపు భావాలకుగానీ, దుఃఖానికిగానీ, హేయ హావభావాలకు గానీ తావులేదు. ఈ ప్రశాంతత నాస్వాదించాలి; తనివితీర గ్రోలాలి; మత్తెక్కి మైమరచి హాయిగా యిల్లు చేరాలి....కానీ....డాక్టర్ శాంతకు శాంతిలేదు!

"నిర్మలా! యెంతో హాయిగా ఉంది కదమ్మా." అంది ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

"అవును. చాలా బావుంది కానీ.... డాక్టర్.... ఈ ప్రదేశం ఒకప్పుడు నాకు ఆత్మీయంగా అత్యంత ప్రియమై యుండేది. ఇక్కడికి తరచుగా వచ్చే వాళ్ళం. ఆ అనుబంధాలకు, ఆత్మీయతకూ సంబంధించిన స్పందనలన్నీ సహించలేకుండా ఉన్నాను." అంది నిర్మల.

కళ్ళలోంచి టపటపమని కన్నీరు తెల్లని చీరపై

పడి ముద్దిడుకున్నాయి. ఆమె కళ్ళ లోతుల్లోకి దిగి, పరీక్ష చేయగల్గే ధైర్యం డాక్టర్‌కు లేదు.

"నీతో ఎన్నో విషయాలు మాట్లాడాలని యిక్కడికి తీసుకొచ్చాను. నువ్విలా యేడుస్తూ ముకుళిత హృదయంతో వుంటే నిన్ను తీసుకొచ్చిన ఉద్దేశం నెరవేరదు. పైగా నా సమయం వృథా అయిపోతుంది. సావధానంగా విను; నీ ఏకాగ్రత నా కవసరం" అంది.

నిర్మల కన్నీరు తుడుచుకుంది. లేచి వెళ్ళి దోసిడి నిండా నీళ్ళు తీసుకుని ముఖంమీద చల్లుకుంది. ఆ చల్లని తేటనీ రామెకు హాయిగొల్పింది. కొంగుతో ముఖం తుడుచుకుని కూచుంటూ అంది:

"అవును. మీరు డాక్టర్.... కాలం యిలా నాకోసం వ్యర్థం చేస్తుంటే...."

"కాలం వ్యర్థం చేయటంలేదమ్మా నిర్మలా.... నా కాలాన్ని, నిస్సారడించి, సత్యాన్ని బహిర్గతం చేయటంలో సద్వినియోగపర్చుకోవాలని...."

"చెప్పండి....వింటాను"

"వినటంకాదు ముఖ్యం.... అవగాహనం చేసుకుని నాకు తగిన జవాబులు చెప్పాలి"

"ప్రయత్నిస్తాను."

"ఎందుకిలా ఉన్నావు ?" అందామె నిర్మల ముఖంలోకి సూటిగా చూస్తూ.

నిర్మల తెల్లబోయింది. ఇదేమి ప్రశ్న— ఆమెకు దాని జవాబు తెలీదూ ? క్షణం మౌనం... తర్వాత అంది:

"మీకు తెలియం దేముంది—ఎటు చూచినా, అంధకారం, నిరాశ, ఓటమి, విచారం, దుఃఖం,— అసంతృప్తి, కోపం, విసుగు; పిరికితనం, నిరర్థక మైన ఊహాలు, పగటి కలలు, యింకా యెన్నో ముళ్ళు. నా శాంతిపథంలో యెన్నో అవాంతరాలు, మనసు దిటవు చేసుకోగానే యేదో ఒక సంఘటన నాలో తుఫాను రేపుతుంది. సంగీత సాధనలో ఆత్మ శాంతి పొందుతుంటే భగవంతుడిచ్చినట్లే యిచ్చి అలా ఎందుకుచేశాడు ? ఇంటికి వెళ్తే అక్కడ కూడ అవాంతరాలేనా ?.... అంతేకాదు. నిన్న ప్రొద్దుట యెందుకో హృదయంలో ఒక విధమైన తృప్తి ఆవరించింది. ఎంతో హుషారుగా, నిద్రలేచి నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభించాలని దృఢ నిశ్చయం చేసుకున్నా. అంతా కొన్నిగంటల వరకే. నా స్థిరసంకల్పాన్ని ఖండింపజేస్తూ కుసుమ నా ఆఖరి చెల్లి వ్రాసింది—తన బావగారి కొడుకు పోయాడని....దాని కథంతా మీకు చెప్పాను. ఆ పిల్లాడిప్పుడు ఎందుకు పోవాలి ? ఆనందమయమైన గృహస్థజీవితంలో అడుగు పెట్టగానే వారికిలా సంభవించటం న్యాయమా డాక్టర్ ? తండ్రి పొడై పోయాడు; కన్నకొడుకులా ప్రేమించే పినతండ్రి, పినతల్లి ఉన్నారు—నాయనమ్మ, తాతయ్య ఉన్నారు. సుఖశాంతులకు పుట్టినిల్లుగా ఆ గృహం విరాజిల్లుతుంటే భగవంతుడు ఇప్పుడా బిడ్డను తీసుకోవటంలో ఉద్దేశం ఏమిటి ? వాడివల్లనే కదా తండ్రి పారిపోయాడు; పినతండ్రి పోరాడి వాడిని తన దగ్గర ఉండేలా చూచాడు ? వాడి మరణంతో ఆ వృద్ధు లెంతగా కుమిలిపోతారో ! సరే అదలా ఉంచండి .... నా కుండవలసిన సుఖం దూరం చేశాడు. అంతటితో ఆగక ఈ పరిస్థితు లింత భరించరానివిగా ఎందుకు చేయాలి ? ఉపశమనం పొందడానికి అడుగువేసేకొలదీ అడ్డంకులేనా ? నా జీవితం నిస్సారమైంది. నావారు, నా బంధువులు సుఖంగా ఉంటేనన్నా, నాకు కావలసిన సంతోషం లభిస్తుందికదా ? భగవంతు డొకరికి ఒకవిధంగా లోటుచేస్తే మరొక రీతిగా భర్తీ చేస్తాడంటారు కదా డాక్టర్—నా సందర్భంలో అది కూడ లేదు. మాలతి, అత్తయ్య, మావయ్యలను చూస్తుంటే హృదయం తరుక్కుపోతుంది. ఇంటికివెళ్తే వారి సమస్యలతో ప్రాణం కొట్టుకులాడుతుంది. అన్ని కష్టాలు ఒకరికేనా ? వాతావరణమంతా దుఃఖమయంగా ఉంటే నాకు సంతోష మెక్కడిది ? ఎలా ఓదార్పు పొందగలను ? ఎలా మర్చిపోగలను ? దుఃఖాన్నంతా పొందుపర్చి నన్ను సృష్టించా డను కుంటా దేవుడు...."

"పిచ్చిపిల్లా .... అటూ ఇటూ తిరిగి చివరికి విధి మీద కోపగించుకుంటున్నావా ? మంచిఇచ్చినా, చెడు ఇచ్చినా తలొగ్గటమే మన విధి .... అంతా భగవంతునిపై భారంవేసి ఈ జీవితాన్ని గడపాలి కాని ...."

"మీరు చెప్పేది కాదనను కాని దేనికైనా హద్దుండాలికదా డాక్టర్. నా విషయంలో ...."

"నిర్మలా, చదువుకున్నదానివి, తెలివిగలదానివి. నీ మనస్సెందుకు పెడదారిన పోతోంది. సత్యాన్ని చూడటానికే తిరస్కరిస్తున్నావెందుకు ? ఇది న్యాయం కాదమ్మా .... కనబడే సత్యాన్ని చూస్తూ కళ్ళు మూసుకోకూడదు ...."

"కళ్ళు మూసుకోను .... కానీ నా హృదయ వైశాల్యంకన్నా ఈ దుఃఖం ఎక్కువగా ఉంది. భరించలేకుండా ఉన్నాను..... నాకంతా చెడు జరుగుతుంటే సహించలేకుండా ఉన్నాను." దీర్ఘంగా నిట్టూర్చింది నిర్మల.

"ఒకే ఆలోచన నీ హృదయాన్నాక్రమించుకుంది. అది పై అంతస్థులో ఉండి మిగత వేటికీ తావివ్వకుండా ఉంది. నీ ఆత్మ సంపాదించిన విజ్ఞానాన్ని, అనుభవ ఔన్నత్యాన్ని సంకుచిత పరుస్తావా? .... విశాల దృక్పథంలో నడిచేందుకు వెనుకాడుతున్నా వేమమ్మా ! .... నీకంతా చెడు జరిగిందంటున్నావుకదూ ? మంచి జరుగుతున్నా గ్రహించవేం ? దాన్ని చూడలేకుండా ఉన్నా వెందుకని ? ఒక విధంగా నీనుంచి సంతోషాన్ని అందని వందుగా చేసిన భగవంతుడు కొన్ని ఫలాలను స్వయంగా ఇస్తుంటే గ్రహించలేకుండా ఉన్నావు. అది నీ హృదయ దౌర్బల్యమే .... ఆగు .... నన్ను చెప్పనీ నిర్మలా .... అందరూ నిన్ను ప్రేమించేవారే, మీ అత్తింటివారు, పుట్టింటివారు నీవంటే పాను భూతి చూపుతూ ఆదరించేవారు; ముద్దుల మూట చిన్నారి లత—పాప అందెల మ్రోతలు నీ హృదయంలో గానం చేయటంలేదూ ? నీ భర్త అప్పుడప్పుడు తన నిజాకృతికి రావటంలేదూ? హృదయానికి హృదయం సన్నిహితపరుస్తూ ప్రేమ పరిపూర్ణతలు తెలియవచ్చే క్షణాలు నీకింకా దూరం కాలేదుకదా ? దీని నిరీక్షణ సఫలమవుతూ

—34వ పేజీ చూడండి

## ప్రతిరూపాలు

గో. వేంకటసుబ్బారావు

పచ్చటి పైరులు
తెల్లటి మబ్బులు
ఎఱ్ఱటి యెండలు
నల్లని కొండలు,
చల్లని పువ్వులు
ఇవి ప్రకృతి మాతకు
ప్రతిరూపాలు!

చల్లని వెన్నెల
మెల్లని తెమ్మెఱ
మల్లెల వాసన
మెత్తని మనసులు
ఇవి ప్రకృతి మాతకు
జయగీతాలు!

పక్షుల కిలకిల
నింగిని మిలమిల
వాగుల జలజల
తారల మిలమిల
ఆకుల గలగల
ప్రకృతి మాతకు
ప్రతిబింబాలు!

పచ్చని చెట్లు
లేత చిగుళ్ళు,
నల్లని మబ్బులు
ఎండిన ప్రాకులు,
విచ్చిన పూవులు
గండు తుమ్మెదలు,
పచ్చని పిట్టలు
అవి ఈ ప్రకృతి మాతకు
ప్రతిరూపాలె!




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**16-11-1962 శుక్రవారము మొదలు**
**22-11-1962 గురువారము వరకు**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం వృత్తిలో మీ బాధ్యత పెద్దది. ధనం కన్నా గౌరవం ముఖ్యంగా చూసుకోవలసి ఉంటుంది. మాట—పట్టింపులు అధికం. వ్యవహార విషయాలలో న్యాయం మీ పక్షంలోనే ఉన్నా, సమయంలో పలుగురూ ఆమోదించకపోవటంవల్ల శ్రమ పెరుగుతుంది. మధ్యమధ్యలో ఆరోగ్యలోపం కనుపిస్తూ ఉంటుంది. కాని, కార్యభంగం కలుగదు. చేతిలో ఉన్న ధనం జాగ్రత్తగా కాపాడుకోవటం అవసరం. తగినంత కారణం లేకుండా తొందరపడి కార్యక్రమాలు పెంచుకోవద్దు. వారం ఆరంభంలో ఆదాయమునకు భంగంవస్తుంది. లేనిపోని అపవాదులు కూడా రాగల సమయం. మీ క్రింది ఉద్యోగులతో ప్రశాంతంగా పని జరిగేటట్లు చూచుకొనండి. 19, 20 తేదులలో మంచి స్నేహితులు లభిస్తారు. విలువగల వస్తువులు కొంటారు.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీ మాటకు విలువ బాగా ఉంటుంది. కాని, మొదట్లో ధైర్యంగా ఉండలేకపోతారు. బలవంతులతో విరోధ సూచనలు ఆరంభం అవుతవి. కుటుంబంలో మానసికంగా సంతృప్తి, సుఖము లభిస్తవి.

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో కుజ రాహువులు, తులలో శుక్రుడు, తులా వృశ్చికాలలో సూర్య బుధులు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, మిధున కటక సింహ కన్యలలో చంద్రుడు.

సంఘంలో ఇంతకు ముందున్నటువంటి పోటీ తొలగిపోతుంది. వృత్తిలో ఫలితం బాగా ఉంటుంది. కాని, ఒకానొక సందర్భంలో చేతికి అందబోతున్న ఆదాయానికి అభ్యంతరం వస్తుంది. గాలివార్తలను నమ్మి ఏ పని ఆరంభించతగిన సమయంకాదు. స్నేహితులు కొంతవరకు సహాయం చేస్తారు. విలాస వినోద కార్యక్రమాలకు అంతరాయం కలుగుతుంది. 21, 22 తేదులలో గౌరవప్రాప్తి, ఆదాయం లేని బాధ్యతలు.

* * *

## మిధునం :

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ ధైర్యాన్ని పరీక్షించే కొన్ని సంఘటనలు జరుగుతవి. కొంత నష్టాన్ని, శ్రమను సహించుకొనవలసిన అవసరం కనుపిస్తుంది. క్రమక్రమంగా వ్యతిరేక వాతావరణం తొలగి మనశ్శాంతి పొందగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో ఏ గొడవలు లేకుండా మీ పనులు మీరు చూచుకొనటానికి అవకాశం కలసివస్తుంది. ఇతరులకు అప్పులు ఈయవలసిన సందర్భాలలో సాధ్యమైనంతవరకు ముందు జాగ్రత్తతో ఉండటం మంచిది. ప్రయాణాలు చేయువలసి వస్తుంది. ఎప్పుడో జరిగిన పొరపాట్లు ఈ సమయంలో మీ పనులకు ప్రతిబంధకంగా తయారు కాగల సూచనలున్నవి. ఆదాయం మామూలుగానే ఉంటుంది. 16, 17లలో అకస్మాత్తుగా కలహాలు, ఆశ్చర్యాన్ని కలిగించే వార్తలు.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

ఎప్పటి కప్పుడు భయపడుతూ మీ కర్తవ్యాన్ని నెరవేర్చుకొంటూ ఉంటారు. ప్రస్తుత స్థితిలో రకరకాల మనుష్యులతోనూ స్నేహము, సంప్రదింపులు అవసరమవుతవి. లభించిన అవకాశాన్ని వినియోగించుకుంటారు. మాట మంచితనంతో పదిమందినీ అనుకూలం చేసుకుంటారు. శారీరకంగా శ్రమ ఉంటుంది. కాని, మనోధైర్యం తగ్గదు. భారీగా చేయు వ్యాపారాలవంటి పనులలో మీ ధనం అధికంగా వినియోగించతగిన సమయం. లాటరీ, పట్టా వంటి సాహసవృత్తులలో దిగతగిన సమయంకాదు. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. 19, 20 తేదులలో శుభవార్తలు, అకస్మాద్ధనలాభం, శ్రమ.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

పోటీవారిలో గౌరవస్థానం లభిస్తుంది. ఇంతకు ముందున్నటువంటి అసంతృప్తి, ఆందోళన క్రమంగా సమసిపోతవి. ఇప్పుడే అదృష్టం పండి చేతికి రాదు. కాని, వృత్తి వ్యాపారాలలో పదిమందియొక్క ఉదారాభిప్రాయాలు, అధికారము, గౌరవము బాగా వృద్ధి అవుతవి. సమయానుకూలంగా బుద్ధిని వినియోగించుకొంటారు. పిల్లల మూలంగా సుఖము, సంతోషము లభిస్తవి. క్రొత్తగా ఏ కార్యము తలపెట్టినా ఇతరుల అభ్యంతరము అనేది ఉండదు. అవసరాలకు మించి ఖర్చు చేయుటం జరుగుతుంది. విద్యా వినోద సంబంధమైన కార్యక్రమాలలో ప్రోత్సాహము, ఫలితము బాగుంటవి అధికారులతో మాట పట్టింపులు రాకుండా జాగ్రత్తపడటం అవసరం.

**కుటుంబంలో జరిగే విశేష కార్యక్రమాలయందు** శ్రద్ధవహించలేకపోతారు.

* * *

## కన్య :

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

అన్ని విషయాలలోను మీ మాట చలామణి అవుతుంది. కుటుంబంలో శుభ సంతోషకార్యాలు జరుగుతవి. వృత్తిలో క్రొత్తవారి సంబంధము ఏర్పడగల అవకాశాలున్నవి. వ్యవహార రంగంలో పనులు తెమలవు. మీరు తొందరపడి చేయవలసినది కూడా కనుపించదు. ఆత్మీయులవల్ల మీ మన శ్శాంతి లోపిస్తుంది. వృత్తిలో మీ శక్తి సామర్థ్యాలు బాగుంటవి. ఓర్పుతో పనిచేయగలుగుతారు. బాహ్య విషయాలలో మీ విలువ క్రమంగా పెరుగుతుంది. పిల్లల ఆరోగ్యం తాత్కాలికంగా చెడే సూచనలున్నవి. వారం రెండవభాగంలో బంధువులవద్దమంచి అసం తృప్తికరమైన వార్తలు తెలుస్తవి. 20, 21 తేదులలో అధిక వ్యయము, ప్రయాణ సూచనలు.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

కార్యభారం పెరిగి మీరు శ్రమపడుతూ ఉంటే విషయాలు మాట్లాడేవారు మాట్లాడుతుంటారు. ధన విషయంలో తగాదాలు వస్తవి. ముందుగా మీచేత పనిచేయించుకుని మోసంచేసే మను ష్యులు తటస్థపడతారు. సంఘంలో పెద్దమను ష్యుల అండ లభిస్తుంది. ఇతరుల నిమిత్తం మీరు శ్రమపడటమే కాని, సాఫీగా పనులు సాగవు. అధికా రులవలన మాటవచ్చే సూచనలున్నవి. ఆదాయం బాగుంటుంది. కుటుంబంలో మీరు తలపెట్టిన పనులు మధ్యలో హెచ్చుతగ్గులు అయ్యేటట్లు తోచినా, మొత్తంమీద పూర్తిచేయగలుగుతారు. ధనం లభిస్తుందనుకున్న సమయంలో అభ్యంతరం ఏర్పడుతుంది. బాహ్య ఆడంబరం పెరుగుతుంది. 18, 19 తేదులలో గౌరవప్రాప్తి, శుభకార్య ప్రయత్నాలు.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4-వ పాదం. అనూరాధ, జ్యేష్ఠ.)

గ్రహస్థితి చాలావరకు అనుకూలంగా ఉన్న సమయం. సంఘకార్యాలలో మీరు వేసిన ప్లాను ప్రకారం అభ్యంతరం లేకుండా ముందుకు పోగల్గు తారు. శరీర శ్రమకన్నా మానసికంగా శ్రమ అధికం. ప్రయాణ కార్యక్రమాలలో నిరుత్సాహం తోస్తుంది. కాని, చివరకు ప్రయోజనం సాధించగలుగుతారు. మీ ఆరోగ్యంకూడా సంతృప్తికరంగా ఉంటుంది. సాధ్యమైనంతవరకు ఎవ్వరికీ చనువు ఈయకుండా పనులు సాగించతగిన కాలం. ఆదాయం పెరుగుతుంది. స్వంత విషయాలలో ఇంతకు ముందున్న నిరుత్సా హము తొలగిపోతుంది, వారం రెండవ భాగంలో శుభవార్తలు తెలుస్తవి. 16, 17 తేదులలో ధననష్టము, బంధువులతో విరోధం.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం మీ శక్తికి తగినట్లు అవకాశం కూడా లభిస్తుంది. కీర్తి పెరుగుతుంది. అధికారుల వలన స్వల్పంగా ప్రయోజనం పొందగలరు. అన్ని విషయాలమీదా మీ బుద్ధి చురుకుగా ప్రాకి పోగల సమయం. తోటివారి ఆదరాభిమానాలు పొంద గలుగుతారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం కాని, వస్తువులు కాని అవసరానికి అందక బాధపడ వలసివస్తుంది. కొన్ని ముఖ్య వ్యవహారాలలో మీ ఆలోచనలు తెమల్చకుండా వృధాగా ఆలస్యం చేసు కుంటారు. పిల్లల సుఖసౌఖ్యాలను గురించి శ్రద్ధ వహించవలసిన సమయం. ఉద్యోగ కార్యకలాపాలలో గౌరవముతోకూడిన అధికారము, ఆదాయము బాగుం టవి. క్రొత్త విషయాలయందు ఆసక్తి పెరుగు తుంది. 20, 21 తేదులలో ప్రయాణసూచన, శుభవార్తలు.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీరు అనుకొనేది ఒకటి, చివరకు జరిగేది మరొకటి; ఆర్థికంగా శ్రమ అధికం. ఒకపనికీ, మరొక పనికీ సంబంధం కనిపించదు. వృత్తిలో భాగస్తుల వంటివారితో పేచీలు రాకుండా తొలగి ఉండటం అవసరం. గౌరవానికి పాటుపడటమే కాని, ప్రయో జనం పొందగలమనే ఆశ కనిపించదు. వృత్తిలో మీ శక్తికిమించిన పనులు చేయవలసి ఉంటుంది. అధికారులను కలుసుకొంటారు. నౌకరులవల్ల కార్యానుకూలత కలుగుతుంది. ఉత్తర ప్రత్యుత్త రాలలో ఎదటివారికి కోపంవచ్చే అవకాశాలున్నవి. మీ అశ్రద్ధవల్ల ఆరోగ్యం చెడిపోతుంది. వారాం తంలో విశేషంగా ధనలాభ సూచనలున్నవి.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీ కోర్కెలు చక్కగా ఫలించే సమయం. అధి కారము, పేరు ప్రతిష్ఠలు బాగుంటవి; డబ్బుపెట్టు బడిచేసిన వ్యాపారాలు మొదలయినవి ఈ సమ యంలో ఉన్నత స్థితికి వస్తవి. ప్రయాణాలు లాభ కరంగా జరుగుతవి. మాటల సందర్భంలో నిబ్బ రంగా ఉండవలసిన సమయం. విలాస వినోద కార్య ములకై ఖర్చులు విశేషంగా చేస్తారు. యంత్ర సంబంధమైన వ్యాపారాలలో పేచీలు, చిక్కులు రాకుండా చూచుకొనండి. పిల్లలమూలంగా ఆనం దం లభిస్తుంది. విద్యార్థులకు శుభప్రదమైన కాలం. బుద్ధిబలంతో ఎంతటి పనినైనా సాధించగలుగు తారు. విలువగల వస్తువులు కొనటం లేక అమ్మటం వంటి పనులు లాభదాయకంగా పూర్తి అవుతవి. 21, 22 తేదులలో దేహశ్రమ, ధనలాభం.

* * *

### ఈ వారము ధరలు

ఈ వారం బంగారు ధర కొద్దిగా పెరిగే సూచనలున్నవి. వెండి ధర నిలకడగా ఉంటుంది. ధాన్యం ధర మందీ అవుతుంది. ప్రత్తికి గిరాకి వస్తుంది. నూలు ధర ముందుగా పెరిగి వారాంత ములో మందీ వస్తుంది. నూవుల ధర క్రమంగా పెరుగుతూ ఉంటుంది. నూవులనూనెధర పెరిగి తగ్గుతుంది. మిర్చి ధర బాగా పెరిగే అవకాశా లున్నవి. వేరుశనగపప్పు ధరలో హెచ్చు తగ్గులు తరచు కనుపిస్తవి.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఎంత భారమైన పని ప్రారంభించినా చురుకుగా జరుగుతుంది. డబ్బుకు సంబంధించిన లెక్కలు మొదలయిన విషయాలలో జాగ్రత్తగా ఉండండి. తోటివారు ఎంత ప్రోత్సాహపరచినా సాహస కార్యాలలో ప్రవేశించలేకపోతారు. కుటుంబంలో ఖర్చులు పెరుగగల అవకాశాలున్నవి. సమయంలో వ్యవహారాలు ఒక దారికి వస్తవి. తలవనితలంపుగా స్నేహితులను గురించి అసంతృప్తికరమైన వార్తలు వింటారు. సాధారణంగా మీ డబ్బు అనవసరంగా ఖర్చుఅయ్యే సమయం. కారణంఉన్నా, లేకపోయినా తరచు మానసిక ఆందోళనమాత్రం కలుగుతూ ఉంటుంది. ఇతరుల వ్యవహారాలలో మధ్యవర్తిత్వం నెరపవలసిన సమయం. ★



ఇంటిల్లిపాదికీ ఆనందం కలిగించే
ఆంధ్రసచిత్ర వారపత్రికను తప్పక చదవండి.




కుటుంబంలో అందరి బట్టలను ఇంట్లో ఉతకండి ... షర్టులు, రవికెలు, చీరలు, పిల్లల దుస్తులు, తువ్వాళ్లు, ప్రతి బట్టనూ! కుటుంబంలో అందరి బట్టలనూ సర్ఫ్‌తో ఉతకండి. సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తివల్ల ఫలితంగా మీ బట్టలు అమిత తెల్లగాను పరిశుభ్రంగాను వుంటాయి. నేడే సర్ఫ్ వాడి చూడండి! అది బట్టలను ఇంట్లో ఉతుక్కొనే అత్యుత్తమ విధానం.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి.

SU. 24 X53 TL

# కథ కాని కథ

## రిబ్బన మిస్టరీ!

(మొదటి బహుమతి)

మా ఇంట్లో కొన్ని నూల్లు రిబ్బన్లు పోవడం జరిగినట్లు, ఈ క్రింది సంఘటన తరువాతగాని, మేమంతగా పట్టించుకోలేదు. ఏదో పుస్తకం తిరగేస్తున్న నాకు, ఏదో ఎర్రగా నా మీదనుంచి పోవడం కన్పించింది. వెంటనే పైకి చూచాను. చాలా ఆశ్చర్యం కలిగింది. ఒక పిచ్చిక ఎర్రని రిబ్బను కొసను పట్టుకుని ఎగిరి పోతోంది. కుతూహలంతో నేను దాని వెనుకే ప్రక్కగదిలోకి వెళ్లాను. చాలా కాలంగా మా నాన్నగారు వాడకుండా విడిచిపెట్టేసిన ఒక టోపీ మేకుకి తగిలించి వున్నది. దానిలో ఈ పిచ్చిక గూడు కట్టింది. ఆగూట్లో నుండి ఎర్ర రిబ్బను వేళ్లాడటం చూచాను. మా నాన్నగారి అజ్ఞానుసారం, ఆ పిచ్చిక తన పిల్లలతో సహా గూడు విడిచిపెట్టాక ఆ ఖాళీ "గూటిని" క్రిందికి దించాను. ఆ గూడులో మేము చూచిన వస్తువులు ఇవి! నాలుగు నైలాను రిబ్బన్లు, ఒక సూదితోనున్న దారం, కొన్ని సిల్కుగుడ్డ పీలికలు.

"ఆసి! పిచ్చుకా! ఇంటి దొంగ వైనావుగా" అనుకున్నాను.

కె. వి. రమణ, (పూనా)

## చెల్లెలి గడుసుతనం

(రెండవ బహుమతి)

ప్రతిరోజూ ఉదయం మా అమ్మ దైవపూజ చేస్తుంది. మా అమ్మ ప్రక్కనే కూర్చుంటుంది మా చెల్లి. ఆరోజు నేనుకూడ పూజదగ్గర కూర్చున్నాను. మా అమ్మ పూజ చేయడం ముగించిన తరవాత మా చెల్లి యిలా అంది: "అమ్మా! నీవు రోజూ పూజ చేస్తున్నావు కదా- దైవాన్ని చూస్తున్నావా?" అంది.

"లేదమ్మా! నాలాంటిదానికి ఆ దేవుడు కనిపిస్తాడా, తల్లీ!" బాధగా అంది, మా అమ్మ.

"మరైతే, నేను రోజూ దేవుణ్ణి చూస్తున్నాను. చూస్తానంటే దైవం చుట్టూ తిరిగొస్తాను." అంది మా చెల్లి. మా చెల్లిమాటలకు నేను, మా అమ్మ ఎంతో ఆశ్చర్యపోయాం. 'మాకు చూపిస్తావా?' అన్నాం. అలాగే నంటూ రెండు చేతులు జోడించి మా అమ్మచుట్టూ తిరిగొచ్చి యిలాఅంది: "నీవేనమ్మా దైవం! నీ చుట్టూ తిరిగొస్తే, ఆ దైవం చుట్టూ తిరిగొచ్చినట్టేకదా!" అంది. మా అమ్మ చెల్లెల్ని కనివితీరా ముద్దుపెట్టుకుంది మా చెల్లి భక్తికి. నేనెంతో ఆశ్చర్యపోయాను మా చెల్లి తెలివితేటలకు. (గమనించ ప్రార్థన) చెల్లెలు వయస్సు 10 సంవత్సరాలు.

పుల్లా రామారావు (యలమంచిలి)

## రసాభాస

(రెండవ బహుమతి)

మేము కలకత్తాలో ఉన్న రోజులవి. ఆ రోజులలో కలకత్తాలో ఒక తెలుగు చిత్రము తీస్తున్నారు. నేను మా నాన్నగారిని నాకు షూటింగ్ చూపమని వేధించగా నన్ను స్టుడియోకు తీసుకెళ్లారు. స్టుడియోలో సీఒకఔట్ డోర్‌సీనుహీరోయిన్ పారిపోతుండగా విలన్, 25 మంది రౌడీ బృందముతో వెంబడించుట. ఆ 25 మంది రౌడీబృందము కలకత్తాలో ఉండే ఎక్స్ట్రాలే. "పదండ్రా పదండ్రా" అనే డైలాగును సహాయదర్శకుడు కనీసం 20 సార్లయినా రిహార్సల్సు యిచ్చి, మానేటర్‌తో O. K. చేసి పాటకు రెడీ కమ్మని ఎక్స్ట్రాలకు చెప్పారు. అంతవరకు రెడీగా ఉన్న బెంగాలు రౌడీ బృందము "రెడీ-స్టార్టు" అనడంతో, కంగారుగా డైలాగు తొట్రుపాటుపడి "దంపండ్రా-దంపండ్రా" అన్నారు. దానితో దర్శకుడు నెత్తిన చెయ్యి వేసుకొని నవ్వాలో ఏడవాలో తెలియక వారిని కూకలేశాడు. నేను, మా నాన్నగారు, తదితర మద్రాసు బృందముయొక్క నవ్వులతో ఆ ప్రదేశము మారుమ్రోగినది.

ఆనంద్ (మద్రాసు)

★

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

రామనాథం అనుకున్నంత పనీ అయింది. వాన తుప్పర ఆరంభమయింది. మెరుపు కొరడాలు ఆకాశాన్ని ఎడాపెడా ఝుళిపిస్తున్నాయి. ఈ తుప్పర ఇంతటితో ఆగకుండా పెద్దదై ముత్తేసే సూచనలు కనబడుతున్నాయి. నర్సమ్మ మంచంమీద లేచి, కూర్చుంది.

ఇప్పుడేం చెయ్యాలన్నట్టుగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు తండ్రి కూతురు.

అనుకోని విధంగా తుప్పర కాస్త తగ్గినట్టుగా ఆకాశం తెరపి యిస్తున్నట్టు భ్రాంతి కలిగి మరీ నడుం వాల్చారు.

చిన్న కూతురు ఇందిరమ్మ, అల్లుడూ ఉన్న గదిలోంచి ఇంకా వెలుగుతున్న దీపం వెల్తురు తలుపు సందులోంచి చారగా ఆయన పడుకున్న మంచానికి అడ్డంగా పడుతూంది.

ఆరుబయట కదలకుండా మెదలకుండా, ఊపిరి గట్టిగానైనా విడవకుండా చీకట్లోకి, మెరుపుల్తో చీలికలవుతున్న ఆకాశాన్ని చూస్తూ ఏవేవో జ్ఞాపకాలు తెచ్చుకొంటూ అవస్థపడుతూన్న తండ్రిని కూతుర్ని మళ్లీ లేపి కూర్చోబెట్టింది వాన.

బండరాళ్లపైన చక్రాలు దొర్లుతున్నట్టుగా దడదడ మంటూంది ఆకాశం!

కుక్కిమంచంలో కూర్చున్న రామనాథం "అమ్మాయి! ఇక లాభంలేదే" అన్నాడు ఉండబట్టలేక.

మంచాలు పంచలోకి లాగింది నర్సమ్మ తండ్రి సహాయంతో.

ఎదురింటి మేడ గదిలో వెల్తురు చారిక పంచ ముందు భాగంలో పడుతోంది. మంచాన్ని మరింత లోపలికి అంటే వెలుతురులోంచి చీకట్లోకి లాక్కున్నాడు రామనాథం.

నర్సమ్మ ఓమారు ఎదురింటి మేడమీదకు చూసింది.

ఆ పంచలోకి వాన రాదనే నిశ్చింత ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికీ లేదు. పైగా ఇంకా పెద్దదవుతుందేమో ననే భయం!

ఈ కూతుర్ని, నర్సమ్మను చూస్తేనే కడుపు తరుక్కుపోతుంది రామనాథానికి. పిల్లా పాపాతో తన కాపరం తను చేసుకొంటూ 'రా తల్లీ' అంటేగాని నాలుగురోజులైనా నట్టింట ఉండటానికి రాని పిల్లి పసుపూ కుంకుమా పోయి, ఏమీలేకుండా అన్నీ పోయి, తనూ లేనిదానిలో లెఖ్ఖయి సంసారాన్ని ఉసూరుమంటూ ఈడుస్తున్న రామనాథం పంచని చేరిన నర్సమ్మ గుండెలమీద కుంపటయిపోయింది తండ్రి ప్రాణానికి. ఆపిల్లని చూస్తేనే కడుపు దేవినట్టుగా, తల తిరిగినట్టుగా, తిన్నదంతా నీరయిపోతున్నట్టుగా, గుండెలు చెరువైపోతున్నట్టుగా, తాను కరిగిపోతున్నట్టుగా కుంచించుకుపోతా డతను.

రెండోకూతురు ఇందిరమ్మ పెళ్లి ఈ మధ్యనే అయింది.

పెళ్లయి కాపరానికి వెళ్లింతర్వాత నోములకని నెల్లాళ్లుండిపోవడానికి మొదటిసారిగా వచ్చింది.

వచ్చి నాలుగురోజులయిందో లేదో పిలవని



# వనస్పతి

## ... భారతదేశములో ఆహార శుద్ధతకు ప్రమాణముగా ఉంటోంది!

వనస్పతి ఎంతో శుద్ధమైన ఆహారము కనుక భారతదేశములో లక్షలాది మంది జనులు దానిని ప్రతి రోజు వాడతారు. ప్రజల ఆరోగ్యమును కాపాడుటకు ప్రభుత్వము మరియు వనస్పతి తయారీదారులు వనస్పతిని అత్యంత శుద్ధమైనదిగా లభించేలా చూచుటకు కఠినమైన పద్ధతులను నియమించేరు. ఆ పద్ధతులకు సరిగా సరిపోయేలా మాత్రమే వనస్పతి తయారుచేయబడుతోంది. అది శుద్ధమైన, ఎంతో శ్రేష్ఠమైన శాక జిడ్డు పదార్థముగా ఉండేలా నిశ్చయపరచుటకు తయారులో ప్రతి దశలోను అది పరీక్షింపబడుతోంది!

శ్రేష్ఠమైన శాక నూనెలను శుద్ధీకరించి, చెడు వాసనను తీసివేసి, హైడ్రొజెనేట్ చేసి మరియు విటమినులు చేర్చి తయారు చేయబడినదే వనస్పతి. దాని ప్రతి గ్రాము 25 ఇంటర్‌నేషనల్ యూనిట్ల విటమిను 'ఎ' మరియు 3 ఇంటర్‌నేషనల్ యూనిట్ల విటమిను 'డి'తో పుష్టికరముగా చేయబడినది. కనుక వనస్పతి శ్రేష్ఠమైన పేరుగాన్న జిడ్డుపదార్థము అంత పోషకవంతమైనది మరియు మామూలు జిడ్డుపదార్థముల కంటె ఎక్కువ పోషకవంతమైనదీను. అంతేకాకుండా, దాని శుద్ధత మరియు ఆహార విలువ పాడవకుండా ఎల్లకాలము ఉండేలా అది ఆరోగ్యరక్షక పద్ధతులతో డబ్బాలలో ప్యాకు చేయబడి పీలు చేయబడుతోంది. ఈ విధముగా ఒక వంటకు వాడే జిడ్డుపదార్థము యివ్వాలని మనము కోరే శుద్ధత, నాణ్యత, పోషణలే కాకుండా రుచికరమైన వంట, కొదువ మరియు వాడుకలో సౌకర్యమును కూడ వనస్పతి ఇస్తోంది!

ఈ సౌకర్యములన్నిటిని కలుగచేస్తోంది కనుక వనస్పతి మన దేశములో లక్షలాది కుటుంబములలో అన్నప్రియమైన వంటకు వాడే సాధనగా ఉపయోగించబడుతోంది! దానికి గత 30 ఏళ్ళలో చూస్తే వనస్పతి యొక్క వాడకము 30,000 టన్నుల నుండి 3,38,000 టన్నులకు పైగా వరకు ఎక్కువ అయింది!

వ్యవసాయిక, వైజ్ఞానిక మరియు సాంకేతిక శాఖల కృషి ఫలితముగా తయారగు వనస్పతి మన దేశములో...మీ యింట్లో... వంటకు వాడుటకు దివ్యమైన జిడ్డు పదార్థముగా ఉంటుంది!

వనస్పతి మరియు అటువంటి జిడ్డు పదార్థములు ప్రపంచమంతటా వాడబడుతున్నాయి!

ఇంకా వివరములకు యీ ఎడ్రసుకు వ్రాయండి:

ది వనస్పతి మ్యాన్యుఫేక్చరర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా,
ఇండియా హౌస్, ఫోర్ట్ స్ట్రీట్,
బొంబాయి-1

IWT-VMA-4282 TE


## చీకట్లో చినుకులు

పోయినా అల్లుడు రానేవచ్చాడు..

వచ్చినవాడు నాలుగు రోజులయినా ఉండడు.

కాని ఉన్న పది రోజుల్లోను నాలుగు రోజుల కొకసారి వచ్చి ఓ రోజు ఉండిపోతుంటాడు.

అతనువచ్చాడూ అంటే వానయినా వరదయినా నర్సమ్మకు, రామనాధానికి ఆరుబయట పక్కలు తప్పవు.

ఉన్నది ఒక్క గది. తడిక అడ్డంపెట్టి గదిని రెండు భాగాలు చేశారు. తడికి అవతలభాగంలో నర్సమ్మ వంటచేస్తూంటుంది. ఆ కాస్త జాగాలోను వంటగదిలో ఉండాల్సిన వస్తువులన్నీ ఉంచటానికి చోటులేక కొన్ని తడికి ఇవతలిభాగంలోనూ సర్దుకున్నారు. అక్కడే రామనాధం కాగితాలు రాసుకుందుకు, ఎవరైనా వస్తే మర్యాద చెయ్యటానికి ఒక కుర్చీ, ఓ టేబిలూ ఉన్నాయి. రాత్రిపూట వాల్చుకుని పగటిపూట గోడకి చేర్చే మంచం, నర్సమ్మ బట్టలపెట్టి, రామనాధం బట్టలపెట్టి, భార్య బ్రతికి ఉన్నన్నాళ్ళూ వాడుకున్నపెట్టి, పాతబట్టల బుట్ట, ఒకపక్క బియ్యండబ్బా, ఓమూల చెప్పుల జోళ్ళు, గోడకి వేలాడే బట్టలు, పైన గోడవారగా రేకుల చిల్లులోంచి వాన కురిసి ఇల్లంతా చిందరవందర కాకుండా దారికడ్డంగా చిన్న బింది. తీసిన అడుగు మరోకచోట వెయ్యాలి అంటే ఎంతో మెలుకువగా వెయ్యాల్సిన ఇంట్లో, ఆ సామాన్లలో స్థిరనివాసం ఏర్పరచుకుని రాత్రిపూట జంయ్ మంటూ కసితీరా దాడిచేసే దోమలమధ్య కీటకంలో కీటకంలా కాలక్షేపం చేస్తున్న రామనాధం నెలకి ఎనభై రూపాయలు సంపాదిస్తూన్నాడు. వయసు వాలిపోయి శక్తి ఉడిగిపోయినా ఆర్జించక తప్పని పరిస్థితుల్లో ఉన్నాడతను. ఎంతో అనువుగా, సదుపాయంగా ఉన్నదానిలో ఉన్నంతగా సంసారం గడిపే ఇల్లాలు—ఎంతో సదునుగా వెళ్ళాల్సిన ఈ పెద్ద వయస్సులో రామనాధాన్ని, దిగులుతో పచ్చికుండలాంటి జీవితం ఫళ్ళుమన్న వేదనతో, భారంగా బ్రతుకు వెళ్ళబోసే పెద్దకూతురు నర్సమ్మకు వప్ప జెప్పి—అలాగూ అనటానికి వీల్లేదు, గొంతులో ప్రాణం కొట్టుమిట్లాడుతున్నప్పుడు కూతుర్ని భర్తకి అప్పజెప్పాలో భర్తని కూతురుకి అప్పజెప్పాలో తోచక ఇద్దరికేసీ చూసి కన్నీరు కార్చి—ప్రాణం వదిలింది. ఇద్దరు కూతుళ్ళనీ దగ్గరగా పొదివి పట్టుకుని 'పిల్లల గురించి దిగులుపడకు. నా గురించీ దిగులుపడకు' అన్నాడు గద్గదస్వరంతో. గొంతుక పూడుకపోయినా పెగుల్చుకుని ఆ నాలుగు ముక్కలూ అనగలిగాడు. కూతుళ్ళిద్దరూ బెంబేలు పడిపోయారు బావురుమన్నారు.

పెద్దకూతురు చిన్న కూతురుతో 'నా రాత మంచిదికాదు ఇందిరమ్మా. నే నెక్కడుంటే అక్కడే పెద్దమ్మ అడుగిడుతూంది. ఈ ఇంటికి రాకపోయినా అమ్మ బ్రతికేదేమో!" అని అంటుంటే విన్నాడు రామనాధం. "ఎంతమాటన్నావే తల్లీ! గుండెలు కోసేసేమాటన్నావు. అలా ఎవరైనా అనుకుంటే వాళ్ళు పుచ్చిపోతారు. కుళ్ళిపోతారు. దిక్కులేని చావు చస్తారు" అంటూ ఆవేశంగా నివ్వెరపోయిన కూతుర్ని

గుండెలకు హత్తుకుని ఏడ్చాడు. భార్య పోయి నప్పుడు కూడా ఏడవనంతగా ఏడ్చాడు.

దిక్కులేని పుచ్చుకుక్క చలికి వణుకుతూ దగ్గరగా ముడుచుకుపోతూ మూలుగుతూ మెల్లవార వడుకుంది.

జల్లు పెద్దదయింది.

రామనాథం దుప్పటి తలమీదికి లాక్కున్నా ఒంటికి తడి తగుల్తూనే ఉంది దుప్పటి తడిసి. లేచి గోడకి దగ్గరగా మంచం లాక్కున్నాడు.

నర్సమ్మకి నిద్ర తేలిపోయింది. ఎప్పుడు తెల్ల వారుతుందా భగవంతుడా అని ఎదురుచూస్తూంది. "ఇప్పుడేగా పక్క ఇంట్లో గడియారం పదకొండు కొట్టింది. ఎదురింటి మేడగదిలో దీపాలు ఇంకా వెలుగుతూనేఉన్నాయి. ఎదురింటివాళ్లమ్మాయి పెద్ద చదువు చదువుతూంది. రోజూ కాలేజీకి వెళ్తుంది. రాత్రిళ్లు చాలాసేపటికివరకూ చదువుతూనే ఉంటుంది. తెల్లవారుఝామున తనకంటె ముందుగా లేస్తుంది. అయినా అంత పెద్ద చదువులు చదువు కుంటే ఎవరు పెళ్లి చేసుకుంటారు ? అంతకంటే పెద్ద చదువులు చదువుకున్నవాళ్లు రావాలి. అంటే ఎంతో ఉన్నవాళ్లు రావాలి. పెద్ద సంబంధాలు, పెద్ద కట్నాలు పొయ్యకుండా వస్తాయా ? ఆడ పిల్లలకి ఇంతింత డబ్బుపోసి చదువులు చెప్పించటమే కాకుండా కట్నాలు కూడా ఇవ్వక తప్పకపోతే కష్టంకదూ. ఎదురింటాయనకు నలుగురు ఆడ పిల్ల లున్నారు. నలుగురు మొగపిల్ల లున్నారు. నలుగురు మొగపిల్లలూ పెద్ద చదువులు చదువుకుని పెద్ద ఉద్యోగాల్లో ఉన్నారు. నలుగు రాడ పిల్లలూ పెద్ద చదువులు చదువుకున్నారు. మొగ పిల్లల్లో ఇద్దరికి, ఆడపిల్లల్లో ఇద్దరికీ పెళ్లి ళ్లయాయి. ఆయనకు ఇంత డబ్బు ఎక్కడిదో! పెద్దాళ్లు గడించిఉంటారు. ఆయనకీ పెద్ద జీతమే వస్తుంది. అంత డబ్బున్నా,—అనకూడదుగాని— అంతా బతికేఉన్నా వాళ్లల్లో వాళ్లకి కష్టాలున్నాయి. మనసులు కలవక ఒకళ్లమీద ఒకళ్లకి అసూయలూ, అనుమానా లున్నాయని ఆ పిల్లల మాటల్లోంచి తను అర్థం చేసుకుంది. ఆ పిల్లలు అంత చదువులు చదువుకున్నా తనతో చాలా విష యాలు దాపరికంలేకుండా చెబుతూనే ఉంటారు. చెప్పకూడనివి కూడా చెబుతూంటారు. తన పెద్ద న్నయ్యకు ఒదినమీద అనుమానంట. అస్తమానమూ సాధిస్తూంటాట్ట. అప్పుడప్పుడు గదిలోపెట్టి స్పృహ తప్పిపోయేలా కొడుతూంటాట్ట. అందుకని ఆవిడ ఎప్పుడూ గది విడిచి ఇవతలికి రాదుట. కనీసం కిటికీల దగ్గరైనా నిలబడి బయటు ప్రపంచాన్ని చూడ టానికి వీల్లేదుట. ఆ అమ్మాయి తాలూకు పుట్టింటి వాళ్లు అప్పుడప్పు డొచ్చి గోల పెడతారుట! ఇక రెండో అన్నయ్య వెడు తిరుగుళ్లు తిరుగుతాడుట! రాత్రిళ్లు చాలా పొద్దుపోయేవరకూ ఇంటికి రాడుట. తల్లీ, దండ్రీ, పెళ్లాం ఎన్నోవిధాల చెప్పి చూశారుట. అతగాడికి రెండు సంసారా లున్నా యని చాలామంది చెప్పుకుంటూంటారు. ఎంత చదువులు చదివినా ఆడదానికి ఏడుపు తప్పదు. ఏడుస్తూ జీవించటం ఎవరికైనా తప్పనిసరే అనే నిర్ధారణకు వచ్చేసింది నర్సమ్మ. ఆడదానికి ఏవి ధంగా చూసినా ఎప్పుడో ఒకప్పుడు ఏడుపు తప్ప దని స్వానుభవంతో నర్సమ్మ తెల్సుకుంది. కనుక తాను చదువుకుని ఉంటే కష్టాలు తప్పేవి అను కోవటం శుద్ధ తెలివి తక్కువ అని అనుకొంది. తన కడుపున ఓ నలుసు పుట్టి ఉంటే ఈ జీవితం ఇంకోవిధంగానైనా నడిచేది. కష్టపడినా నష్ట పడినా ఫలితం ఏనాడో ఓనాడు ఉండకపోదు. తన ఆశలన్నీ ఒకవైపుకు కేంద్రీకృతంచేసి బ్రతికేది. ఈ పెద్దమ్మకు, ఈ దురదృష్టం జీవికి జీవితంలో ఆపాటి వెలుగు కూడా ఎందుకుంటుంది ?

రామనాథం "ఇక్కడ కూడా పడుకోనిచ్చేట్టు లేదు పాడు వాన" అని గొణుక్కోవటంతో నర్సమ్మ ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. దుప్పటి ఒంటికి తడిగా తగుల్తున్న సంగతి కూడా అప్పుడే తెలిసిందామెకు.

రామనాథం మంచంమీంచి లేచి గత్యంతరంలేక నిస్సహాయంగా గోడకి అంటుకుపోయి నిలబడి ఉన్నాడు నర్సమ్మ దుప్పటి ముఖం మీంచి తొలగించి చూసేసరికి.

జాలితో కడుపు కోసుకుపోయిం దామెకు.

ఆకాశాన్ని మెరుపు తళుక్కుమని చీల్చింది.

'ఈ కుటుంబాన్ని ఎవరి దృష్టిలోంచి పరిశీలించినా సంతుష్టి అనేది ఏ కోణంలోనూ కన బడటంలేదు' అనిపించింది నర్సమ్మకు. లేవాలను కుంది గాని ఏదో ఆలోచన వచ్చి ఆగిపోయింది. ఈ పాడు వాన తగ్గితే బాగుండును! తగ్గే సూచనలు మాత్రం లేవు. బయట రోడ్డుమీద నీళ్లను చిందగొడుతూ ఉండీ ఉండి ఓ సైకిలురిక్షా, గుర్రబ్బండీ వెళ్తూన్న చప్పుడు వినిపిస్తూంది.

రామనాథం గోడవార అల్లా నిలబడే ఉన్నాడు.

లోపల గదిలో చిన్న దంపతు లిద్దరూ ఉన్నారు. మెలుకువగానే ఉన్నారేమో....ఉన్న జాగా కొద్ది. అందులో ఇంతమంది ఇముడాలి. పగ లయితే ఎలాగు తిప్పలు పడతాం. పనులు వంక బెట్టుకొని భావి దగ్గరో, రుబ్బురోలు దగ్గరో కొంత కాలక్షేపం చెయ్యవచ్చు. ఇరుగింటికీ పొరుగింటికీ వెళ్లి వాళ్లని కదిపి మాటల్తో కొంత పొద్దు గడపొచ్చు. రాత్రిళ్లు ఎట్లా చావటం ?" అనుకుంది నర్సమ్మ.

అంతలోనే 'అయ్యోరాత! నేనేనా ఈమాట అనుకోవాల్సింది. ఆ ఆనందం ఆ సుఖం ఎంతవారికి దక్కేను" అనిపించి మనసులోనే లెంపలు వేసు కుంది.

తండ్రి మీద చెయ్యివేసి "అయ్యో! తడిసి పోతున్నావమ్మా" అంటూ కుదిపాడు.

నర్సమ్మ లేవక తప్పలేదు. అప్పుడే మెలుకువ వచ్చినట్టుగా లేచి కూర్చుంది.

నర్సమ్మ కూడా లేచివెళ్లి గోడవార పొడిగా ఉన్న చోట నిలబడక తప్పలేదు.

వసారా పూర్తిగా తడిసిపోయి చితపతలాడుతోంది.

ఎదురింటి మేడమీద దీపం వెలుగుతూనే ఉంది.

గదిలోంచి, పెరటివైపు కిటికీ రెక్కలు తెరిచిన చప్పుడు. ఆ వెనకనే 'గాదిలో పడుకున్నట్టుంది గాని గదిలో పడుకున్నట్టు లేదు. ఎక్కడపడితే అక్కడ వెధవ సామాన్లు, మోకాలుచిప్ప పగిలింది'


శ్రీ బాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పసువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలించిన సొమ్ము, విడిపోయినభార్య మీరు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలను. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలలవారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తిపేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును.

హనుమాన్ జ్యోతిషాలయము,
10వ లైను, అరండల్ పేట, గుంటూరు 2.



ప్రిన్స్ ప్యాకెట్ రేడియో

సిగరెట్ కేసుకంటే చిన్నది. తేలికైనది. సులభముగా ప్యాకెట్‌లో ఉంచుకోవచ్చు. పొదుపైనది. ఎలెక్ట్రిసిటీ లేక బ్యాటరీ అవసరంలేదు శ్రావ్యమైన నాదము వినిపిస్తుంది. ప్రపంచంలో ప్రతిస్టేషను స్థానికముగా వినవచ్చును. సులభముగా ఉంచుకొనుటకు అనువైనది. అందమైనది. ధర రు. 30/- స్పెషల్ నెం. – D – 151– రు. 40/- వి. పి. పి. చార్జీలు రు. 3–50 అదనం. తోలుకేసు రు. 5/- లైసెన్సు ఫీజు అదనం. పత్వర సప్లయికి రు. 10/- అడ్వాన్సుగా పంపండి. ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయండి.

Tagore Vigyan Mandir (N R.)
Halka No. 13. ALIGARH



ఐటెక్స్
(కాటుక)
శాస్త్రీయంగా తయారైనది
అరవింద్ బిందీ
కుంకుమ చాదు
6 ఆకర్షణీయమైన రంగులలో లభించుచున్నవి

అరవింద్ లేబరేటరీస్
పి. బి. 1415, మద్రాసు-17.

తెలంగాణా జిల్లాలకూ హైదరాబాదుకూ మినహా ఆంధ్రప్రదేశ్‌కు ఏజెంట్లు:
ప్రగతి ఏజెన్సీస్,
పులిపాటివారి వీధి, విజయవాడ-1.

అన్నీ అల్లుడిగారి నిసుగుబాటుతో కూడిన కంఠం వినిపించాయి.

మళ్లీ అదే కంఠం తన్మయంతో "ఎంత హాయి ఈ రేయి .... వానరేయి...." అంటూ పాటగా పాడ టమూ వినిపించింది.

నర్సమ్మ అంత స్పష్టంగానూ ఆ మాటలు విన్న తర్వాత ఎప్పుడో చదివిన ఏో నవలలోని ఏో వాక్యం జ్ఞాపకం వచ్చి వల్లించుకొంది 'ఈ భూమి బద్దలై పోయినా బాగుండును' అని. ఆ నిముషంలో తండ్రి దగ్గర ఎలా ప్రవర్తించాలో తెలియక తికమక పడు తూంటే .... అదృష్టవశాత్తు .... ముక్కులు తిరిపెట్టినట్టుగా అయి ఒళ్లంతా కదిలిపోయే టట్టుగా తుమ్ము వచ్చింది. ఆ వరసనే అయిదారు సార్లు తీవ్రంగా, ఆ వాన చప్పుడ్ని అందులోనూ రేకులమీద చేసే దడదడని సంగీతం మించి లోపలికి వినబడేలా తుమ్మేసింది.

రామనాథం భయం భయంగా గది తలుపు వైపు చూశాడు ఆమె తుమ్మినప్పుడల్లా. ఫర్వా లేదు తలుపు తెరుచుకోలేదు.

ఆ సమయంలో రామనాథం ఎంత అవస్థ పడు తున్నాడో నర్సమ్మకు తెలుసు.

తండ్రి ఏమనగలడు? ఆ చిన్నదాని ఆనందం గురించి ఈ దురదృష్టజీవి దగ్గర ఏమని వ్యాఖ్యా నించగలడు? భార్యదగ్గర అయితే "మన అల్లుడు మరీ కుర్రతనపు వేషాలు వేస్తున్నాడు" అనో, 'మన అమ్మాయి అయినా అతగాడ్ని కాస్త మందలించ కూడదా' అనో ఏదో ఒక వ్యాఖ్య చేసేవాడు.

ఈ సుహాకి పదహార్రూపాయలు తిన్నాడు.

మరో ఇల్లు చూడాలి అంటే కనీసం ఇరవై ఐదు రూపాయలకైనా తక్కువలో దొరకటం అసంభవం!

తన జీతం అన్నీ కలుపుకుని ఎనభై రూపాయలు.

తమపాటి శక్తి ఉన్నన్నాళ్లే ఈ రాబడి! ఆ తర్వాత? భగవంతుడి ఇచ్ఛ! ఈ నర్సమ్మని ... దిక్కులేని దాన్ని ఎవరు చూస్తారు? "మన దేశంలో ఆడ వాళ్లు ఎప్పుడూ ఎల్లప్పుడూ మొగవాళ్లమీద, వాళ్ల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి జీవిస్తుం టారు" అని ఎవరో ఆరంభించిన ఉపన్యాసం జ్ఞాపకం వచ్చింది. ఆమాట అక్షరాలా నిజం అని పించింది రామనాథానికి. ఈ గడ్డు రోజుల్లో మని షికి మనిషి బరువైపోయింది. అలికి అన్నం పెట్టటం ఊరికే ఉపకారంలా ఉంది.

గాలి విసురుకి జల్లు మీదికి కొట్టింది.

మెరుపు మెరిసినప్పుడల్లా అల్లుడు లోపల్నుంచి ఆనందాతిశయంతో, భావోద్వేగంతో ఈలలూ, పాటలూ హెచ్చు స్థాయిలో పాడుతున్నాడు.

నర్సమ్మ రామనాథం అలాగే మవునంగా గోడకి అంటిపెట్టుకుని నిలబడిఉన్నారు.

వాన ఉధృతం హెచ్చింది.

పక్క బట్టలు పూర్తిగా తడిసిపోయాయి.

పెరటివైపు తలుపు తెరుచుకున్న శబ్దం! కాస్త విరామం తర్వాత అల్లుడు సన్నగా ఈలపాట పాడుకుంటూ రెండు చేతుల్తోనూ గొడుగు జాగ్ర త్తగా పట్టుకుని బైటికి వచ్చాడు. అల్లుడు తమ వైపుగా రావటం నర్సమ్మ రామనాథం ఇద్దరూ చూశారు.

# చీకట్లో చినుకులు

ఇద్దరూ బిక్కచచ్చిపోయారు. కొయ్యబారి పోయారు.

గాలి ఒక్క విసురు విసిరింది. అల్లుడి బుజం మీద గొడుగు వెనక్కి తిరగబడిచేతిలోంచి జారి పోయింది.

అల్లుడు హడావుడిగా ఇటు తిరిగాడు. గొడుగు దొర్లుకుంటూ .... దొర్లుకుంటూ .... పంచలోకి వచ్చి మంచానికి తగిలి ఆగిపోయింది .... ఖరీదయిన ఇనపకమ్మి .... రంగు రంగుల గొడుగు ......

అల్లుడు అడుగు ముందుకువేసి హఠాత్తుగా నిలబడిపోయి భయంతో ఉక్కిరిబిక్కిరి అయి గొంతు పెగుల్చుకొని 'దొంగలు—దొంగలు' అంటూ అరిచి అక్కడే చతికిలబడిపోయాడు.

---

ఇద్దరు కాఫీహోటల్లో కలుసుకున్నారు. అందులో ఒకాయనకు చాలా ఆలస్యంగా ఇంటికి వెళ్లే అలవాటుంది.

"ఏమండీ! మీరు ఇలా ఆలస్యంగా ఇంటికి వెళ్తే మీ భార్య ఏమీ అనుకోదూ" రెండో వ్యక్తి అడిగాడు.

"ఇంకా నాకు పెళ్ళి కాలేదండి."

"ఏమిటీ! మీకు పెళ్ళి కాలేదూ? మరిలా ఇంటికి వెళ్ళకుండా ఆలస్యం దేనికీ" రెండో ఆయన బోలెడంత ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

నాగయ్య (నాయుడుపేట)

---

ఆ అరుపుల్తో ముందుగా లోపల్నుంచి వీధి తలుపు తీసి ఇందిరమ్మ భయంతో ఇవతలికి వచ్చింది చేతిలో దీపంతో.

రామనాథం అల్లుడ్ని వీపు చరిచి గుండెలు రాస్తున్నాడు.

కళ్లు మూసుకునే 'దొంగలు .... దొంగలు' అంటూ గొణుగుతున్నాడు అల్లుడు.

నర్సమ్మ కృంగిపోయి వెల్లెమ్మను చూసి నీడ లోకి తప్పుకుంది.

"ఏమిటి నాన్నా ఏమయింది" అంటూ దగ్గ రకు చేరింది ఇందిరమ్మ.

చుట్టుపక్కల ఇళ్లవాళ్లంతా లేచారు. దీపాలన్నీ వెలిగాయి. మెట్లమీంచి, కాంపౌండు గోడలమీంచి, రోడ్డుమీంచి ఆడవాళ్లు, మొగవాళ్లు, పిల్లలు గందర గోళంగా ప్రశ్నలవర్షం కురిపించారు.

సన్నగా తుప్పర ఇంకా పడుతూనే ఉంది.

ఆకాశం ఉండీ ఉండీ ఇంకా కురుస్తూనే ఉంది.

ప్రశ్నలు వర్షంలా కురుస్తూనే ఉన్నాయి.

రామనాథం ఏటుకు ఒక్క ప్రశ్నకూ జవాబు చెప్పటంలేదు.

అల్లుడికింకా బాగా స్పృహ రాలేదు. భయంతో సళ్లిచ్చిన నరాలన్నీ బలం పుంజుకోలేదు. అంతవరకు కొయ్యబారిన కాళ్ల మోటుకు కాస్త దగ్గరగా లాక్కు న్నాడు.

"హమ్మయ్య!" అనుకుంది ఇందిరమ్మ.

రామనాథం ఊపిరి తేలిగ్గా విడిచాడు.

ఎవరినోట విన్నా ....దొంగలు .... దొంగతనాలు .... దొంగతనాల్లో రకాలు. దొంగల్ని పట్టటంలో ఉపాయాలు .... పట్టిన దొంగచేత నిజం చెప్పించ టంలో నేర్పు .... గురించి కొందరు మాట్లాడు కుంటుంటే .... పేటలో దొంగతనాలు అప్పుడే ఆరంభమయినట్టు, విరివిగా సాగుతున్నట్టు ఒకళ్లని ఒకళ్లు హెచ్చరించుకుంటున్నారు మరికొంతమంది. అప్పటికప్పుడు గస్తీ సంఘాలు ఏర్పాటయిపోయాయి అధ్యక్షులూ, కార్యదర్శులూ ఏర్పాటయిపోయారు. ఏ దురాగతం అయినా ఆదిలోనే అంతం చెయ్యా లనే నిర్ణయానికి వచ్చారంతాను.

వాన తగ్గింది. ఆకాశం తెరిపిచ్చింది.

అల్లుడికి పూర్తిగా స్పృహ వచ్చిం తర్వాత లోప లికి పోయి ముసుగుదన్ని మంచానికి కర్చుకు పోయాడు సిగ్గుతో .... అవమానంతో ....

అక్కడికి చేరినవాళ్లలో కొంతమంది పాయి ధుల్లై మరీ వచ్చారు. దొడ్డంతా గాలించటం మొద లెట్టారు. ఈగదూరే సందు కనిపించినా కర్రతో పొడిచారు. గోడచాటు, మొక్కచాటు భావి చాటున, స్నానాల గదిలో గాలించేస్తున్నారు.

ఇంతలో ఒకవైపునించి 'దొరికాడు దొరికాడు' అన్న కేకలూ, కేకల్ని అనుసరించి దభీమని కర్రతో బాదిన చప్పుడూ విన్నవాళ్ళ గుండెలన్నీ గొంతులోకొచ్చి ఉక్కిరి బిక్కిరి చేశాయి. కొందరు కాళ్ళు దడదడలాడి చతికిల బడిపోయారు. ఆడాళ్ళు గప్పున ఇంట్లోకిదూరి తలుపులు బిడాయించేశారు. కుర్రకారు అరుపువినటం ఆలస్యం గోడమీంచి గంతేశారు పెరట్లోకి. బావిపక్కన మొట్ట తామర గుబురులోంచి ఏనుగులాంటి చూలిపంది గురగుర మంటూ బురదని చిందగొట్టుకుంటూ ఇవతలికి రావటంతో అక్కడున్నవాళ్ళంతా గుండెలు కుదుట పర్చుకుని వో నిముషం ఆలస్యంగా నగలబడ్డారు.

అంతకుముందే కొందరు సైకిళ్ళమీద నాలుగు రోడ్లకీ పరుగెత్తారు దొంగలకోసరం.

అలావెళ్ళినవాళ్ళంతా రోడ్డుమీద పోతూన్న వాళ్ళందర్నీ నిలేసి లక్ష ప్రశ్నలువేసిగాని వదలటంలేదు.

రామనాథం గారింట్లో దొంగలు పడ్డారని ఆపేట పేటంతా ఆ విధంగా తెలిసిపోయింది.

ఈ హడావుడిలో, గందరగోళంలో తెల్లవారి పోయింది.

తెల్లవారుతూంది అనగానే అల్లుడుమూతి బిగించుకుని ఎవరి ముఖం చూడకుండా ఎవరికీ తన ముఖం చూపించకుండా కాఫీ అయినా ముట్టకుండా చెప్పనైనా చెప్పకుండా, ఇందిరమ్మ బతిమాలు

తున్నట్టుగా, ప్రాధేయపడుతున్నట్టుగా, గుండెలు కరిగించేలా గుమ్మం పాదిగిట నిలబడి చూసే చూపుల్నిసయితం ఖాతరు చెయ్యకుండా ఆమడకో అంగిచొప్పున వేసుకుంటూ నిష్క్రమించాడు.

తెల్లవారగానే పంచలో ముఖం కడుక్కుందా మని బయటికివచ్చిన రామనాథాన్ని ఇరుగూ పొరుగూ కుర్రకారువాళ్ళంతా చుట్టేశారు. బజార్లో పాత పుస్తకాల దుకాణాల్లో రోజుకి అణాచొప్పున అద్దెకిచ్చే శిథసాహిత్యమంతా పుక్కిలించి దిశమింగి జీర్ణంచేసుకుని ప్రయోగాత్మకంగా తమ శక్తియుక్తులు ప్రదర్శించాలని కుతూహలపడే యువకులు అందులో చాలామంది వున్నారు.

అల్లాంటి వాళ్ళల్లో ఒకాయన "రాత్రి దొంగలు పడ్డారట గదండీ.. మీరు చూశారా దొంగల్ని ?' అని ఆరంభించారు.

"లేదండీ" అన్నాడు రామనాథం క్లుప్తంగా.

"మీ అల్లుడుగారు ఒక్కరే చూశారా ?"

అవునన్నట్టుగా రామనాథం తల ఊపాడు. సాధ్యమైనంతవరకూ అబద్ధం ఆడటం ఇష్టంలేక తప్పించుకుందుకు చూస్తున్న రామనాథాన్ని అక్కడ చేరినవాళ్ళు కుతూహలంకొద్దీ వేసేప్రశ్నలు ఇరకాటంలో పెడుతున్నాయి.

ఆఖరికి అంట్లుతోమే అచ్చమ్మకూడా పెరట్లో నర్సమ్మని నిలేసి ఆరాలడుగుతోంది.

అబద్ధం ఆడటమంటే కొంతమందికి ఒక్కొక్కప్పుడు వినుగ్గానూ, చికాగ్గానూ, ఇబ్బందిగానూ ఉంటుంది. రామనాథం నర్సమ్మలు అలాంటివాళ్ళ కోవకు చెందుతారు.

అవతలవాళ్ళు ఎన్ని ప్రశ్నలువేసినా వాళ్ళతో వాళ్లే జవాబుచెప్పుకోవాలితప్ప రామనాథం నర్సమ్మలు నోరు తెరవటంలేదు.

"ఇంతఅల్లరి జగం జరగటానికి కారణం ఏమిటి ?" అని ఆలోచిస్తున్నాడు రామనాథం.

ఇందిరమ్మకు అంతా అయోమయంగా వుంది. ఆమెకు కొంత అనుమానంకూడా లేకపోలేదు. ఎందుకంటే రాత్రి ఆరుబయట తండ్రి అక్కగారూ పడుతున్న అవస్థంతా ఆమె గమనిస్తూనేవుంది. బాధపడుతూనేవుంది. నిజం చెప్పాలంటే ధ్యానంతా ఆరుబయటే వుంది. ఆమె పరాగ్గా వుందని భర్త ఒకటి ఒకటి రెండుసార్లు విసుక్కున్నాడుకూడా. తలుపు తీసి వాళ్లను లోపలకు పిలుద్దామా అంటే భర్త అప్పటికప్పుడు ధామ ధూములు చేసి ఆ అర్ధరాత్రి పూట వెళ్లిపోతాడేమో నన్న భయం. బయట వానకి తడిసి అక్కయ్య తుమ్మటం ఆమె వింది. మంచాలు బరబరా నప్పుడు చేసుకుంటూ వాన లోంచి పంచలోకి లాగటమూ ఆమె విన్నది. వాన వస్తే పంచలో నిలబడే ఆస్కారం కూడా ఉండదని ఆమెకు తెలుసు. ఆ అర్ధరాత్రి వానలో, ఈదురు గాలిలో, బురదలో చలిలో తండ్రి, అక్కయ్య నిస్సహాయులై గోడకి అంటిపెట్టుకుని నిలబడి ఉంటారనీ ఆమెకు తెలుసు. తెలిసినా భర్తని ఎదిరించలేదు. భర్త ఇష్టానికి వ్యతిరేకంగా వెళ్లలేదు. భర్త భయంతో వేసిన కేకకు వీధి తలుపు తీసినప్పుడు నీడలో గోడవార నర్సమ్మ తను వూహించినట్టుగానే నిలబడి ఉండటంతో పరిస్థితి అంతా అర్థమయింది. తన భర్త చీకట్లో నిలబడ్డ వీళ్లనే చూసి దొంగలనుకోలేదు గదా ?' జరిగిందేవిటని తండ్రిని ఎలా అడుగుతుంది ? ఏమని అడిగినా "తెలిసినా మిమ్మల్ని అవస్థ పెట్టాను" అని ఒప్పుకున్నట్టవుతుంది.

అంతవరకూ ఆ యింట్లో ఉన్న ముగ్గురికీ తప్పించి అసలు విషయం ఎవరికీ తెలియలేదు.

అది కాస్తా బయటపడింది.

ఓ కుర్ర డిటెక్టివ్ పంచ అమూల నించి ఈమూల కంటా పచారుచేసి ప్రశ్నలు బాణాల్లా వదలటం మొదలెట్టాడు.

"అయితే రామనాథంగారూ రాత్రి మీరంతా ఇంట్లోనే పడుకున్నారా ?"

రామనాథం జవాబు చెప్పలేదు. ఇంతలో మరొకతను "లేదండీ ఎవరో ఇద్దరు ఈ పంచలో పడుకోవటం నేను చూశాను" అని జవాబు చెప్పారు.

---

ఓ పెద్దమనిషి హోటల్లో గొడుగు మరిచిపోయి ఆ మరునాడు వెళ్లాడు. హోటలు పెద్దమనిషిని అడిగాడు. "అయ్యా! మీ గొడుగు తెలీదు కాని ఎవరో తమ టోపీని మరిచిపోయారు. అది ఇస్తాం. కావాలా? అన్నాడు. సరే అదే ఇయ్యి" అంటూ వెళ్లిపోయాడా పెద్దమనిషి.

ఆర్. శాస్త్రి (కలకత్తా)

---

"బయట ఎవరు పడుకున్నారు ?"

"ఏమిటయ్యా నీ ప్రశ్నలు. ఎవరు పడుకుంటారు. రామనాథగారూ పెద్దమ్మాయీ పడుకుని ఉంటారు." అంత పెద్దవాడ్ని పట్టుకుని ఇంత చిన్నవాడు అలా ప్రశ్నించటం పెద్దరికాన్ని చిన్నరికం చిన్నబుచ్చుతుందనే కోపం ఆ కంఠంలో ధ్వనించింది. అయితే ప్రశ్నించినవాడికి కావల్సిన సమాధానం మటుకు లభించింది. ఇక ఆట్టే సేపు విచారణ చెయ్యటం భావ్యం కాదనుకొన్నాడు యువకుడు.

"ఈ పంచలోకి బాగా జల్లు కొట్టి ఉండాలే ?" అని ప్రశ్నించాడు.

"ఆ విషయం అడిగేదేవిటి చూస్తే తెలియటంలా. నేలంతా రొచ్చుగా కన్పిస్తుంటే" అన్నారింకొకరు.

"అటువంటప్పుడు ఈ పంచలో జల్లు కొడుతూంటే రామనాథంగారూ వారి పెద్దమ్మాయీ ఎలా నిద్రపోయారూ అని ?" అన్నాడు బాంబు పేలినట్టుగా. అతని పరిశోధన ఆఖరి ఘట్టంలో పడిందిగాని ఆపైని సాగలేదు.

అతను వేసిన ఆఖరు ప్రశ్నకు అందరి బుర్రలూ పనిచెయ్యటం మొదలెట్టాయి. అందరి ఆలోచనలూ ఆ కుర్ర డిటెక్టివ్ ఆలోచన ధోరణిని అనుసరించాయి. "వాళ్లు వానలో తడుస్తూ మెలకువగా ఉన్నప్పుడు అటువైపుగా వచ్చిన అల్లుడికి కనిపించిన దొంగలు వాళ్లకెందుకు కనిపించలేదు?' అని ఆలోచించినవాళ్లు కొంతమంది.

"ఒకచెంప వానలో తండ్రి, అప్పగారూ తడుస్తుంటే వాళ్ల సంగతే పట్టించుకోకుండా ఆ కూతురూ, అల్లుడూ ఎలా ఉండగల్గిగారూ ! వాళ్ల మనసెలా ఒప్పింది ?" అనికొందరు ఆలోచించారు. వాళ్ల ఆలోచనలు ఇంకా లోతుగా అంటే రామనాథం దారిద్ర్యం వరకూ పోకుండానే రామనాథం అందర్నీ తప్పించుకుని లోపలికి వెళ్లిపోవటంతో కుర్రాళ్లంతా రకరకాలుగా వ్యాఖ్యానించుకుంటూ అక్కడ్నించి వెళ్లిపోక తప్పలేదు.

వాళ్లంతా వెళ్లిపోయినా ఇంకా తనచుట్టూ ఉన్నట్టు తనని ప్రశ్నలతో ముంచెత్తుతున్నట్టు మెదడంతా గజిబిజి అయిపోయింది రామనాథానికి.

రాత్రంతా వానలో తడిసి జాగారంచేసిన రామనాథం కళ్లు అవమానంతో మండుతున్నాయి.

ఎంతమంది ఎన్ని రకాలుగా వ్యాఖ్యానించినా ఎంతసేపూ వాళ్ల జరిగిందాల్లో హాస్యాన్ని మాత్రమే స్వీకరించ గలిగారు గాని సత్యానికి సన్నిహితంగా, నర్సమ్మ ఆలోచించినట్టు, రామనాథం ఆలోచించినట్టు, ఇందిరమ్మ ఆలోచించినట్టు "ఇంత అల్లరికీ ఆగానికీ కారణం ఏమిటి ?" అని ఎంతమంది ఆలోచించగలరు ?

కొందరనుకున్నట్టు అల్లుడిదే తప్పనిగాని ఇందిరమ్మది తప్పనిగాని రామనాథం ఒక్కనాటికీ అనుకోడు. 'ఏదో కుర్రతనపు చేష్టలు' అని అనుకుంటాడేమో. అదైనా మనసా తప్పించి వాచా పొరబాటునైనా అనుకోడు. అతడిది తండ్రి మనస్సు.

కొందరనుకున్నట్టు ఇందిరమ్మదే తప్పయితే, అల్లుడిదే తప్పయితే 'ఇంతకంటే పెద్ద ఇల్లు తీసుకోకూడదూ' అని వ్యాఖ్యానించబడ్డ రామనాథానిదే తప్పయితే .... నీళ్లు పోసుకునే నెపంతో తడికె గట్టిగా బిగించి చన్నీళ్లను ముఖంమీద గుమ్మరించుకుని చన్నీళ్లతో కన్నీళ్లను చేర్చి ఇందిరమ్మ, పొయ్యిముందు పొగలో సెగలో కూర్చుని చూసేవారికి కళ్లు మంటయింది, కడుపు మంటయిందీ తెలియని విధంగా నర్సమ్మ, చెమర్చిన కళ్లను తువ్వాలుతో ముఖం తుడుచుకుంటున్నట్టుగా మాటిమాటికీ అద్దుకొని రామనాథం గుండెలు చెరువు చేసుకోవాల్సిన అవసరం ఏమిటి ?

ఆ తర్వాత రామనాథం అంతకంటే ఎక్కువ అద్దెతో, ఎక్కువ గదులతో ఉన్న ఇంట్లోకి మారినా, సిండా మునిగినవారికి చలేవిటన్నట్టుగా రెట్టింపు భారానికి మెడ వంచినా, ఇందిరమ్మ ఉన్న ఆ నెలరోజుల్లోనూ అల్లుడు మటుకు మళ్లీ గుమ్మం తొక్కలేదు. 






వుడ్‌వార్డ్స
'గ్రైప్ వాటర్'
తెలివైన తల్లులు
50 ఏళ్లనుంచి వాడుచున్నారు

అధికారయుత ఏజెంటు: కోమల్ మేన్యుఫేక్చరింగ్ కెమిస్ట్స్ లిమిటెడ్ బొంబాయి; ఎమ్. బి. సహాని అండ్ కొ., (కలకత్తా) ప్రైవేట్ లిమిటెడ్ కలకత్తా; భ. టి. క్రిష్ణమాచారి అండ్ కొ., మద్రాస్; ఎమ్. బి. సహాని అండ్ కొ; (ఢిల్లీ) ప్రైవేట్ లిమిటెడ్, ఢిల్లీ.

Aiyars OP. 468 TEL.


## బంగారు పంజరం

23 వ పేజీ తరువాయి

అప్పుడప్పుడు నీ ప్రేమను గుర్తించి నిన్ను ప్రేమించే వారున్నారని గుర్తు చేయటంతో--- నీవు పొందే ఆనందం, సంతృప్తి, అనుభూతి—వాటికవే సాటి కాదా ? నీవుకూడ ప్రేమింపబడుతున్నావన్న ముక్క చాలు—ఆ ఒక్క విషయం చాలు. నిన్ని లోకంతో సజీవంగా, బాధ్యతాహితంగా జీవింపచేసేందుకు. ఆ నిరీక్ష నీకు సర్వస్వం కదా ? .... చివరికి మీ పనివాళ్లు సైతం నీకు సంతోషం కల్గించేందుకు తాపత్రయపడ్తుంటారు. వాళ్లు నిన్ను సాధిస్తూ నీ జీవితం మరి దుఃఖభాజనంగా చేయ లేకపోవటమే భగవంతుడు నీకు చేసిన మేలు .... దీన్ని గూర్చి బాగా ఆలోచించుకో .... ఇది గుర్తిస్తేనే నీ దైనిక జీవితాన్ని ఏ ఒడుదుడుకులు లేకుండా నడపగలవు ......"

నిర్మల దీన్నంతా నిరాకరించింది. మీరు చెప్పిందంతా వ్యర్థం. మీదంతా వ్యర్థ ప్రయత్నమే అన్నట్లు చూచింది. అప్రయత్నంగా కళ్లు నీళ్లతో నిండాయి. ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుని బావురుమన్నది. శరీరమంతా ఒణికిపోతోంది. డాక్టర్ ఆమె వీపుపై ఆప్యాయంగా తడుతోంది. తిరస్కృతయై, తడబడుతున్న మాటలతో అంది.

"నాలో మండే అగ్నిజ్వాల మీ కప గొపానం కాదు డాక్టర్. అగ్నిపర్వతమే నాలో వెలిసింది. అది శాంతి వహించినా అపాయకరమే కదా? ఆ వేడిమికి శిలాద్రవం ఉబికి బైటికి వస్తుంది. అంతర్భాగంలో ఎంత అల్లకల్లోలం ఉంటే ఈశిలా ద్రవం బైటికొస్తుంది ? నాలో ఎంత విచారం నిబిడీకృతమై యుంటే ఈవిధంగా ప్రవర్తించి బాహ్యంగా బాధపడ్తానో గ్రహించలేరా మీరు ? బాధితులు తమ బాధలను గూర్చి చింతిస్తారు గాని లభించిన, లబింపబోయే సుఖం గూర్చి ఆలోచించరు అది మానవ నైజం. ఇక నేను నాకు భగవంతు డనుగ్రహించే మంచిని గూర్చి చింతించనని కదా మీ రనేది. అది నాకు గ్రాహ్యం కావటం లేదని కదా మీ అభిప్రాయం. నిరాశాపూరితమై ప్రోడ్డైపోయిన జీవితంలో ఆ మంచి ఏపాటిది ? .. మీ కర్థంకాదు డాక్టర్ .... నిండా మునిగితేనే చలి. ఒడ్డున నుంచొని ఎంతైనా మాట్లాడుతారు .... మీరు. డాక్టర్ .... బాధ లనుభవించేవారు మీకడ కొస్తారు..... వారికి పరిచర్య చేసి పంపటమే మీపంతు గానీ, వారి శారీరక మానసిక బాధలలో పాలు పంచుకోరుగా—సానుభూతి చూపి ఓదార్చటం వరకే చేయగలరు. అనుభవిస్తేగాని తెలియదు డాక్టర్ .... చెప్పటం ...."

"నిర్మలా" అందామె గబుక్కున. నిర్మల డాక్టర్‌వైపు నిశ్చేష్టితయై చూస్తోంది.

డాక్టర్ జలజల కన్నీరు కారుస్తోంది. ప్రసన్నమైన ముఖంలో ఆ కన్నీరు కాలువలు గట్టింది. ఆమె దృష్టి నీటివైపుంది గాని, ఆమె దానిని చూడటంలేదు. శూన్యంలోకి చూస్తోంది.

డాక్టర్ శాంత నామె ఆవిధంగా ఎప్పుడు చూడ లేదు. ఎప్పుడూ మందస్మిత వదనంతో కళకళ్లాడుతూ, తన మృదువైన మాటలచేత సగం

బాధను పోగొట్టే శక్తిగల ఆమె ముఖం ఇంత కళా విహీనమయ్యే వేళకి నిర్మల కవిత భయం వేసింది. ఆమె ముఖంలో తాండవమాడుతున్న బాధ నుదుటి మీది స్వేదబిందువుల్లో ప్రతిబింబిస్తోంది.

నిర్మల ఆమె ప్రక్కలో కూచుంటూ అంది: "మీరు పెద్దలు. అనరాని మాటలంటే క్షమించాలి. తెలియక ఉద్రేకంలో అనేశాను .... మీరు మన్ని స్తేనే నాకు శాంతి ...."

నిర్లిప్తంగా నవ్వింది. "నాకెంతో కష్టంగా ఉంది. అలా చెట్టు నీడలో పడుకుంటాను. రావమ్మ నిర్మలా!...నిన్ను మన్నించేందుకు నీవేమీ అనలేదే."

ఆమె ననుసరించింది. చెట్టు నీడలో దుప్పటి పరచి తలగడ వేసుకుని కూచుంది. 'కోకోకోలా' సీసా తెరచి గడగడ త్రాగింది. నిర్మలకింకో సీసా ఇచ్చింది. నిర్మల కూడ త్రాగాక, ఆమె పడుకుంది. ఆకుల సందుల్లోంచి నీలాకాశం అగుపిస్తూంటే దాన్ని చూస్తోంది. ఆమె ముఖంలో హాస్య రేఖ కోసం నిర్మల ఆశగా ఎదురు చూస్తోంది.

ఆమె చెట్టుకు చేరగిలబడి అంది: "ఒక కథ చెప్పనా ?"

"అంత అవసరమా డాక్టర్ ...." అంది నిర్మల ఆతృతతో.

"ఔను. అవసరమే. ఇంతవరకెవ్వరికీ చెప్ప లేదు. చెప్పను కూడ .... చెప్పే పరిస్థితి సంభ వించలేదు .... ఇప్పుడా సమయం వచ్చింది .... ఈ కథ విన్నాక మర్చిపో ...."

"చెప్పండి .... వింటాను. ఏం కథ ?"

"నా కథ."

"మీదా ?"

"ఔను."

నిర్మల ఆమెకు దగ్గరగా జరిగింది. 'చెప్పండి డాక్టర్' అన్నట్టుగా తయారుగా కూచుంది. ఆమె కుతూహలాన్ని గ్రహించి డాక్టర్ కాంత తన చరిత్రను ప్రప్రథమంగా నిర్మలకు చెబుతోంది.

"నేను పట్నంలో ఎం. బి. చదివేటప్పుడు పెళ్ళయింది. పరాయి సంబంధం అయినా మా నాన్నగారికీ ఆ కుటుంబంతో సన్నిహితత్వం ఉండే దిట. వారు రేడియో—ఇంజనీరు. ఆ కాలంలో వారిని విదేశాలకు పంపి చదివించారు. ఇలాంటి ఇంజనీర్లు బహు కొద్దిమంది మాత్రమే ఉండేవారు.

"నేను చివరి సంవత్సరంలో ఉండగా పెళ్ళయింది. తర్వాత సంవత్సరానికి మద్రాస్‌లోనే కాపురం ప్రారంభించాము.

"జీవితంలో ఆ క్షణాలు తిరిగి రావని తెలిస్తే ఆ క్షణాలను భద్రంగా దాచుకునేదాన్ని. ఎప్పుడో చేయి జారిపోయిన ఆ మధుర క్షణాలను గురించి ఇన్నాళ్ళ తరువాత చెప్పటంలో కూడ ఆ బాధను అనుభవించేసుకోవటమే.

"మా వైవాహిక జీవితంలో జ్ఞాపకం ఉంచుకో వలసిన దినాలు మూడు వందల అరవై మాత్రమే.

రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. నా భర్త వెళ్ళక తప్పిందికాదు. అతన్ని వెళ్ళమని ఎవ్వరూ నిర్బంధించలేదు. కాని వారికి వెళ్ళాలని ఎంతో కుతూహలంగా ఉండేది.

"దేశసేవ చేసి ధన్యులైపోవాలని అలా వెళ్ళా లనుకుంటాము. కాదు, నిర్మల! వారి ఉద్దేశమే వేరు; దేశసేవ చేయాలన్న కోర్కెతో ఉడు కెత్తిన రక్తపు ప్రభావానికన్నా, ధనార్జన ఆ 'అడ్వెంచర్' వారిని రణరంగానికి పరుగులెత్తేలా చేసింది.

"నన్ను విడిచి వెళ్ళటం ఎంతో కష్టమైన పని .... తప్పిందికాదు. అంతమాత్రాన నేనంటే ప్రేమాభిమానాలు లేవనుకోవటం శుద్ధ పొరబాటు. ఎవరి ప్రేమ వారికి జ్ఞాతమైందికదా .... స్త్రీ భర్తనుంచి కోరుకునే సుఖాలు, ప్రేమ నాకు లభిం చాయి. నా అంతరాత్మనుంచి వచ్చిన స్వచ్ఛమైన ప్రేమను వారికి సమర్పించుకున్నాను. మా అను కూల దాంపత్యం చూచి మావాళ్ళంతా ఎంతో ముచ్చటపడేవారు..

"అప్పుడు నేను గర్భవతిని .... వెళ్ళవద్దని ఎంత గానో బతిమాలినా వారి మనస్సు మారలేదు. ఒక్కొక్క వ్యక్తిత్వం అన్ని పరిసరాలల్లో రాణించలేదు. వారికి తగిన సమయం, పరిస్థితులు కలిసివచ్చా యంటే వారి నిజమైన ఛాయలు బైటపడ్తాయి. అలాంటి సన్నివేశాలు వారికెంత విలువైనవిగా అగు పిస్తాయో మనకంత దుష్టమైనవిగా గోచ రిస్తాయి. అదంతా సింహావలోకనం చేస్తుంటే ఒక పాడు కలలా అనిపిస్తుంది.

"నా కథంతా చెప్పి నీ మనస్సును వికలం చేయను. నా సౌఖ్యం, నా ప్రేమగీతం, నా జీవితంలోని వెలుగు అనంతమైన ఆకాశాన్నంటుకున్నాయి. నా స్మృతి పథంలో మెదిలే ఆ సంవత్సరమే నన్నిప్పటి వరకు జీవింపజేస్తోంది."

"వారు వెళ్ళిన మూడు నెలలకు కవలపిల్లలు పుట్టారు; ఆడపిల్లా, మగపిల్లడూను. నా రిద్దరి పుట్టుకతో నా ఒంటరితనం పోయింది. నా జీవితంలో వెలుగు నింపి సంతోషతరంగాలపై తేలిపో చేశారు. తుఫాను నిమ్మళించి రెండు ఇంద్ర ధనుస్సులు స్పష్టమైనై.

"పిల్లలు పెరుగుతున్నారు. ప్రతి కదలికలో ఏదో నూతనత్వం అగుపించి సంతోషంలో ముంచెత్తినలా గయ్యేది. వారి తప్పటడుగుల్లో, వచ్చీ రాని నడకలో అర్థంలేని మాటల్లో, చివరికి ఏడ్పులో కూడ కొన్ని వేల కావ్యాలు పఠించగల్గేదాన్ని.

"మూడు సంవత్సరాలు గిర్రున తిరిగాయి. వారు ఒక్కసారి మాత్రం రాగలిగారు. నా జీవితంలో మరువురాని మధురానుభవాలు మళ్ళీ పుష్పిం చాయి. గులాబి పూలలా అంతా కొన్ని దినాలు మాత్రమే !

"నాకు సాయంగా మా అత్త మామలు, వారి పదహారేండ్ల కూతురు నాదగ్గరే ఉండేవారు. మామ గారు ట్రెజరీలో అకౌంటెంట్. ఉన్నట్లుండి పక్షవాతం వచ్చి వారి కాలిని చేతిని చంపిపోయింది. అందుకే నా దగ్గర కొచ్చారు. అప్పుడు జనరల్ హాస్పిటల్‌లోనే పనిచేస్తుండేదాన్ని."

ఒకరోజు .... ఆనలారోజు ఎందుకు సృష్టింప బడింది ? .... సాయంత్రం ఇంటికొచ్చాను. పాపకు జ్వరం అని తెలిసింది. రెండు రోజులైంది. తగ్గ లేదు. నా బిడ్డకు మందిచ్చే ధైర్యం లేక, హాస్పి టల్‌కు తీసుకెళ్ళాము. బిడ్డకు టైఫాయిడ్ అని తేలింది. మంచం దగ్గరే ఉండి ఉపచారం చేస్తూ కంటికి రెప్పలా నా బిడ్డను కాపాడుతున్నాను. ఇంతలో చిన్నవాడికి కూడ విషజ్వరం పట్టుకుంది. ఒకే గదిలో ఎముకల గూళ్ళలా పడుకున్న బిడ్డల్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోయేది. కన్నీరు కార్చేందుకే శక్తి లేకపోయింది. భగవంతునిపై భారం వేశాను. తండ్రీ .... నీ చిత్తం .... కాని మానవులం .... అడుగుతున్నాను. నా బిడ్డలకే అపాయం రానివ్వకు .... అని అడిగేదాన్ని .... కాని అది భగవంతుని చిత్తంకాదు. ఇద్దర్నీ మూడు రోజుల వ్యవధిలో తీసుకున్నాడమ్మా .... నిర్మలా ....

"నా జీవితం కూడ అంతమైతే బాగుండు నని పించింది. తల పగులగొట్టుకుని చచ్చిపోదామనిపిం చింది కాని .... ఇంతవరకు ఈవిధంగా ఉండ




ఆధునిక హీరోయిన్‌తో దర్శకుని పాట్లు

National's (REGD.)
'Kashmir'
SNOW &
TALCUM POWDER
your guide to beauty















అమ్మ నా
కల్జానా
స్వీకరిస్తోంటే
నేను
ఆశ్చర్యపడ్డాను!




కల్జానా-డి
విటమిన్‌తో ఉత్తేజకరమైన కాల్షియమ్
గర్భిణీ స్త్రీలకు, శిశువులను పెంచుతున్న తల్లులకు,
ఎదుగుచున్న బాలలకు

GRS.55 TEL

# బంగారు పంజరం

గల్గాను .... అప్పుడు నీలాగే నాకూ చాల కోపం వచ్చింది .... ఒక్కరినైనా ఉంచకూడదూ ? .... ఏమో .... అలా చేయటంలో భగవంతుని ఉద్దేశ్యం ఏమిటో .... అల్పులం—మనకు గ్రాహ్యం కాదు.

"మూడు మాసాలు—మూడు యుగాలైనై. మరపురాని ఆవేదనతో ఆసుపత్రి కెళ్తూ ఇంటి కొస్తుండేదాన్ని. ఈ సమయంలో 'భగవంతుడు నాకో బిడ్డను ప్రసాదించాడు.

"ఒక పెళ్లికానమ్మాయి బిడ్డను ప్రసవించి, చని పోయింది. ఆబిడ్డ అనాథ. ఎవ్వరికి అక్కర్లేదు. దిక్కుమాలిన సంతానం. వాళ్ల వాళ్లకిదేం పట్టలేదు. ఆ బిడ్డ విషయమై ఆలోచిస్తూ ఇంటి కొచ్చాను."

"చీకటి పడ్తోంది. గదిలో పడుకుని పేపర్ తిరగేస్తున్నాను. మా అత్తమ్మొచ్చి ఎవరో పోలీసు ఉద్యోగస్తులొచ్చారని చెప్పారు. హాల్లో కెళ్లాను. వరండా కవతలే నుంచున్న పోలీసులను చూచాను. డాక్టర్ల దగ్గరికి పోలీసులు రావటం సాధారణమైన విషయమే. నాకేం భయం కల్గలేదు. ఏదో ఖూనీ విషయం, లేక చనిపోయిన స్త్రీ సాధారణమైన చావు చచ్చిందా ? లేక ఆత్మహత్యా ? ఇలాంటి ప్రశ్నలతో వస్తుంటారు.

"లోపలి కాహ్వానించి కూర్చోమన్నాను. అందులో సబ్‌ఇన్‌స్పెక్టర్ నాకు తెలుసు. ఇంకొకతన్ని సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్‌గా అతనే పరిచయం చేశాడు.

"'ఎవరి విషయం కావాలి ?' అన్నాను మామూలు ధోరణితో.

"ఆ సి. ఐ. డి. కాస్త తటపటాయించాడు. కుర్చీలో సర్దుకున్నాడు. నా కిదంతా చూస్తుంటే చికాకుగా ఉంది. త్వరగా కానియ్యడేం ? అనుకుంటున్నా. ఇంతలో అన్నాడు 'ఈవిధంగా ప్రశ్నించుతున్నందు కెంతో బాధపడుతున్నాను. మిమ్మల్ని అడగాలి—అది ఉద్యోగ ధర్మం—అన్యథా భావించకండి' అన్నాడు."

"ఫరవాలేదు .... " అంటూఉండగానే అతని ప్రశ్న బాకులా నా హృదయంలోకి దూసుకుపోయింది.

'మీ భర్త ఇప్పు డెక్కడున్నారు ?'

నిర్ఘాంతపోయాను. నోట మాట రాలేదు. కాసేపటికి తమాయించుకుని అన్నాను 'అరకాన్ ఫ్రంట్‌లో ఉన్నారు. ఎందుకని ?' వారి జవాబు వినటానికే భయం వేసింది.

'అక్కడే ఉన్నట్లు మీకెలా తెలుసు.'

పిచ్చి ప్రశ్న ..... విసుగేసింది . . కానీ .... మరో క్షణంలో భయంతో వణికిపోయాను.

'ఉత్తరం వచ్చి రెండు వారాలైంది. ఈ రెండు మూడు రోజుల్లో వారి దగ్గరనుంచి రావాలి ....'

'ఆఖరి ఉత్తరం మీకెప్పు డందింది ?'

చెప్పాను.

'మీకు బాగా జ్ఞాపకం ఉందా ? మరొక ఉత్తరం రాలేదుకదా ?

నాకు నిజంగానే కోపం వచ్చింది.

'నాకు బాగా జ్ఞాపకం . అదే ఆఖరిది .... రేపో, ఎల్లుండో వస్తుంది మరొకటి .... ఎందుకని ?' అన్నాను ఆవేశంతో.

'ఆ ఉత్తరం చూపిస్తారా? వారి అడ్రస్—అన్నీ చెక్ చేయాలి ?'

నా కెందుకో చాల భయం వేసిం. దడదడ లాడుతున్న గుండెను గట్టిగా పట్టుకుని అడిగాను: 'ఎందుకు ? ఇంతవరకు చెప్పారుకారు.'

"అతను జాగు చేస్తున్నాడు. నావైపు చూడకుండా చెప్పాడు. 'మీ భర్తగారు కనబడటంలేదు....'

"ఏది జరుగకూడదనుకున్నానో అదే జరిగింది. అంతకంటే భయంకరమైన సంగతి మరొకటుందనుకుంటాను. అచేతనురాలనై నోటమాట రాక విస్తుపోయి చూస్తున్నాను. అతను చెబుతున్నాడు:

'వైర్‌లెస్ సామానేదో చెడిపోతే దాన్ని బాగుచేసి యుద్ధవార్తల నందుకుని రిపోర్టు సిద్ధంగా ఉంచమని యుద్ధంలోకి వెళ్లిపోయారట. అక్కడికి శత్రువులొచ్చే మార్గం కల్ల. అంత నిగూఢమైన స్థలంలో ఉంచి వెళ్లారట. మనవారు వెనుకకు మళ్లారుగా ? వచ్చేవారక్కడికి వెళ్లి చూస్తే అక్కడ ఎవరూ లేరట. సామాను మాత్రం ఉన్నదున్నట్లే ఉందిట. అక్కడ కాపలాగా ఉంచిన ఇద్దరు సోల్జర్లు మాత్రం లోపల మూల్గుతున్నారట. మీవారి జాడ లేదు.... వారిమీద అనుమానంతో దేశమంతా గాలిస్తున్నారు....'

'ఎందుకు. బ్రతికుంటే వారే రిపోర్ట్ ఇచ్చేవారుగా ?'

'మీ కర్థం కాలేదు డాక్టర్. వారు గూఢచారిగా పనిచేస్తున్నారు ?'

నా మతిపోయింది. ఆలోచనలకే తావులేదు. నిజాన్ని నమ్మలేకుండా ఉన్నాను. చివరికి అడిగేశాను: "అంటే శత్రువులకు మన విషయాల చేరవేస్తున్నారా ?" "స్పై" "గూఢచారి" మాటలే భయంకరంగా ఉన్నాయి. వాటిని అనలేకపోయాను. అబ్బ—ఎంత కటువైన మాట ......

"ఔను. తీరా అతను ద్రోహి, అవతలి వారికి మన విషయాలన్నీ తెలియపర్చుతున్నాడని తెలిసికోగానే, పట్టుకోవాలని ప్రయత్నం చేసేసరికి అతని కంతకుముందే తెలిసిపోయి పలాయనం చిత్తగించాడు. యుద్ధ రహస్యాలన్నీ తెలుసు. అతనే ఈపని చేస్తున్నాడని ఋజువైంది కూడ. అందుకే అతన్ని గాలించి పట్టుకోవాలని ఉత్తరువు జారీ చేశారు .... మమ్మల్ని క్షమించాలి .... వారి ఉనికి తెలిస్తే మీరు తప్పక చెప్పాలి .... అలా చేస్తే దేశాని కెంతో మేలు చేసినవారవుతారు ...."

"అతను నాకు బోధిస్తున్నాడు కానీ అవేవీ నేను వినటంలేదు. నా హృదయం నమ్మేందుకే నిరాకరిస్తోంది. అసలు యుద్ధంలోనే గాయపడ్డారేమో? దిక్కులేక పడిఉన్నారేమో ? ఇదంతా పొరపాటేమో —ఒకరిని శిక్షించబోయి మరొకర్ని శిక్షిస్తున్నారేమో ! అసలు శత్రువులే వారిని .... ఏమో .... ఏది నిజం ....

"అంత మంచివారు. ప్రభుసేవా పరాయణుడు .... జ్ఞాని .... మేధావి .... సద్గుణ సంపన్నుడు .... ఎన్నో విశిష్టమైన గుణాలను పొందుపర్చుకున్నవారా ద్రోహి ! నమ్మలేను .... ఇప్పటికీ నమ్మలేను. కాని అది సత్యం .... నమ్మాలి. అంతే !

"బిడ్డల మరణంతో కృంగి కృశించి భర్త తిరిగి వస్తారన్న నిరీక్షణతో నాలోని జ్యోతి ఆరిపోకుండా వెలిగిస్తూ వస్తున్న నాకు, మూడు నెలల లోనే ఇంతటి దుఃఖం ఎందుకు కల్గాలి ? పోనీ వారిలాంటి పని చేయకుండా మరోవిధంగా పోయివుండేదేమో! లేక కనీసం ఆ దుఃఖంనుంచి తేరుకున్న తరువాత ఇది సంభవించిఉంటే .... ? పోనీ ఒక బిడ్డయినా దక్కిఉండకూడదూ ? అలా కాకపోతే అసలు త నిలాంటి పనికి పూనుకోకుండా ఉండిఉంటే .... ? కష్టంలో, దుఃఖంలో ఉన్నవారికే ఇంకో ఇంకా ఎందుకు కల్గాలి ? .... వీటిని జవాబు చెప్పుకోవాలి .... ఒక్కటే జవాబు .... ఏమో .... అవన్నీ మన ఊహ కందనివి, మన జ్ఞానానికి మించిన విషయాలు.

"ఏమో .... తెలీదు .....

"ఇద్దరన్నయ్యలు అమ్మ, నాన్న ఉన్నారు నాకు. అంటే ఉండేవారన్నమాట. అన్నయ్య యుద్ధంలో చనిపోయాడు. ఆ వార్త విన్న నాన్న గుండె ఆగిపోయి మరణించారు. అమ్మ, తమ్ముడు అప్పట్లో విశాఖపట్నంలో ఉండేవారు. తమ్ముడు పెద్ద రౌడీగా తయారయ్యాడు. అంతా మీ చెల్లి, బావలా అన్నమాట. అమ్మ ఏడవని క్షణం లేదు. తమ్ముడి మనసు మార్చాలని శతవిధాల ప్రయత్నించింది. జబ్బుపడింది. తన తల్లికి జబ్బుగా ఉందన్న జ్ఞానం నశించింది. అవినీతి కార్యాలతో, అహంకారంతో అంధుడై రెండు, మూడు రోజులు ఇంటికే వెళ్లలేదు. కనీసం నాకు వ్రాయలేదు, తెల్పలేదు. తర్వాత వెళ్లి చూస్తే తల్లి చావు బ్రతుకుల్లో ఉంది. నౌకరు డాక్టరును తెచ్చాడు. కాని మనోవ్యాధికి మందు లేదాయె. కొడుకుమీద బెంగతో నిద్రలోనే పోయింది. తమ్ముడు అంతా అమ్ముకుని చెడిపోయి ఒక్క దమ్మిడికూడ లేకుండా వచ్చాడు. కనువిప్పు ఆలస్యమైంది. అంతా పోయింది. ఇప్పుడు విశాఖపట్నంలోనే నౌకాశ్రయంలో చిన్న పని. చాలీ చాలని జీతం— కష్టాలు ....

"నిర్మలా! ఈ మూడు చావులుఒక్కసంవత్సరంలోనే. నా పాపలు పోయిన మూడునెలలకు భర్తనుగూర్చిన దుర్వార్త. ఆ తర్వాత నాల్గునెలలకు అన్నయ్య మరణవార్త—వెంటనే నాన్న—చావు, యుద్ధైన కొన్నిమాసాలకే అమ్మ—చావు, తమ్ముడు అధోగతి పాలైపోవటం.

"ఇంత వేగంగా యెందుకు జరిగాయి? ఈ పరిస్థితులుఒకదానివెంటఒకటితరుముకువచ్చినట్లెందుకు రావాలి ? నాకు హృదయంలేదూ ? బాధపడటం నాకు చేతకాదూ ? నా హృదయం పాషాణంకాదే ? ఇంతగా విధి నన్ను శిక్షించటానికి నేను చేసిన పాపం యేమిటి? నా సాహసాన్ని, ఓర్పును పరీక్షిస్తున్నాడా? ఎందుకని ? ఏ ఉద్దేశ్యంతో ? కానీ దానికికూడ కొంత పరిమితి ఉన్నదికదా? బెలూన్‌లో గాలి కొడతాము; ఇంకా కొడతాము. పట్టగలిగేంతకంటే మరెక్కువ కొడితే 'టప్'న పగులుతుంది. కానీ నా గుండె పగల్లేదు. ఎలా ఓర్చుకున్నానో .... నాకే తెలీదు ....

"ఇంతటితో ఆగలేదు. అత్త మామల సాధింపు. డాక్టరును కదా ! పురుషులతో మాట్లాడితే తప్పు, రాత్రిళ్ళు డ్యూటీకి వెళ్ళకూడదు, పొంయుత్రాలు


ఉచితం

వివిధ ఆకర్షణీయమైన రంగులలో వియమిత పరిమాణములలో శాలువలు కొనండి. ధర. రు. 7/—పోస్టేజి రు. 1/50. 2 శాలువలు రు. 13/—పోస్టేజి రు. 2/— 3 శాలువలు రు 18/- పోస్టేజి ఉచితం. ప్రతి శాలువతో ఒక కొత్త సంవత్సరం డైరి ఉచితం. మీఅడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

HIMALAYAN FABRICS
(APW) Faridabad (Near Delhi)

మంచి పుస్తకాలు

జీవిత రహస్యాలు.- మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు :-___ రూ 3-50
యువతి :- స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు ___ రూ 3-50
సంతానము :- గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు. ___ రూ 3 50
అమ్మక రహస్యాలు.- వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00
ఉద్యోగదర్శిని:- మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు.రూ5-00
ఆత్మజ్ఞానము:- శరీరానంతరం ఆత్మను-గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు. రూ 2-50
పోస్టు ఖర్చులుచితం. క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును

దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర.

మంచి రహస్యం

గ్లోరియా ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్ని వెంటనే తెచ్చును, ముఖంలోముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్ని తెచ్చును ఎండకువచ్చే నలుపును. మొటిమలను నమ్మకంగా పోగొట్టును. వెల రూ. 1-75. అన్ని షాపుల్లో దొరుకును

JANITA PRODUCTS, ELURU. A P.

ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

అభివృద్ధి చేయబడిన క్రొత్త కూర్పు

ఇంటిలోనే ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ పూర్తి కోర్సు రేడియో రిపేరింగ్ రేడియోమెకానిసం, ఇండ్ల వైరింగ్ నేర్చుకోండి. ఇంటిలోనే రు. 50లకు ట్రాన్సిస్టర్ రేడియో తయారుచేయుటం నేర్చుకోండి. ఎలెక్ట్రిక్ & రేడియోపనులకు ఉత్తమగైడ్. (900 చిత్రపటములు) ధర రు. 10. వి.పి.పి. చార్జి రు. 2.

14 భాషల మాస్టర్ !

ఉపాధ్యాయుల సహాయము లేక ఇంటిలోనే చైనీస్, జపానీస్, అరబం, ఫ్రెంచి, రష్యన్ మొ॥ భాషలను నేర్చుకోండి. 14 భాషలు ధర రు. 6/-డ్రాయింగ్, పెయింటింగ్ రు 5-50. టైలరింగ్ & కట్టింగ్ రు.5-50 సెక్స్ అట్లాస్: 325 చిత్రపటములు గల అమెరికన్ ప్రచురణ. ధర : రు. 6/- V.P.P. చార్జి రు. 2/- అదనం.

Tagore Vigyan Mandir (A.10)
Halka No. 13, ALIGARH

అత్యంగా వస్తే అనిష్టమైన మాటలతో బాధించే వారు. వ్యాధిగ్రస్తుల యిండ్లకు వెళ్ళకూడదు. ఇలాంటి నిర్బంధంఉంటే డాక్టరుఉద్యోగం చేసి నట్లే ....

"నన్ను వదినెగా కాక, ఒక గొప్ప వ్యక్తిగా భావించి గౌరవించి నా జీవితంలో ఆనందాన్ని అంకు రింపజేసిన వ్యక్తి నా ఆడబిడ్డ. ఆమెకూడ నిర్మలే. అంధకారంలో కాంతికిరణంలా నా కామె ప్రసాదింప బడింది. నన్ను ప్రేమించి తన సర్వస్వం అర్పింప గలవా రెవరైనా వున్నారా ? అంటే ఆమెనే చెప్పు కోవాలి. మా యిద్దరి ప్రేమబంధం గొప్పది. నేను జీవించగల్గా నంటే బహుశః ఆమె మంచితనం, నాపైగల ప్రేమే కారణమై యుండవచ్చు. ఆమె కోసమే జీవిస్తున్నానేమో కూడ.

"చాలా తెలివిగలది. ఎం. ఏ చదివించాను. ఒక డాక్టరుకిచ్చి వివాహంచేశాను. కాని ఆమెకు దాంపత్య సుఖం లేకపోయింది. అతని ప్రవర్తన యెలా ఉండేదో ఆమె నా కెప్పుడూ చెప్పలేదు. భర్తను పిచ్చిగా ప్రేమించేది. పవిత్రులు అపవిత్రులను చూడ లేరు. మంచివారికి చెడు చెవికి అంటదు. ఆమె విష యంలో అంతే జరిగింది.

"మూడు సంవత్సరాలు గడిచాయో లేదో టి. బి పట్టుకుంది. మదనపల్లికి తీసుకెళ్ళాము. అంత ముదరలేదు; భయపడవలసినదేమీ లేదంటూ ట్రీట్‌మెంట్ ప్రారంభించారు. తగ్గుముఖం పట్టింది. జాగ్రత్తగా చూడమని హెచ్చరించి పంపేశారు. ఇంటికి తీసు కెళ్ళేప్పుడెంత సంబరపడిందో పాపం—తిరిగి భర్తదగ్గర ఉండబోతున్నానుగదా అని ఆనందం పొందింది.

"ఇలా జరిగిన కొన్నాళ్ళకు మద్రాస్‌విడిచిపెట్టి యిక్కడికి వచ్చేశాము. అప్పుడొక డాక్టర్‌కు లేడీ డాక్టర్ ఎసిస్టెంట్ కావలసివచ్చింది. జీతంకూడ యెక్కువే. బాగుసేయక వచ్చేశాను. నిర్మలను వదలి రావటం అంత తేలికైన పనికాదు. కాని నా యింట్లో వ్యక్తిత్వమే లేకపోయింది. నా సంపాద నకే ప్రాముఖ్యం ఇచ్చి నన్నొక పురుషునిక్రింద జమకట్టి చూచేవారు. ప్రతిదానికీ అనుమానమే. అదే పెనుభూతమై వారిని వెంటాడింది. డాక్టర్‌ను కోడలుగా గలవారి, అందులోను కొడుకు లేనప్పుడు దృక్పథం విశాలంగా ఉండాలి. లేకపోతే వారి సంకుచిత తత్త్వం, నా ప్రవర్తన పంగీకరింపదు. ఒంటరి దాన్ని; నా చర్యలను యెప్పుడూ శంకించేవారు. అది వారి తప్పని అనను. లోకంపోకడ ఒంటరిదాని విష యంలో అలాగే వుంటుంది; వారిని నిందించలేను. వారి కితరమైన జీవనాధారంలేదు. నా విషయంలో వారు వ్యాయంగా జాగరూకతతో ప్రవర్తిస్తు న్నట్లు భావించేవారు. చెడుత్రోవ త్రొక్కకుండా హెచ్చరిస్తున్నట్లు అనుకునేవారు.

"కాని యిటువంటి నీచమైన కార్యాలకుగాని, ఊహలకుగాని చోటివ్వని నా హృదయం వారి మాటలకెంతో గాయపడింది. విసుగు, కోపం, ద్వేషం అన్నీ కలిసి నన్ను వారి మంచి పారిపోయేలా చేసింది. వచ్చేశాను. వారికి సరిపడే డబ్బు పంపేదాన్ని. పది సంవత్సరాలనంతరం మావయ్య దిగవంతులైనారు.

# బంగారు పంజరం

అత్తమ్మ ఉన్నారు. నిర్మల, ఆమె కలిసి ఉన్నారు.

"నే నిక్కడకొచ్చిన కొన్ని నెలలకు నిర్మల నన్ను వెంటనే రమ్మని వ్రాసింది. రెక్కలుగట్టుకుని వ్రాలాను. జావెడు లోతుదిగినకళ్ళతో, ఎముకల గూడులాఉన్న నిర్మలను చూచి బావురుమని యేడ్చాను.

"ఏమైంది? ఎందుకిలా అయ్యావు?" అంటే జవాబిచ్చేదికాదు. ఇంతవరకు నాకు తెలీదు. ఊహించ గల్గాను. మరిక అడగలేదు. వెంటనే మదనపల్లిలో చేర్పించి చాలా డబ్బు వ్యయంచేశాను. ఒక ఊపిరి తిత్తిని తీసేశారు. ప్రైవేట్ ఇంట్లో అక్కడే ఉంటోంది. అత్తమ్మకూడ కూతురిదగ్గరే ఉంటు న్నారు.

---

ఒకనాటిరాత్రి సుభద్రమ్మ గారికి గండుపిల్లి అరుపు వినిపిం చింది. వెంటనే ఆమె "మ్యావ్" అన్నది. అట్నుంచి మళ్ళీ "మ్యావ్" మన్నది పిల్లి. తనకు పిల్లి భాష వచ్చుననుకుంది ఆమె. తెల్లవార్లూ అలా అరుస్తూనే వున్నది. మర్నాడు పక్కింటి రామాయమ్మగారన్నది: "సుభ ద్రమ్మా! రాత్రి తెల్లవార్లూ పిల్లి అరిచి అరిచి చంపిందనుకో... దానికి నేనూ సమాధానం ఇచ్చాలే" నన్నది. "ఓహో! అయితే నువ్వా? రాత్రి సమా ధానంగా అరిచావు?" అనుకుంది సుభద్రమ్మ.

ఉమారాణి (మద్రాసు)

---

"మానవుల్లోకూడా రాక్షసులుంటారు. నిర్మల భర్త ఒకడు. భార్యబాగోగులు పరామర్శించేకన్నా విడాకులకోసం ప్రయత్నించటం యెక్కువగా ఉండేది. చివరికి విడాకులిచ్చాడు. మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు..... నిర్మలకు సంతానంలేదు.....

"వివాహ సంబంధాన్ని విడదీసిన ఆ కాగితాలను లెక్కచేయలేదు. ఆమెకు అతనే సర్వస్వం. అతను సుఖంకోసం పెళ్ళాడాడు. కాని తనుమాత్రం తన భర్తను యింకా భర్తగానే భావిస్తూఉంది. వీ రిద్దరి కిప్పుడు సంబంధంలేదని, యిద్దరూ ఒకరి కొకరు పరాయివారైపోయారని చెప్పే ధైర్యం నాకు లేదు. ఆమె బాగై సానిటోరియం వదలటం కలలోని వార్త. ఎప్పుడూ—జీవిత పర్యంతం అక్కడే ఉండవలసిన నిర్మల హృదయాలోచన లెలాఉన్నా కళ్ళే నవ్వంగాని, వచ్చేలాభంగాని లేదు.

"నిర్మలా! నా భర్త జీవించేఉన్నారని నా నమ్మ కం. కాని కొన్ని సంవత్సరాలక్రితం యెన్నో పుకార్లు, కల్లకబుర్లు పుట్టాయి—వారు లేరని. కాని వారున్నా రని నా మనసు చెబుతోంది. అలా చెప్పకేంచేస్తుం దిలే. మనం ప్రాణంతో సమానంగా ప్రేమించినవారు సుఖంగా ఉండాలని సర్వదా కాంక్షిస్తాము. వారికి కీడు సంభవించకూడదనే కోరుకుంటాము. అసలు ఆ వ్యక్తి దూరమైతే యెక్కడో ఒకచోట ప్రాణంతోఉంటే చాలని కోరుకుంటాము. వారి విషయం చెడుగా తలంచలేము. నా రితరులకెలాంటి వారైనా మనకుమాత్రం చాలా మంచివారు. అంతటి విశిష్టమైన గుణం గలవారెవ్వరూ లేనట్లే భావి స్తాము. అది మన ప్రేమ. ప్రేమ వక్రమార్గంలో ఉండదుకదా ?

"వారు లేరని తెలుసు. ఆ అభిప్రాయం ఈ మధ్యలో నేవచ్చింది. కాని కొన్నిసార్లు నమ్మలేను. ఉన్నారేమో......ఒక వేళ యెప్పటికైనా వస్తా రేమో?...... స్వాతంత్ర్యం వచ్చి పదిహేను సంవత్స రాలైందికదా ? స్వేచ్ఛగా కాకపోయినా, రహ స్యంగా రావచ్చునే !— కనీసం ఓ చిన్న ఉత్తరం ముక్క వ్రాసి పడెయ్యవచ్చునే. నే నిక్కడున్నట్లు మద్రాస్ యింటివాళ్ళకి తెలుసు. మనస్సుంటే మార్గం...... అంతేకాదు. అసలు వ్యక్తంటూఉంటే మార్గం—అనాలి కాబోలు.

"ఈ విషయాలు నే నెప్పుడూ తలంచను. నా కసలు సమయం ఉండదు. సింహావలోకనం చేశావా, మనసంతా వికలమై నన్ను నేనే మర్చి పోతాను. అందుకే అలా జరక్కుండే యిద్దరు పిల్లల్ని చేరదీశాను.

"ఇప్పుడు చెప్పమ్మా నిర్మలా!.... నా కీ విష యాల్లో అనుభవం లేదంటావా ? మూలి కొక్కమీద కొబ్బరికాయ పడినట్లున్న జీవితం యొక్క బాధలు నా కవగాహనం కాలేదా ? కష్ట సుఖాలు కలితురాలనై ధనం కూర్చుకుంటూ, కారులో తిరుగుతూ ఆనందంతో జీవితశేషాన్ని గడుపుతున్నా ననుకుంటున్నావా? నా దాక వస్తే నిజం తెలుస్తుందన్న నీ విప్పుడేమంటావు....?

"నా పరిస్థితిమాత్రం అధ్వాన్నంగా లేదూ? 'నా' అన్నవారున్నా వారివల్ల మనఃక్లేశం తప్ప— అవగింజంత సంతోషం పొందుతున్నానా?

"వెడుతూ వెడుతూ మనం ప్రేమించినవారు మన హృదయవీణను కృతిచేసి సగం రాగాన్నాలా పించి మధ్యలోనే వదిలేసిపోయారు. ఒక మహా రచ యిత అసంపూర్ణంగా కావ్యాన్ని వదిలేసి పోయినట్లు మనల్ని వారు వదిలేసిపోయారు. పూర్తిచేసేశక్తి వారికేఉంది. కాని ఒకటిమాత్రం మన చేతు ల్లోనే ఉంది. వీణ అపశ్రుతి పలక్కుండా చూచు కోవాలి. అది పాడై దుమ్ముకొట్టుకోకుండ కాపాడాలి. ఆ రాగాన్ని అదే స్థాయిలో అంత మృదు మధురంగా పాడే వ్యక్తులు మనకు లేకపోయినా, కనీసం ఆ వీణను మీటినవారికి అపశ్రుతి వినిపించ కూడదమ్మా......

"కాదూ...... మాట్లాడవేం నిర్మలా ?"

డాక్టర్ కాంత ఆశ్చర్యపోయింది. గాలి వానానంతరం వచ్చే ప్రశాంతత ఆమె ముఖంలో స్పష్టమైంది. మూడుగంటలు దాటింది. గుబురుగాఉన్న అశోక వృక్షపు ఆకుల సందుల్లోంచి సూర్యుని కిరణాలు దూసుకువచ్చి వారిమీద అక్కడక్కడ పడుతున్నాయి. పిల్లగాలికే భయపడి వణుకుతున్న ఆ బంగారువన్నె ఆకులకేసి చూస్తోంది నిర్మల.

ఈ ప్రశ్న వేసిన వెంటనే ఆమె ఉలిక్కిపడింది; డాక్టర్‌వైపు చూసింది. ఆమె లేచి కూచుని కాళ్ళు మాత్రం అలాగే చాపుకుని కూచునిఉంది.

నిర్మల కళ్ళలో నీళ్ళు సుళ్ళుతిరుగుతుంటే అమాంతంగా డాక్టర్ఒళ్ళో తలదాచుకుంది. ఆమె నిర్మల—తలను మృదువుగా నిమురుతోంది.

మరొక చేతిని నిర్మల గట్టిగా పట్టుకుంది..... అతి ప్రయత్నంతో అంది "నన్ను క్షమించండి ఈ జ్ఞాపకాల బాకుపోట్లతో మీ గుండెల్లో తూట్లుచేశాను. అహంకారంతో, న్యాయాన్యాయ విచారణ చేయకుండా యిష్టమొచ్చినలా అన్నాను... పాపిష్టిదాన్ని మీరు క్షమించాలి"

ఆమె జవాబివ్వలేదు. నిర్మలను వారించలేదు. ఆమెకు తెలుసు అలా కన్నీరు కారిస్తే....పశ్చాత్తాపం చెందితే హృదయం తేలికపడుతుందని.

కొన్ని క్షణాలు గడిచినై. ప్రకృతికి కూడ వారిపై జాలికల్గుతోందికాబోలు, యెండతీక్షణతతగ్గిపోతోంది. నిర్మలను లేపి ఇద్దరూ నీళ్ళదగ్గర కెళ్ళారు. సన్న జల్లుగా పడుతున్న నీటితుంపరలు, చిన్నచిన్న కెరటాలు రాళ్ళను తాకి విరిగిపోవటం చూస్తూ కూర్చున్నారు

నిర్మల ఎక్కిళ్ళు తగ్గలేదు. ఆమె వెళ్ళి కాఫీ ఫ్లాస్కు, పేము టిఫిన్‌బుట్ట తెచ్చి కూచుంది.

"అతిధి మర్యాద మర్చిపోయాను.... ఏదో సోది చెబుతూ తిండి సంగతి జ్ఞాపకంవచ్చిందికాదు" అంటూ నిర్మలకు ఆకులో ఫలహారాలు పెట్టి యిచ్చింది. నిర్మల ఆమెవైపు విస్తుపోయి చూస్తోంది. ఈమె మనిషా ? లేక దేవతా ?

ఇద్దరూ ముఖాలు కడుక్కుని తింటున్నారు.

"బోండాలు నేనే చేశాను ....... నాకు వంట సమంగా రాదు......కాఫీ చేసుకున్నవి పారేసే అంత అసహ్యంగా ఉండదు. కడుపు నింపుకోవచ్చులే."

"బాగున్నాయి. కొంచె ఉప్పుతక్కువ" అంది నిర్మల.

ఆమె పకపక నవ్వింది "కనుక్కున్నావ్ నిర్మలా. నీ సంగతే మర్చిపోయి ఉప్పు సమంగా వెయ్యలేదు. నాకు కొంచె వళ్ళు నీరెక్కుతోందని ఉప్పు తగ్గించాను .... ఇదిగో యిందులో ఉప్పు ఉంది"

నిర్మలకూడ మెల్లిగా నవ్వింది.

వంటలు, రుచులు మాట్లాడుతూ వారిద్దరూ తినటం పూర్తిచేశారు. ఆమె అన్నీ లోపల సర్దింది.

"ఇంకా కాసేపు కూచుందామా నిర్మలా ? ఇంకా ప్రొద్దుంది....నాకూ పనిలేదు.... వెళ్ళాలని లేకపోతే కాసేపిలాగే కూచుందాం. ఇంట్లో యింత నిర్మలమైన ప్రశాంత వాతావరణం దొరకదు. ఏవో శబ్దాలు, ఏదీ లేకపోతే రేడియోలో విన్న పాటలే వినటం.... విసుగేస్తుంది" నిర్మలవైపు ప్రశ్నార్ధకంగా చూసింది.

నిర్మలకు అక్కడే హాయిగా ఉంది. కూచుందామనుంది. ఇద్దరూ అక్కడే నీళ్ళకు సమీపంగా కూచున్నారు. నిర్మల కాళ్ళు నీళ్ళలో పెట్టుకుని కూచుంది. కాసేపు తాళి అంది: "నన్ను మన్నించినట్లేనా ?"

డాక్టర్ చిరుగా నవ్వుతూ నిర్మల చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"మన్నించినట్లే.... అయినా అంత తప్పేం చేశావమ్మా....సరేలే కానీ....కానీ నీకు శిక్ష తప్పదు. ఇంకొన్ని విషయాలు మాట్లాడాలి.... వింటావా ?" అంది.

ఆమె మాటలకు నిర్మల బాధపడింది "శిక్ష అంటారేం ? మీరు చెప్పేదాంట్లో యేముందో కాని నాలో పిచ్చనం రేగుతోంది. ఏదో భారం దిగిపోయినట్లుగా ఉంది ....మీతో పోల్చి చూస్తే నా స్థితి యెంతో మెరుగనిపిస్తుంది....కానీ డాక్టర్

---

ఇద్దరు కవిశేఖరులు చిర కాలానికి కలుసుకున్నారు.

"నేను ఇటీవలే ఒక పుస్తకం రాయటం పూర్తిచేశాను. కాని మా అబ్బాయి పోకిభడవ పుస్తకాలనీ తగలేశాడు." అని గోల పెట్టాడు.

"పాపం! మీ అబ్బాయి కెన్నేళ్ళు!

"మూడేళ్ళు"

"అహా! మూడేళ్ళ వెధవ, ఆ పుస్తకం చదవ గలిగాడన్న మాట "

కామాక్షి, (కంచికచర్ల)

---

మరి మీ విషయం.... మీ గురించి యిక్కడివారికి తెలీదా ?" అంది.

"ఏమో.... తెలుసేమో.... నాతోమాత్రం యెవరూ మీ భర్త ఇలాగాదా? అని అడగలేదు.... తెలియనే తెలియదేమో.... నీ దెలాఉన్నా ఈ విషయాలన్నీ నీ హృదయంలో దాచుకోవలసిన విషయాలు.... అది గుర్తుంచుకోమ్మా...."

"అలాగే.... నే నెవ్వరికీ చెప్పను...." అంది నిర్మల.

ఎంత చూచినా విసుగనిపించని ఆ నీటి రాశిని, అలల నాట్యాన్ని చూస్తూ కొంతసేపు మౌనం దాల్చారు.

"నిర్మలా! అంతా మనం అనుకున్నలా జరిగి ఉంటే యింత దూరం వచ్చి యింతమంది రోగులకు సేవచేయగల్గేదాన్నా ? నిర్మల సహృదయాన్ని గ్రహించేదాన్నా?....ఆమెకు ఆర్థికంగా యింతగా సహాయపడగల్గేదాన్నా?... నా తమ్ముడికికూడ చేతనైన డబ్బు సాయంచేయగల్గేదాన్నా ? నాలో యింతఓర్పు, సహనం, సేవాతత్పరత ఉండేదా ?" అన్నది డాక్టర్ కాంత.

నిర్మల నీళ్ళలో చిన్న రాళ్ళు వేస్తోంది. అవి బుడుంగన మునుగుతూ అలలను లేపుతుంటే చూస్తోంది.

ఆమె అంతర్యంలో యేముందో— తనను నిందించుకుంటుందా ?

ఎంత సేపైందోకాని అస్తమయ భానుని అంతిమ తేజస్సులో పడి ప్రకృతి చల్లదనం దాల్చింది. ఎర్రబడిన సూర్యబింబాన్ని చూస్తోంది నిర్మల.

వారిద్దరి ఏకాగ్రతను భంగపరుస్తూ చిలుక పలికింది.

ఇద్దరూ తల తిప్పి చూచారు. ఒకతను చక్కని పంజరంలో అందాల చిలుకను తెచ్చి నీటిగట్టున దాన్నుంచాడు. కవాటం తెరచి నీటిచుక్కలు వేస్తూ దాని నోరు తడుపుతున్నాడు. ఆ చిలుక ఎగిరిపోవటానికి కావంతయైన ప్రయత్నించటంలేదు.

నిర్మల దాన్ని కన్నార్పకుండా చూస్తోంది. కొంతసేపటికి అంది: "చూచారా డాక్టర్ ! ఈ పంజరంలో చిలుకలా ఉన్నాను. దీన్ని వదలి పారిపోయి యెక్కడైన ఒంటరిగా హాయిగా బ్రతుకుదామంటే ఈ పంజరం నన్ను వెళ్ళనివ్వదు. నా హృదయానికి శాంతి లభించే మార్గం అదే అనుకున్నాను.... కాని నా పంజరం బంగారుది....ఎంతైనా పంజరం పంజరమే....ఎందులో పెట్టినా, దాని స్వేచ్ఛకు మాత్రం భంగమే"నిర్మల ఇక మాట్లాడలేకపోయింది.

సందెవెలుగులోనుంచి ప్రకృతి చీకటి ముసుగు లాక్కుంటోంది. చీకటిపడుతుందని చూస్తున్న నిర్మలకు చీకటి అగుపించలేదు. తళుక్కున ఆమెలో ఆలోచన తట్టింది. కృష్ణపక్ష చంద్రుడెప్పుడో ఉదయించేశాడు. అతని ఆగమనాన్నెవరూ గమనించలేదు. సూర్యుని అస్తమయానంతరం వచ్చిన నిబిడ పాతద్రోలి ప్రకృతికి తన అమృత శీతకిరణ ముసుగును ప్రసాదించాడు.... నిర్మల హృదయంలోని అంధకారాన్నికూడ పారద్రోలినట్లుగా నవమి చంద్రుడు మబ్బుల మాటునుంచి బహిర్గతమయ్యాడు.

నిర్మల గబుక్కున లేచి, డాక్టర్ కాంత రెండు చేతులు పట్టుకుంది. "ఏం చెప్పాలో, ఎలా మాట్లాడాలో, నా కృతజ్ఞత నెలా తెల్పాలో నా కవగాహనం కావటంలేదు. నాకు కనువిప్పు కల్గించారు. మీకెంతో కృతజ్ఞురాల్ని. ఇకపై నా జీవితకాలమంతా యితరుల మేలుకోసం వినియోగపరుస్తాను. అదే మీ కివ్వగల కానుక.... నన్నాశీర్వదించండి."

డాక్టర్‌ముఖం ఆ వెన్నెల్లో కళకళలాడింది. ఆమె వచ్చిన పని నెరవేరింది. నిర్మల తన కర్తవ్యాన్ని గ్రహించింది. తనకు కావలసిందికూడా అదే. నిర్మలను గాఢంగా హృదయానికి హత్తుకుంది.

డ్రైవర్‌ను కేకేయటంతో కొన్ని క్షణాలకు అతను వచ్చాడు. నిర్మల, డాక్టర్ కారులో తిరుగు ప్రయాణం మొదలుపెట్టారు. ప్రక్కలో కూచున్న నిర్మలవైపామె పరికించి చూచింది. నిర్మల ముఖం ప్రశాంతమై యేదో తేజస్సుతో పరిపూర్ణత చెందిఉంది. డాక్టర్ కాంత తృప్తిగా మెల్లగా నిట్టూర్చింది. (సశేషం)



## పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదియు, మీ సరియైన చర్యను గురించియు మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసివంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ లగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము, ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం). దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు మా పూచీపైన పంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు. చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. Dev Dutt Shastri, Raj Jyothishi (W. P.) JULLUNDUR CITY

## ఉచితమైన



అంద చందాల
స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రల
బహుమానాలు



మీరు కొను ప్రతి ఓకే తయారీ వస్తువుతోగల బహుమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించి, వానికి మారుగా ఇవ్వబడు అత్యాకర్షకమైన స్టెయిన్ లెస్‌స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమునగల ఓకే వ్యాపారివద్దనుండి పొందండి







తయారుచేసినవారు: ది ఈస్ట్ ఏష్యాటిక్ కం. (ఇండియా) ప్రైవేట్ లిమి., మదరాసు.

EAC 3 TEL

ఈ బహుమతి పథకం మద్రాసు, మైసూరు, కేరళ మరియు ఆంధ్ర రాష్ట్రములకూ మాత్రమే వర్తించును.


## తుది నిర్ణయం

20-వ పేజీ తరువాయి

తేరుకొని వచ్చిన అతని నడక నా మనసులో మానిన గాయాన్ని రేపింది.

అది నాకు బాగా పరిచయమైన నడకలా ఉంది. ఎక్కడో, ఎవరో ఇలాగే నడుస్తుండటం చూచి నట్టు గుర్తు. 'ఎవరయి ఉంటారు?'

ఆయన లైటుకు ఎదురుగా కుర్చీమీద కూర్చుని నావేపు చూశారు.

ఒక్కక్షణం కొట్టుకుంటూన్న గుండె ఆగిపోయి నట్లయింది. నరాల్లో ప్రవహిస్తున్న రక్తం గడ్డ కట్టింది. కళ్ళు చీకట్లుక్రమ్మి పడిపోతానేమో అనిపించింది. మెల్లిగా కుర్చీమీద కూర్చొని, ఎండిన పెదవులను నాలుకతో తడుపుకొన్నాను.

గోడమీదున్న పటాలు, గదిలోని కుర్చీ, బల్ల అన్నీ గిర్రున తిరిగి చటుక్కున ఆగిపోయాయి.

అరక్షణం చీకట్లో పామునడగ తొక్కి బెదరి పోయినట్లనిపించినా, మరుక్షణమే పామును చేతితో పట్టుకుని, ఆడించే పాములవాడి ధీమా వచ్చింది నాకు.

"నమస్తే" అన్నాను చేతులు జోడించి.

"నమస్తే" అన్నారాయన, విభ్రాంతపోతూ.

"ఆఁ...మీరెవరో తెలియాలేదే......"

తలవంచుకొని కూర్చున్నఆయన ఆశ్చర్యంతో తలెత్తి చూసి, "నన్ను గుర్తు పట్టలేదా? లలితా" అన్నారు.

"క్షమించండి. నా పేరు లలితకాదు. లలితా దేవి."

అపరిచితులనుండి ఇటువంటి సంబోధన నాకు నచ్చదని సూచిస్తూ అన్నాను.

ఆయన ఇంకా ఆశ్చర్యపోతూ, "నేను—నేను— లలితా......వెంకటేశమూర్తి" అన్నారు తడబడుతూ.

"అలాగా? మీ పేరు తెలిసింది. సరే, మీ అమ్మా యి మా బడిలో చదువుతూందా? ఏ క్లాసు? పే రేమిటి?"

అతను "......... మా అమ్మాయి వనజ హైస్కూల్లో చదువుతోంది. నిజమే. కాని నేను వచ్చింది........"

నేను అతి గంభీరంగా "చూడండి వెంకటేశం గారు. మీ అమ్మాయికి ఎక్కువ మార్కులు వేయ మని మీరు అడగటం న్యాయమా? మీ అమ్మాయి పరీక్షల్లో ఎలా వ్రాసిందో, దాని ప్రకారమే........"

"లలితా!" అరిచారాయన.

"అందరూ నన్ను లలితాదేవి అనే పిలుస్తూ ఉంటారు. మీరూ అలాగే పిలిస్తే మంచిది."

ఇప్పటికి ఆయనకు నా మనసులోని భావమేమో అర్థమయినట్లుంది.

నేను కావాలనే ఆయన్ని వేళాకోళం పట్టిస్తున్నా నని అర్థం కాగానే, కోపంతో బల్లమీద గుద్ది, "నాటకం చాలు లలితా" అని గర్జించాడు.

ఒకప్పుడు చాలాకాలానికిముందు, ఆయన ఇలాంటి గర్జనకు నా హృదయం, గాలి తగిలిన దీపంలా, అల్ల ల్లాడిపోయేది.

కాని ఇప్పుడో?

నాకే ఆశ్చర్యమనిపించేటంతగా నా హృదయం

కొరడు కట్టేసింది. భావోద్వేగంతో నా హృదయం, లాగి వదిలిన తంత్రిలా కంపించినా, మనసుమాత్రం అచలంగా ఉంది.

వీణానాదంలా, మధురంగా ధ్వనించింది నా కంఠ స్వరం: "ఇల్లు చాలా పాతది."

ఆయన ఆవేశంతో పైకి లేచి అటూ, ఇటూ తిరుగుతూ, "లలితా నేను నిన్ను క్షమించాను. ఇంటికి తిరిగి రాగలవా?" అన్నారు.

ఒకప్పుడు ఇలాటి మాటలు వినటంకోసం కలవ రించిపోయేదాన్ని.

ఈ అనుమాన ప్రవృత్తిగల మనిషి, ఏదో ఆధారం లేని సందేహంలో పడి, నా నడతను శంకించి, నన్ను దూరం చేసిన కొత్తలో, ఈ మాట అనిఉంటే? ఆనందంతో పూజించేదాన్ని.

కాని, ఇప్పుడు?

నేను అనుకునేదాన్ని......ఆయన నన్ను పరిగ్రహిస్తానని అన్నప్పుడు, నా హృదయం పురి విప్పిన నెమలిలా నాట్యం చేయవచ్చు. వసంతమాసం లోని కోయిలలా పంతసించవచ్చుఅని కలలుకనేదాన్ని.

నా ఆశ, ఆకాంక్షలన్నీ ఫలించని నిరీక్షణలో కుంపటిమీది నీళ్ళలా ఇంకిపోయాయి.

మిగిలింది ఖాళీగిన్నె మాత్రమే.

మధుర భావనలన్నీ కాలిపోగా, మిగిలింది బూడిద మాత్రమే.

నా జీవితం వక్రమార్గం పట్టినప్పుడే వంకర పోయిన పెదవులను మరింత వంకరచేసి వ్యంగ్యంగా అన్నాను:

"క్షమించటమా? నేనేమీ తప్పుచేయలేదు. మీ క్షమాభిక్ష నా కనవసరం."

"లలితా, వెనుకటిదంతా మరచిపోలేవా?" అన్నారాయన, అసహాయంగా.

"మరచిపోగలను......మరచిపోయాను కూడ...... దానితోబాటే నా పెళ్ళి సంగతి కూడ విస్మరించాను."

"లలితా, అప్పుడు నాది ఉడుకు రక్తం. చెప్పుడు మాటలు విని, అన్యాయంగా నిన్ను దూరం చేసు కున్నాను. నా కిప్పుడు బుద్ధి వచ్చింది."

"కాని నా ఉడుకు రక్తం ఇప్పుడు చల్లారిపోయింది. మళ్ళీ సంసార జీవితపు వేడిని అది భరించలేదు. అదీకాక, ఇప్పుడుమాత్రం నేను నిరపరాధినని మీరు ఎలా నమ్ముతున్నారు?"

"నాకే అనిపించింది—ఎవరో చెప్పినమాటలు నమ్మి, నీకు అన్యాయం చేశానని."

నేను వ్యంగ్యంగా. "ఓహో! మీకు నా మాట మీదకన్నా ఇంకొకరి మాటలమీదనే ఎక్కువ విశ్వాసం, నమ్మకమూను. అంతేకదా?"

"అప్పుడు నేను యువకుడిని. నీవు అంద గత్తెవి. నీ నడత బాగా లేదని ఎవరో చెప్పినప్పుడు, గుడ్డిగా నమ్మాను—ఇప్పుడనిపిస్తోంది, నే నెంత మూర్ఖంగా ప్రవర్తించానోకదా అని."

"ఇప్పుడు నాలో అందమూ లేదు. మీరు యువ కులూకారు. కాలం నా అందాన్ని కోరి స్వీకరించింది. కాని, అప్పుడు అపక్వంగాఉన్న మనస్సు, ఇప్పుడు పక్వమయింది."

"లలితా, నువ్వు నన్ను క్షమించలేవా? మళ్ళీ వచ్చి నాతో కాపురం చేయలేవా?"

నేను నవ్వి అన్నాను: "కాపురం......ఈ వయస్సులోనా?" నా కిప్పు డెన్నేళ్ళో తెలుసా? నలభై రెండేళ్ళు. నే నిప్పుడు వృద్ధురాలిని"

"కావచ్చు. కాని, నీ ఇంట్లో నువ్వు వచ్చి ఉండ టానికి అభ్యంతరమేమిటి?"

లోలోపలనే రాజుకొంటున్న జ్వాలాముఖి పైకి లేచి, శిలాద్రవాన్ని చిమ్మింది.

"అభ్యంతరంకాక! ఇరవై యేళ్ళక్రితం మీరు ఈ మాట అనిఉంటే బాగుండేది. అప్పుడు నాకు ఇంకా అందరిలా బ్రతకాలనే ఆశ ఉండేది. నా భర్త, నా ఇల్లు, నా కాపురం, అన్న మోహమూ ఉండేది. నిరీక్షించి, నిరీక్షించి, నా హృదయం కరడుకట్టుకు పోయింది; శిలయిపోయింది."

"ఆలోచించుకో, తొందరపడకు" అన్నారాయన మృదువుగా.

మనస్సు ఇరవైయేళ్ళ క్రిందటి విషయాన్ని నెమరువేసింది.

అప్పుడు నాకు పెళ్ళయిన కొత్త. జీవితం నందన వనం అని అనుకుంటున్న రోజులవి.

---

ఓ భర్త తన భార్యకు 'పతి వ్రతాధర్మాలు' బోధిస్తున్నాడు.

"ఉత్తమ ఇల్లాలు ఎప్పుడూ డబ్బు అక్కర్లేని సమయంలో కూడా భర్తకు ఉత్తరాలు రాస్తూ ఉంటుంది."

"అవునవును. భార్య అడగ కుండా డబ్బు పంపించేవారే సరైన భర్త" తడుముకోకుండా సమాధాన మిచ్చింది ఆ యిల్లాలు.

రామారావు, (రాజమండ్రి)

---

నందనవనం సర్పాలకు కూడ ఆశ్రయమివ్వ గలదన్న విషయం నా కప్పుడు తెలియదు. ఒక్క సంవత్సరం కాకమునుపే, మా పచ్చటి కాపురానికి సంశయపు నిప్పురవ్వ తగిలి చిచ్చుపెట్టింది.

సత్యాసత్యాలను తెలుసుకొనే ఓరిమి లేదాయనకు. నాకూ అభిమానం ఓ పాలు ఎక్కువే. నాలో తప్పే లేనప్పుడు 'తప్పు చెయ్యలేదు' అని వాదించి ఒప్పించ వలసిన అవసరం నా కేమిటి? ఇంట్లో లేచిన దుమా రానికి నే నిచ్చిన సమాధానం: "నాలో నమ్మకం, విశ్వాసం ఉంటేనే నే నిక్కడుండగలను."

కాని ఆయనకు నాలో నమ్మకం లేకపోయింది. నా అత్తమామల, ఆడపడచుల మాటలే, వేద వాక్యా లయ్యాయి.

దీని పరిణామం—పసుపు కుంకుమతోనే పుట్టిల్లు చేరాను.

ఇంకో పిల్ల కన్య—చెర వదలించుకుని వాళ్ళింట్లో అడుగుపెట్టింది.

ఇంటినుండి బయటకు అడుగుపెడితే చాలు. గుస గుసలు, కొంటెనవ్వులు నన్ను వెంటాడేవి.

నన్ను చుట్టు ముట్టిన వెక్కిరింతలు, వ్యంగ్యపు మాటలను ధైర్యంగా ఎదిరించాను.

పెళ్ళితో ఆగిపోయిన చదువు మళ్ళీ ప్రారంభిం చాను.

చదువు ముగిశాక స్వతంత్రంగా జీవితంలోకి అడుగుపెట్టాను.

ఆయన ఇంకో పెళ్ళి చేసుకునేదాక నా, హృద యంలో ఎక్కడో ఓ మూల, ఆశారేఖ మినుకు మంటూనే ఉండేది. కాని, ఆయన పెళ్ళి చేసుకున్న సంగతి వినగానే, నా ఆశాకిరణం ఆరిపోయింది. మనసు రాయి చేసుకొని, ఒంటరి బ్రతుకునే అల వరచుకొన్నాను.

ఇరుగు పొరుగు వేలెత్తి చూపిస్తున్నా, లక్ష్య పెట్టకుండా, బ్రతకటానికి ప్రయత్నించాను.

నా ప్రయత్నం విఫలమవలేదు.

ముగ్ధ బాలికల సహవాసం, నా జీవితానికి ఓ విధ మైన శాంతి నిచ్చింది. జీవితం ఒడుదుడుకులు లేకుండ సాగిపోతూంది.

ఇంత జరిగాక, ఇన్నేళ్ళ అనంతరం ఆయన వచ్చి "నీ ఇంటికి తిరిగి రా" అన్నప్పుడు నాకు కోపమే వచ్చింది.

"తొందరపడవద్దు" అని ఆయన హెచ్చరించి నప్పుడు, కాస్త నిదానించి ఆలోచించాను.

ఒక విధంగా ఆయన చెప్పటము సరియైనదే. జీవిత సంధ్యలో 'నా' అన్న వాళ్ళులేక, ఆఖరిదాక జీవితం సాగించటం దుర్భరమే.

జీవితపు దండకారణ్యంలో బంగారులేడి రూపం దాల్చి పరిగెడుతూన్న దాంపత్య జీవితాన్ని వెన్నం టడం నిరర్థకమన్న సంగతి నాకూ తెలుసు.

కాని, యువ్వనపు స్వర్ణకాంతికి అభిముఖంగా నిల్చున్న నాకు, గాజులో కూడ రత్నకాంతిని చూస్తున్న నా కాంక్షాపూరిత నేత్రాలకు, దూరంగా నిల్చున్న మాయ లేడి, అతి మనోహరంగా కనిపించింది.

నా మెడలోనున్నది దారంలో గుచ్చిన నల్లపూసల సరం మాత్రమే.

కాని, దానికున్న శక్తి ఎంతటిది!

నా మనస్సుమీద విజయం సాధించటంలో జయం పొందాను. దేహము, మనస్సులను గెల్చి, నా అధీనంలో ఉంచుకునే ప్రయత్నంలోనే నా వెంట్రుకలు తెల్ల బడ్డాయి. ముఖంమీద అక్కడక్కడ ముడతలు పడ నారంభించాయి. నలభై ఏళ్ళకే, అరవై ఏళ్ళ వృద్ధురాలినై పోయాను.

నేను మాట్లాడకుండా నిల్చోగానే, ఆయన రెండడు గులు ముందుకు వచ్చి, మృదువుగా "ఏమంటావు లలితా?" అన్నారు.

నా మనస్సు మెత్తబడటం ఆయన గమనించి నట్టే ఉంది.

కుర్రతనంలో ఏదో తప్పు చేశారు. కాని, దాన్ని క్షమించి, జీవితంతో రాజీపడటమే మంచిదనిపించింది. ఆలస్యమైనా ఆయన తన తప్పు తెలుసుకొని నాలో విశ్వాసం ప్రకటించినందుకు సంతోషమయింది.

"సరే, అలాగే వస్తాను. కాని......"

"కానీ ఏమిటి?......" అన్నారాయన ఆత్రంగా.

# చావూ - బ్రతుకూ!

## ఐ. నాగమల్లా రెడ్డి

అడుగుల నిడుచూ ఎడారిఓడ
వేడుకకైనను చూడక నీడ
ఎడారిలో...వడి ఎడారిలో
నడచుచుండె పెనుతుఫానులో...

ఎడారి వర్తకు జీవన భృతికై
ఎడారిఓడకు ఈ పయనం
అడుగులు తడబడ వడివడి గాలులు
సుడివడి రేగెను ఆ సమయం!

గడపదాటనీ నవ వధూమణీ
ఎడారి వర్తకు నవ సౌదామినీ
పగలే కలలను పాని గురించీ
మగత నిదురలో మనసు తరించీ...

అందీ అందని సుధలను గ్రోలీ
పొందీ పొందని సుఖాల తేలీ
పోలిపోయెడూ కేళలా సోకను
గాలిదుమారం గుండెలో రేగెను!

చావూ-బ్రతుకూ అర్థం తెలియని
సాధుజంతువూ ఎడారిఓడకు
బ్రతుకూ-భార్యా స్వార్థం తెలిసిన
-ఎడారి వర్తకు దేహమునూ...

ఇసుక గుట్టలలో గగనంబూ
విసురుగ తాకిన ప్రభంజనంబు
ఒక్క క్షణములో కప్పివైచెను
దిక్కులేని మరణంబుగ జేసెను!

# తుది నిర్ణయం

"మీరెండవ భార్యకు నా రాక తెలుసా? ఆమె ఒప్పుకుంటుందా?"

గట్టిగా నవ్వేశా రాయన. "ఓ! నీకేమీ తెలియ నట్టుందే! ఆవిడ చనిపోయి రెండునెలలయింది. ఐదుగురు పిల్లలున్నారు అంతే. నీవు వస్తే ఆక్షేపించేవారెవరు లేరు నువ్వు నిశ్చింతగా ఉండ వచ్చు."

నా ముఖం తెల్లబడింది. నా కాళ్ళు నుంచునే శక్తిని కోల్పోయాయి. గబుక్కున కుర్చీలో కూర్చు న్నాను. ఆయన నా దగ్గరగా వచ్చి, "ఏం జరిగింది లలితా?" అన్నారు కంగారుగా.

అయితే ఈయన తన తప్పు తెలుసుకొని పశ్చా త్తాపంతో నా దగ్గరికి రాలేదు. నామీద కరుణతో గాని, మమతతో గాని నన్ను పిలవటంలేదు.

ఈ వయస్సులో ఇంకో పెళ్ళి చేసుకోవటం అసాధ్యం. పిల్లలతో నిండిన గృహానికి, గృహిణి అవశ్యకత ఎంతైనా ఉంది. తల్లిలేని పిల్లలకు తల్లిగా, భార్యలేని ఈయనకు భార్యగా ఉండటానికి ఓ స్త్రీ కావలసి ఉంది.

ఆయన మళ్ళీ రమ్మని తనను పిలవటం కేవలం స్వార్థదృష్టితో మాత్రమే. తనకోసం, తన పిల్లల కోసం, విధిలేక నన్ను ఆహ్వానించారంతే.

నా సుఖ సంతోషాల ప్రశ్నే లేదిక్కడ. నా హృద యం రోషంతో మండసాగింది. దెబ్బతిన్న నాగినిలా లేచి నుంచున్నాను.

"మీరిక వెళ్ళవచ్చు. అప్పుడే గంట ఎనిమిది దాటింది. ఈ అసమయంలో మీరిక్కడుండటం ఎవరన్నా చూస్తే అపార్థం చేసుకోవచ్చు" అన్నాను తీక్ష్ణంగా.

తన పాచిక పారినందుకు ప్రసన్నంగా ఉన్న ఆయన మొహం ముడుచుకుంది.

"నీవు ఒక పెద్ద సమస్య లలితా"

"ఆ సమస్యా పరిష్కారం మీరు చేయక్కర లేదు. బయటికి నడవండి" అంటూ తలుపువేపు చూపించాను.

పిట్ట వలలో పడిందని సంతసించబోయినంతలో అది ఎగిరిపోవటం చూసిన వేటగాడిలా మండిపడ్డా రాయన.

"ఇప్పుడే కదా వస్తున్నావు?" అన్నారు.

"మీమీద నాకు గౌరవం కాని, విశ్వాసం కాని లేవు. ఉన్న కాస్త అభిమానం కూడా, ఈ రోజుతో హరిం చుకుపోయింది. నేను గౌరవించలేని మనిషితో కలిసి జీవించటం అసంభవం. నాకీ జీవితమే అలవాటయింది. మీరు దయచేసి వెళ్ళండి."

"లలితా......"

"ఇంకా మీరు వెళ్ళకపోయినట్టయితే, ఇరుగు పొరుగువాళ్ళను పిలవాల్సివస్తుంది."

నా కంఠంలోనున్న నిర్ధారాన్ని గమనించి, నిస్స హాయంగా బయటికి వెళ్ళబోతూ, "ఇంకోసారి ఆలోచించు" అన్నారు.

"ఇదే నా తుది నిర్ణయం" అంటూ దభేలుమని తలుపులు మూసి గడియపెట్టాను.

క్రమంగా ఆయన అడుగుల చప్పుడు దూర మయింది. ★

పెద్ద ప్రేగులో—ముఖ్యంగా తిర్యగ్భాగము 'ప్లీను' వద్ద క్రిందకు వంగినచోట గాలి చేరి అటూ, ఇటూ కదలక, జఠరాశయంలో గాలి చేరినట్లుగానే బాధ పెడుతుంది. ఉదరమును, స్పందనమార్గంతో పరీక్షించి, గాలి పెద్ద ప్రేగులో ఉందో, జఠరాశయంలోనే ఉందో నిర్ణయించడం సాధ్యంకాదు. అవకాశంఉన్న చోట ఎక్సురే పరీక్ష చేయించడం మంచిది. విపరీతంగా భోజనం చేసిన వారిలోనూ, త్రాగినవారిలోనూ పొట్ట ఉబ్బి, గాలిచేరినప్పుడులాగే బాధ కలగవచ్చును. అప్పుడు ఉదరస్పందన (Percums of Abdomen) జఠరాశయ ప్రదేశంలో ఢం ఢం శబ్దమును కలిగించదు డబ్ డబ్ శబ్దమును కలిగిస్తుంది. గాలి చేరినప్పుడు త్రేన్పులు బాధోపశమనమును కలిగిస్తవి.

ఒక్కొక్కప్పుడు డయాఫ్రమే, బిగుసుకుపోతుంది. అప్పుడూ ఇవే లక్షణములు ఏర్పడతవి. స్త్రీలలో ఈ డయాఫ్రమ దుస్సంకోచం బహుకాలం ఉండి,

# మనమూ-మనదేహస్థితి

17-వ పేజీ తరువాయి

ఉదరమును ఉబ్బించి, గర్భ లక్షణమును ఏర్పరుస్తుంది. ఈ కృత్రిమ గర్భమును వ్యాధిగా భావించి ఆపరేషన్ చేసినవారున్నారు. కాని, ఈస్థితిలో డయాఫ్రం అంచులు క్రింది ప్రక్క పెముకలను లోపలికి లాగి ఉంచుతవి. నిజ—గర్భంలో ఈ లక్షణం ఉండదు.

రోగిని పడుకోబెట్టి, నెమ్మదిగా ఉదరమును నొక్కితేను, క్లోరోఫారంఇస్తేను, కొన్ని దుస్సంకోచ నివారణ ఔషధములు (Anti Spasmodic) ఉపయోగిస్తేను ఈ గాలి పోయి, గర్భం అంతరించి పోవచ్చును. ఎక్సురే పరీక్ష చేయడానికి వీలున్నప్పుడు, డయాఫ్రములో వంపులు లేకపోవడం తెలిసిపోతుంది.

జఠరాశయంలో గాలి చేరి బాధ కలిగినప్పుడు అందుకు కారణమును తెలుసుకుని చికిత్స చేయాలి. అజీర్ణంవల్ల జఠరాశయంలో గాలి చేరితే, పిప్పరిమింటు, వాముచంటి వస్తువులు దానిని అంతరింపచేయవచ్చును. 'టాకాడయాస్టేజ్' — పెప్సిన్ కాంపౌండు ఒకటి రెండు మాత్రలు ఆహారానంతరం తీసుకుంటే ఈ బాధ పోతుంది. రోగికి గాలి మ్రింగే అలవాటుంటే అతని కది వివరించి, అభ్యాసం మాన్పించాలి. మానసం ఉద్వేగమైనప్పుడు పళ్లమధ్య కార్కులాంటి వస్తువుంచి నోరు గట్టిగా బిగించేటట్లు చేయాలి. వేడినీరు చప్పరిస్తూ ఉంటే కొంత ఉపశాంతి కలుగుతుంది. అసలే గాలితో కడుపు ఉబ్బరించినప్పుడు సోడా త్రాగడం ప్రమాదకరం. మద్యసేవ అసలే కూడదు. ఈ సాధనములతో ఉపశాంతి లేనప్పుడు వెంటనే వైద్య సహాయం పొందడం అత్యవసరం. ★

ఇది వరస—14

సుందర్



# మీరు ఎంత తొందరలో వున్నాసరే

# నీవియాను

# ఉపయోగించగలరు

నీవియా క్రీం అనేక విధాల ఉపయోగపడుతుంది. ఇది ప్రకృతికి అత్యంత సన్నిహితమైంది. చర్మాన్ని ఇది మృదువుగాచేసి, పోషించి, రక్షిస్తుంది. ఇతర క్రీములు చేయలేని పనిని నీవియా చేస్తుంది—అలసిపోయిన గ్రంధులకు నవోత్తేజం కలిగిస్తుంది. మీ చర్మాన్ని, పొంకంగా, ఆరోగ్యంగా, యవ్వనంగా వుంచుతుంది. ఆమెకూ, అతనికీ, బేబీకి కూడా దాని సుకుమార రక్షణకు మించినది లేదు.




కాంతివంతమైన చర్మానికి నీవియా సాటిలేనిది

## రాజశ్రీ

9 వ పేజీ తిరువాయి

మూడు సంవత్సరాలపాటు ఆర్టిస్టుగా తన స్టూడియోలో ఉండేట్టు—మెయ్యప్పచెట్టియారు నెల జీతంమీద ఆమెను ఏర్పాటు చేశారు. ఆమెకు ఇంకా బాగా నృత్యం నేర్పించారు—నటన నేర్పించారు. హిందీ, తమిళం, ఉర్దూ భాషలు కూడా నేర్పించారు. బయట చిత్రాల్లో ఎక్కడన్నా పాల్గొనాలంటే వారి అనుమతి తీసుకోవాలి. ఆ ప్రకారంగానే ఆమె అనుమతి తీసుకొని—'సీతా రామాంజనేయ యుద్ధం' లో భరతనాట్యం చేసింది. రెండున్నర సంవత్సరాలపాటు పాటు ఏ. వి. యమ్.లోవున్న తర్వాత—ఆమెకు బయటి చిత్రాలు రాసాగాయి. ఆ సందర్భంలోనే ఆమె—స్టూడియోనుంచి బయటకు వచ్చేసింది.

తర్వాత రాజశ్రీకి చాలా అవకాశాలు వచ్చాయి. 'బండరాముడు', 'భక్త శబరి', 'నిత్యకల్యాణం పచ్చ తోరణం, 'మగవారిమాయలు', 'అపూర్వ చింతామణి', 'సతీ సులోచన', 'రమాసుందరి', 'కృష్ణ కుచేల', 'స్వర్ణగౌరి', 'దక్షయజ్ఞం', 'ఆరాధన' 'మహామంత్రి తిమ్మరుసు', 'పెళ్లితాంబూలం', 'పెళ్లి కానిపిల్లలు', 'నువ్వా నేనా', 'మదనకామరాజుకథ' మొదలైన తెలుగు చిత్రాలలోనూ, 'పణం పందియిలే', 'నిశ్చయ తాంబూలం', 'తెనల్ వీశువ్' 'శంగమలదీవు', 'సియా నానా' తమిళ చిత్రాలలోనూ, 'ఆదర్శసతి' 'దశావతారాలు' 'ఆశాసుందరి' 'కణ్ తెరందినోడు' 'రత్నమంజరి' 'స్వర్ణగౌరి' 'కరుణయే కుటుంబిద కణ్ణు'—వగైరా కన్నడ చిత్రాలలోనూ ఇంతవరకూ ఆమె నటించింది. ఈ చిత్రాల్లోని 'శంగమలదీవు' తమిళచిత్రంలో ఆమె నాయికి పాత్రను ధరించింది.

ప్రస్తుతం రాజశ్రీ 'ఆశాజీవులు', 'తల్లీ బిడ్డలు' 'అమరశిల్పి జక్కన' (తెలుగు, కన్నడం), ప్రాణ స్నేహితులు, హైదరాబాద్ మువీస్‌వారి సాంఘిక చిత్రం, 'కలయరశి', 'మగళే ఉన్ సమ్మత్తు' 'మక్కళ్ తిలగమ్' 'ఒరే కుటుంబం' 'కుబేరదీవు', 'శివ గంగ మహాత్మ్య'—చిత్రాలలో నటిస్తున్నది. ఇవి తెలుగు, తమిళ, కన్నడ చిత్రాలు. వీటిల్లో 'ఆశాజీవులు'లోనూ, 'మగళే ఉన్ సమ్మత్తు' లోనూ ఆమె నాయకి పాత్రలు ధరిస్తున్నది. ఇవికాక 'ఉలజ్ గయేనైన్' అనే హిందీ చిత్రంలోనూ, ఉదయా స్టూడియోస్‌వారి మలయాళం చిత్రంలోనూ కూడా ఆమె నటిస్తున్నది.

రాజశ్రీ చప్పున పైకి వచ్చిన నటీమణులలో ఒకతె. దానికి కారణాలు ఏమిటంటే—ఆ అమ్మాయి ఏ పాత్రనయినా ధరించటమూ, ఏ భాషనయినా అవలీలగా మాట్లాడటమూనూ! పైగా ఆమెకు నృత్యం వచ్చును. వర్ధమాన తారలలో బాగా 'బిజీ'గా కనిపించేతార రాజశ్రీ. ఆమెకు ఈత, సైకిలు త్రొక్కటమూ, కత్తి యుద్ధమూ, గుర్రపు స్వారీ వంటి విద్యలు కూడా తెలుసును.

రాజశ్రీ చదరంగం బాగా ఆడుతుంది. ఆట లంటే చాలా ఇష్టం. ఆమధ్య గోల్డెన్ స్టూడియోలో 'తారల రోజు' జరిగింది. ఆనాటి వేడుకలలో పరుగు పందెంలో రాజశ్రీకి ప్రథమ బహుమానం వచ్చింది మరి!

—'సు' ★



రాజశ్రీ — ఫొటో: రూపం.



కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

"మేల్ మాయిల్ మందు

వల్లరంపు, ఎర్రరంపు పొడలు, దద్దుర్లు, గజ్జి, మరియు చెప్పనీగు వ్యాపించి నంగుంచే ఏర్పడు విసుగు పుట్టించు రణములు మొదలగు

దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి

— వివరములకు —

సిద్ధ డాక్టర్ కే. టి. కృష్ణమూర్తి ఆచారి & సన్సు

5/22, మేల్‌మాయిల్, (P. O.) N. A. Dt.

వ్రాయునప్పుడు వ్రాత ఆరినపిమ్మటనూ మెరయుచుండుటకు

కృష్ణవేణి సిరా





డాక్టరు జాన్సన్సు

చవనామృతము

అందరికి టానిక్కు.

బాలరక్ష

పిల్లల ఆరోగ్యముకు

ఏజంట్లు: లక్ష్మీనారాయణకంపెనీ

కాకినాడ.

కోరువార్కి సూచీపత్రములు పంపుదుము.

★

స్టాకిస్టులు కావలెను

★

లక్ష్మీనారాయణ కంపెనీకి వ్రాయండి.

అమెరికన్ మోడల్ (లైసెన్సు అనవసరం)

ఆటోమాటిక్ 50 తోటాల పిస్టల్



50 తోటాలఆటోమాటిక్ డయల్ గలది. పెద్ద ధ్వనితో క్రూర మృగములకు దొంగలకుభయంకలిగించును. శత్రుభయంనుండి తప్పించుకొనుటకు, సినిమా, డ్రామాలకు ఉపయోగకరమైనది. ధర : నెం. 222 రు. 9/50. నెం. 333 రు. 12/50. తోలుకేసు రు. 3/- 100 తోటాలు ఉచితం. అదనపు తోటాలు 100కి రు. 4/-వి.పి.పి. ఛార్జీలురు. 2 అదనం. ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను.

KUBER &Co. (PA) P.B.No.1268 Delhi-6

స్లోన్స్ బామ్ వాడి నొప్పిని వెంటనే పోగొట్టుకోండి




స్నాయువుల బెణుకులు, మెడ పట్టులు మరియు వీపు నొప్పులు, కీళ్ల ఉబ్బులు నాడీవ్యాధి మరియు నడుమునొప్పి మొదలగు నొప్పులకు నొప్పిగా ఉన్నచోట్లల్లా కొంచెము స్లోన్స్ బామ్ రాయండి. తక్షణమే దాని ఉపశమనము కూర్చే వేడి లోపలికి వ్యాపించి నొప్పిగా ఉన్న చోటుకు శుభ్రపరచే రక్తము క్రొత్తగా ప్రవహించుటలో సహాకరించును. వెంటనే ఉపశమనము కలిగించే ఒక స్లోన్స్ బామ్ సీసాను ఎల్లప్పుడూ యింట్లో ఉంచుకోండి.

వాతరోగము * బెణుకులు * స్నాయువుల నొప్పులకు

వార్నర్-లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపింపబడినది).

తా నిశ్చయమ్మై కొంత మథన బయలుదేరింది.

రామానుజుని అనుచరులలో కొందరు బ్రహ్మచారులు. చాలా కాలం బ్రహ్మచర్యవ్రతం నిర్వర్తించిన పిమ్మట గాని సన్యాస దీక్ష లభించదు. మరి కొందరు గృహస్థులు. వారెవ్వరు మఠంలో నివసించరు. మరికొందరు సమస్తము పరిత్యజించి సన్యాసం స్వీకరించిన యతీశ్వరులు. ఇక మఠానికి వచ్చిపోయే శ్రీరంగ పౌరులలో చాలమంది సదాచారతత్పరులయిన సజ్జనులు.

మొట్టమొదట రంగనాయకుని పుట్టుపూర్వోత్తరాలేవి వారెవ్వరికీ తిన్నగా తెలియలేదు. కాని క్రమక్రమంగా అతనిని గూర్చిన యథార్థ విషయాలు కొన్ని కొంతవరకు విస్పష్టంగా తెలిశాయి. వేషభాషలనుబట్టి అత డెవరో సామాన్య కర్షకుని కుమారుడని వా రూహించుకొన్నారు. ఆనాటికానాటికి నిచుళాపురనుండి శ్రీరంగం వరకు పాకి వస్తున్న పుకారులవల్ల తా మూహించినవి యథార్థాలే అని వారందరు ధ్రువపరుచుకొన్నారు. ఇక హేమసుందరి అతని భార్య కాదనీ, నిచుళాపురంలో పేరెన్నికగన్న వారాంగన శృంగారమంజరి పెంపుడు కుమార్తె అనీ కనిపెట్టడాని వారి కెంతోకాలం పట్టలేదు. బాహాటంగా ఆ వేశ్య నింట పెట్టుకొన్న అటువంటి మోటుమనిషి యెడల రామానుజుల కంతటి ఆత్మీయత ఏర్పడడం శిష్యులలో కొంతమంది కేమాత్రము సరిపడలేదు.

మఠంలో నివసిస్తున్న అంతేవాసులలో దాశరథి రామానుజుని కతి సన్నిహితుడయిన బంధువు. తర్క వ్యాకరణాది శాస్త్రాలారింటితోబాటు ద్రావిడ వేద పాశురాల రహస్యాలామూలాగ్రంగా మథించిన మహామనిషి. అత డంతగా పొడగరి కాదు. రవంత హ్రస్వాకృతి. దృఢశరీరుడు. సంపెంగవంటి సమున్నత నాసిక కిరువైపుల అమర్చినట్లున్న గుండ్రని నేత్రాలలో గట్టి పట్టుదల, నిరంతర కార్యదీక్ష కొట్టవచ్చినట్టు స్ఫురిస్తాయి. మఠంలో నివసిస్తున్న శిష్యు లందరిలోను చిన్న అయినా ఒక్కొక్కప్పుడు రామానుజు లతనితో పాశురాల వ్యాఖ్యానాలపై చర్చ సాగిస్తున్నప్పుడు పెద్దలు కొందరు ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో ఆలకిస్తూ ఉంటారు. మఠం చుట్టు ఉన్న పూదోట సంరక్షణం ఆచార్య సందర్శనార్థం వచ్చిన అతిథుల ఆదరణ అతని దైనందిన విధికృత్యాలు. కాని రామానుజుని పరిచర్యపై దాశరథి కెనలేని మక్కువ. అతని వయస్సింకా నాలుగు పదు లతిక్రమించలేదు. కాని ఇంచుమించుగా ఇరవై సంవత్సరాలకుపూర్వమే సన్యసించి రామానుజ యతీశ్వరుని అడుగుజాడలననుసరించాడు.

ఇటీవల హేమసుందరీ రంగనాయకుల యెడల ఆచార్యుని అత్యద్భుత వాత్సల్యం పరిశీలించినకొద్దీ దాశరథికి ఆయన జీవితపథంలో చాలాకాలంక్రితం సంఘటిల్లిన ఒక విషాదమయ సన్నివేశం జ్ఞప్తికి వచ్చింది. అది సంస్మరించగానే దాశరథి విలోచనాంతాలలో వేడివేడి కన్నీటిబిందువు లావిర్భవించాయి. అది ఆచార్యుని ధర్మపత్ని తంజమాంబ మనుగడలో ఎదురుపడిన దుర్భర దుఃఖ సంఘటన.

రామానుజుడు అప్పటికింకా సన్యసించలేదు. తంజమాంబ శీలవతి; సౌందర్యవతి. పట్టి అమా

# విశాల నేత్రాలు

11—వ పేజీతరువాయి

యకురాలు. భర్తమాట కెన్నడు ఎదురాడని సరసు సాధ్వి. కాని ఆచారాల యెడల ఆమె కెనలేని పట్టుదల. అభినివేశము. అంతటి వెర్రి చాదస్తంకూడదని రామానుజుడు ఒకటి రెండు మారులు కొంచెం గట్టిగానే హెచ్చరించాడు. అప్పటినుండి ఆమె భర్త ఆనతి అక్షరశః అనుసరించవలెనని నిశ్చయించుకొన్నది. కాని తీరా ఆచరణలో మాత్రం పుట్టింట, అత్తవారింట తాత ముత్తాతల-కాలం నించి అనూచానంగా అనుసరిస్తున్న సదాచార సంప్రదాయా లోకించుకయినా అతిక్రమించలేకపోయింది.

కాంచీపూర్ణుడు కాంచీనగరంలో వరదరాజస్వామి పరమ భక్తాగ్రణి. సామాన్యుల దృష్టిలో దేవాలయంలో స్వామి మూర్తి కేవల శిలాప్రతిమవలె గోచరించవచ్చును. కాని కాంచీపూర్ణునికి మాత్రం వరదరాజస్వామి సదాజాజ్వల్యమానమయినచైతన్యంతో తొణికిసలాడుతున్న ప్రత్యక్ష దైవతము! తెల్లవారుజాము మొదలుకొని రాత్రివరకు వరదుని పరిచర్యా దృష్టి తప్ప కాంచీపూర్ణుని కింకొక ధ్యాస లేదు.

రాజు: ఇంతకీ సరళ నిన్ను మానేసి మీ మావయ్యను పెళ్లాడిం దెందుకుటా?

రావు: ఎందు కేమిటీ? కర్మ. నా మావయ్య లక్షాధికారి అని నేనే చెప్పానామెకు.

ఎస్. జగన్నాథం, (హైదరాబాద్)

ఆ భక్తాగ్రణి పొద్దుటివేళ కొంచెం ఎండ ముదరగానే స్వామి కేమయినా అసౌఖ్యం కలిగినదేమో అని గజగజ వణికిపోయేవాడు! ఎంతో అడకువతో వింజామరతో సేవిస్తూ ఏకాగ్రదృష్టితో స్వామి ముఖంవైపవలోకించేవాడు.

ఆ పరమభాగవత శిఖామణిని సందర్శించినప్పటి నించి ఆయన ముఖతః అష్టాక్షరీ మంత్రం స్వీకరించవలెనని రామానుజుని ఎడదలో విపరీతమయిన తహతహ విజృంభించింది. అంతేవాసిగా స్వీకరించి అనుగ్రహించవలసినదని అనేక పర్యాయాలు పాదాలపై వాలి ప్రాధేయపడ్డాడు అయినా కాంచీపూర్ణుడా ప్రార్థన ఆలకించనట్టే మాట్లాడ కూరుకొన్నాడు. అంతేగాని ఎన్నడు అవునని కాని, కాదని గాని ప్రతి సమాధానం చెప్పలేదు. అయినా రామానుజుడు తన అభినివేశం విడిచిపెట్టలేదు. మాటిమాటికి అదే పనిగా పాదాలపై వాలి బ్రతిమాలుకొన్నాడు. ఆవిధంగా మరికొంత కాలం గడిచిన పిదప కాంచీపూర్ణునికి తన మౌనముద్ర విడిచిపెట్టక తప్పలేదు.

'నాయనా! మీ పూర్వులందరు వేదవేదాంగ పారంగతులైన పరమ బ్రాహ్మణ్యులు. మీ నాయనగారు ఆసూరి కేశవ మనిషి నిరంతర వైదిక కర్మ నిష్ఠాగరిష్ఠులు. ఇక మీ మాతామహులమాట నేను వేరుగా వక్కాణించ నక్కరలేదు. వారి వంశంలో అవతరించిన మహాసాధ్వి కాంతిమతి కడుపున ఫలించిన నిర్మల ముక్తామణివి నీవు! ఇక నేనో శూద్రుడను. కనక నీకు మంత్రోపదేశం ప్రసాదించరాదు. అయితే అనతికాలంలోనే అర్హులయిన ఆచార్యవర్యు లొకరు నీకు అష్టాక్షరీ మంత్రం యథావిధిగా అనుగ్రహించగలరు! సందేహంలేదు. తప్పక నీ కోరిక నెరవేరగలదు. అంతవరకు మాత్రం కొంచెం ఓరిమి వహించక తప్పదు.'

అయినా రామానుజుడు తన గట్టి పట్టుదల విడిచిపెట్టలేదు. శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన ఆచార్య పూరుషు లొక్కొక్కప్పుడు స్వీకరించబోయే శిష్యు లెటువంటివారయినా కేవలం నిర్దాక్షిణ్య దృష్టితో నిశితంగా పరీక్షిస్తూ ఉంటారు. కాంచీపూర్ణు లదేవిధంగా తన అభినివేశము, ఆసక్తి పరిశీలిస్తున్నారని రామానుజుడనుకొన్నాడు. అందుచేత ప్రగాఢ భక్తితో ఆయన భుక్తశేషం స్వీకరించి ఆరగించి అష్టాక్షరీ మంత్రోపదేశానికి తగినంత అర్హత గడించుకోవాలని నిర్ణయించుకొన్నాడు. ఒకనా డెంతో అడకువతో దోసిలి కట్టి నిలిచి తన గృహానికి విచ్చేసి ఆతిథ్యం స్వీకరించవలసినదని వేడుకొన్నాడు. కాంచీపూర్ణుడు మొట్టమొదట దాని కనుమతించలేదు. కాని రామానుజుని అనురోధంవల్ల చిట్టచివరి కంగీకరించక తప్పలేదు.

తంజమాంబ మడికట్టుకుని తన వంట పూర్తిచేసింది. కాని కాంచీపూర్ణు డెంత సేపటికి వారి ఇంటికి రాలేదు. క్రమక్రమంగా రెండు జాముల పొద్దు తిరిగింది. కాంచీపూర్ణుని ఆలస్యాని కేమి కారణమో రామానుజుని కవగాహన కాలేదు! స్వయంగా వెళ్లి వెంటబెట్టుకొని రావలెనని బయలుదేరాడు. మరికొంతసేపటికి వేరొక వీధి మార్గంలో ఆ భక్తాగ్రణి రామానుజుని గృహంలో ప్రవేశించాడు. వస్తూనే అన్నం వడ్డించవలసిందని తొందర పెట్టాడు. త్వరలోనే తరలిపోయి వరదరాజస్వామిని సేవించుకోవలసిఉన్నదని మాటిమాటికి రెట్టించాడు. ఒక క్షణమయినా ఆలస్యం అయితే వెంటనే తిరిగి వెళ్లిపోక తప్పదని గట్టిగా హెచ్చరించాడు.

తంజమాంబ కా పరిస్థితిలో ఏమి చెయ్యడానికి పాలుపోలేదు. భర్త రాకమునుపే తొందరగా అన్నం వడ్డిస్తే ఏమి అపచారమో! వడ్డించకపోతే కాంచీపూర్ణు డిక ఒక క్షణమయినా వేచిఉండేటట్టు కనబడలేదు! ఆయన తిరిగి వెళ్లిపోతే అదేమి మహాపరాధమో! మరి గత్యంతరం కానలేక తంజమాంబ తలవంచుకొని ఉట్టిపడుతున్న అడకువతో కొంచెం తటపటాయించింది:

'వా రిప్పుడే మీకోసం వెళ్లారు. మీరు కనబడక పోయేసరికి వాడవీధులన్ని గాలిస్తున్నారో ఏమో! లేకపోతే ఈపాటికి తిరిగి రావలసినదే! ఏమయినా వచ్చే వేళయింది. ఇక ఆట్టే ఆలస్యం కాదు.'

కాని కాంచీపూర్ణు డిక వేచిఉండలేక వాదు కూడదని పట్టు పట్టడంవల్ల మరి తిరస్కరించలేక వంటఇంటి కవతల చావడిలో ఒక వివిక్త ప్రదేశంలో విస్తరి వేసి వడ్డించింది. వంటకా లొక

# దగ్గు మరియు రొంపనుండి నిజమైన స్వస్థత పొందుటకు





## సిరోలిన్ వాడండి

దగ్గు లేక రొంపను అశ్రద్ధచేయకండి. సిరోలిన్ వాడి నిరపాయముగా, శీఘ్రముగా నిజమైన స్వస్థత పొందండి. సిరోలిన్ దగ్గును ఆపుటయేకాదు. అది మీ దగ్గుకు మూలకారణమైన హానికరమగు సూక్ష్మ క్రిములను నశింపచేయును; కఫమును నుసను పోగొట్టును. సిరోలిన్ ఎంత కష్టమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత చేకూర్చును. దాని పనితనమును బట్టియు రుచిని బట్టియు సిరోలిన్ కుటుంబములోని వారి అందరి అభిమాన పాత్రమైయున్నది. పిల్లలకు సిరోలిన్ అంటే ఎంతో ప్రీతి.




మీ యింట్లో సిరోలిన్ తప్పక ఉంచండి

'రోష్' తయారు  పోల్ డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

టొకటే తెచ్చి వడ్డింటున్నా సావకాశంగా భోజనం చేయవలసినది బ్రతిమాలుకొన్నది. కాని కాంచీపూర్ణుడు తొందర తొందరగా తన భోజనం ముగించుకొన్నాడు. తిన్న విస్తరి తానే ఎత్తి దూరంగా పారవేసి, గోమయంతో ఆ ప్రదేశం అంతా జాగ్రత్తగా అలికి శుభ్రంచేసి తిరిగి వరదరాజస్వామి సన్నిధికి వెళ్ళిపోయాడు! తంజమాంబ కాంచీపూర్ణుడు తినగా మిగిలిన వంటకాలలో రవంతయినా మిగలనీయ లేదు. అవి అన్నీ పనిమనిషికిచ్చివేసింది. తిరిగి స్నానం చేసి, మడి కట్టుకుని అతి త్వరితంగా భర్తకోసం వంట ప్రారంభించింది. అంతలోనే రామానుజుడు తిరిగివచ్చి భార్యముఖతః జరిగిన వృత్తాంతం యావత్తూ విని మరి తన కన్నులే నమ్మలేక నిశ్చల పాషాణ ప్రతిమలా నిర్ఘాంతపడి రెండు చేతుల తోను తల గట్టిగా పట్టుకుని దుర్భర మానసిక వ్యథతో అట్టుడికిన ట్టుడికిపోయాడు:

'అయ్యో! నేనీవేళ ఆ పరమ భాగవతోత్తముని పాదాల సాన్నిధ్యంలో భుక్త శేషం ఆరగించవచ్చు నని ఎంతయినా ఉవ్విళ్ళూరిపోయానే! ఎంతటి ఘోరాపచారం జరిగినదీవేళ! అయ్యో! నేనెంతటి దురదృష్టవంతుడనో కదా!'

రామానుజుడు మరికొంత సేపటివరకు లోలోపలే కుమిలి కుమిలి పలవించాడు. అంతకుమునుపు తంజమాంబ కాయన సంకల్పం రవంతయినా తెలియలేదు! అయినా తన తప్పిదం మన్నించవలసినదని ఉప్పొంగుతున్న డగ్గుత్తికతో దోసిలికట్టి వేడుకొన్నది. కాని రామానుజు డామె విజ్ఞప్తి ఆలోచించినట్లే గోచరించలేదు. అంతేకాదు! ఆ నాటి కిక అన్నపానాలే ముట్టలేదు!

ఇంకొకమారు మంగలి ఒకడు రామానుజునికి అభ్యంగనస్నానం చేయించడం కోసం వచ్చి వాకిట నిలుచున్నాడు. వానివైపు చూడగానే రామానుజుని నిండు గుండె ద్రవించింది! అన్నమో! రామచంద్రా! అంటున్నది ఆ మంగలి దీనాతిదీన క్షీణదృష్టి! 'గడిచిన రెండు మూడు నాళ్ల నుండి ఒక్క అన్నం మెతుకయినా నోట పెట్టుకోలేదేమో!' అని ఎంతో జాలిపడ్డాడు రామానుజుడు! వెంటనే గృహిణిని పిలిచి ఇంత అన్నం పెట్టవలసినదని ఆదేశించాడు. అప్పటికే మడి కట్టుకుని వంట ప్రారంభించిన తంజమాంబ—

'ఇప్పుడే నేను వంట ప్రారంభించాను! ఇంతలో అన్నం ఎక్కడినించి వస్తుంది?' అన్నది. అప్పైన పోనీ కొంచెం చద్ది అన్నమైనా ఉంటే పెట్టమని రామానుజు డన్నాడు. తంజమాంబ అది విని రవంత విసుగుదలతో 'మన ఇంట చద్ది ఆరగించేవా రెవరున్నారు? అది మాత్రం ఎక్కడినించి వస్తుంది?' అని తన పనిపాటలలో మునిగి పోయింది. రామానుజు డామాట కేవిధంగాను ప్రత్యుత్తర మీయలేదు! వంట ఇంటి లోలోపలికి వెళ్ళి పాత్రలన్ని మిక్కిలి మెళకువతో పరిశీలించాడు. ఎక్కడో ఒక గిన్నెలో ఆ మంగలికి చాలినంత అన్నం కనబడింది. వెంటనే ఆ క్షుధార్తుని కది పెట్టినపిమ్మట తన అభ్యంగనస్నానం ముగించుకొన్నాడు. అంతేకాని గృహిణి నొక పల్లెత్తుమాటయినా అనలేదు!

మరికొంత కాలం గడిచిన తరవాత రామానుజ

# విశాల నేత్రాలు

నికి మరింతగా మనస్తాపహేతువయిన ఇంకొక సంఘటన జరిగింది.

అలాగలాగ మరి కొన్నాళ్ళు గడిచిన తరవాత రామానుజుడు మహాపూర్ణుడన్న శ్రీవైష్ణవాచార్యుని వద్ద అష్టాక్షరీ మంత్రంతోపాటు నాలాయిర ప్రబంధమన్న నాలుగు వేల ద్రావిడ వేద పాశురాల పరమరహస్యాలు విశేషార్థాలతోబాటు ఆమూలాగ్రంగా అధ్యయనంచేసి ధన్యుడ నయినానని ఆనందించాడు. ఆ సమయంలో ఆచార్యుడు, అంతేవాసి రామానుజుడు కాంచీపురంలో ఒకే గృహంలో నివసించే వారు. మహాపూర్ణు డప్పటికి బాగా పెద్దవా డయి నాడు. మిక్కిలి వృద్ధురాలయిన ధర్మపత్ని తక్క ఆయన కిక నా అన్నవారెవరు లేరు! అయితే రామానుజుడు ఆయన కేవిధమయిన కొదవ కలగనీయ లేదు. కన్న కుమారునివలె అనుదినము నిరంతర భక్తిశ్రద్ధలతో పరిచర్య లాచరించాడు.

ఒకనాటి ఉదయం ఆచార్య శిష్యుల గృహిణు లిద్దరు తాళ్లతో మూతులు బిగించిన చిన్న చిన్న

ఆమ్రేడితమంటే అర్థం చెప్పి అది వాడుతూ ఒక వాక్యం రాయమన్నాడు మాష్టారు.
"అయ్యో! అయ్యో మాకర్మ! ఇంకా గంట కొట్టడేం!" ఇది ఓ కుర్రాడు వ్రాసిన వాక్యం.
శ్రీరామ్ (ఢిల్లీ)

బిందెలతో తమ ఇంటి కల్లంత దూరంలో ఉన్న బావిలో నీళ్ళు తోడుకొంటున్నారు. ఆ సమయంలో మహాపూర్ణుని పత్ని బిందెలో నీళ్ళ కొంచెం తొణికి రెండు మూడు చుక్కలు తంజమాంబ మడి నీళ్ల బిందెలో పడ్డాయి. దానితో ఆమె తన బిందెలో నీళ్ళొక్కచుక్కయినా మిగలకుండా నేలమీద గుమ్మరించింది. ఆచార్యపత్ని వైపు చురచుర చూసి పరుషస్వరంతో రుసరుస లారంభించింది:

'ఏమమ్మా! అంత బొత్తిగా కన్ను మిన్ను కానకపోతే ఎలాగ! చూడు! నీ మూలాన కష్టపడి తోడుకొన్న బిందెడు నీళ్ళ నేలపాలైపోయాయి! గురుభార్య వయినంతమాత్రాన గుండెమీద కుంపటిలా కూర్చోవాలా! కాస్త మా నాయనగారు ఆహితాగ్ను లన్నమాటయినా గమనించకపోతే ఎలాగ? ఇంతకీ నిన్ననవలసిన పని ఏమి ఉంది? అత్తింట అడుగు పెట్టినప్పటినించి మా ఆచారాలు, సంప్రదాయాలు అన్ని మంటకలిసి పోతూనే ఉన్నాయి. ఇప్పుడిక ఏమనుకుంటే మాత్రం ఏమి లాభం! నుదుటి మీది రాత ఇలాగ ఉన్న తరవాత?'

వాస్తవానికి మహాపూర్ణుని భార్య చేసినది అంతగా ఎలుగెత్తి ఉట్టంకించదగినంత పెద్ద తప్పిదం కాదు. కాని తంజమాంబ వంటి సదాచార శీల దృష్టిలో అది గొప్ప అపరాధమే! అందుచేత ఆ పండు ముత్తయిదువ కొంతవరకు ఏదోవిధంగా సమాధానపడి తన పొరపాటు మన్నించవలసినదని వేడుకొన్నది. తిరిగి నీళ్ళు తోడుకోవలసినదని బ్రతిమాలుకొన్నది. అయినా తంజమాంబ ఏమాత్రము శాంతించలేదు. వట్టి బిందె మాత్రమే బుజాన పెట్టుకుని గిరుక్కున వెనక్కి తిరిగివెళ్ళిపోయింది. ఆ ధోరణి గమనించి మహాపూర్ణుని భార్య ఎంతో ఆందోళనపడి భర్తతో ఆనాడు బావి దగ్గిర జరిగిన సంఘటన అంతా పూసగుచ్చినట్లు చెప్పింది. మహాపూర్ణు డదివిని శిష్యుని కది తెలిసిన పక్షంలో ఎంతో నొచ్చుకోగలడనీ, ఆ తరవాత తంజమాంబ ఎడల అతని కెంతయినా వైమనస్యం కలుగవచ్చు ననీ భయపడి వెంటనే అక్కడినించి కదిలి వేరొక చోటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు. తిరుపతి, కాంచి, శ్రీరంగము ఆళ్వారులనాటినించి శ్రీవైష్ణవుల కత్యంత పునీతములయిన పుణ్య క్షేత్రాలు. అందుచేత ఆ మరునాడే భార్యతో కలిసి మున్ముందుగా తిరుపతి సేవించుకొని అనతికాలం లోనే శ్రీరంగం చేరుకొన్నాడు. ప్రయాణానికి పూర్వం చూచాయగా నయినా రామానుజునికి తన సంకల్పం తెలియనీయలేదు. మహాపూర్ణునికి అంతేవాసి యెడల గల ఆత్మీయదృష్టి అట్టిది!

ఆచార్యు డకస్మాత్తుగా కంచి విడిచివెళ్ళిన తరవాతగాని రామానుజుని కా విషయం తెలియ లేదు. వరదరాజస్వామిని సేవించుకొని మిట్ట మధ్యాహ్నంవేళ ఇంటికి తిరిగివచ్చిన తరవాత వృద్ధు లయిన ఆచార్యదంపతు లిద్దరు ఇంట కనిపించక పోయేసరికి అతని కది ఒక పెద్ద పిడుగుపా టయింది! తంజమాంబ తన మాటలవల్ల అంతటి విడ్డూరం జరగగలదని కలలో నయినా ఊహించి ఉండలేదు. అందుచేత ఆమె కా సంఘటన ఎంతో మనస్తాపం కలిగించింది. 'గుండెమీద కుంపటి' వంటి మాట తన నోటినుండి వెలువడినందు కెంతయినా పశ్చాత్తాప పడింది. కాని ఏమి లాభం! అంతలో భర్త వచ్చి ఆ విషయం ప్రశ్నించాడు. ఆమె జరిగిన సంగతి అంతా యథాతథంగా చెప్పి వేసింది. తన తప్పిదం మన్నించవలసినదని తిరిగి పరిదీన స్వరంతో బ్రతిమాలుకొన్నది. కాని రామానుజు డిక లోలోపల నుండి భగ్గుమని ప్రజ్వలించిన తీవ్ర క్రోధావేశం నిగ్రహించుకోలేక శక్తికొద్ది చేతితో శిరస్సు మొత్తుకొన్నాడు. చెక్కిళ్లపై ప్రవహిస్తున్న కవోష్ణ బాష్పాలతో తిరిగి తిన్నగా వరదరాజస్వామి ఆలయం వైపు వెళ్ళిపోయాడు. మరి ఆనాడిక భార్య ముఖంవైపే చూడలేదు.

అప్పటినించి తంజమాంబ భర్తయెడల మిక్కిలి భయభక్తులతోనే మసులుకొన్నది. కాని ఆమెమీద తలవనితలంపుగా పెద్ద పిడుగు పడిన ట్లొక ఘోరాపద విరుచుకుపడింది.

ఆ మరునాడు కూడా రామానుజు డామెతో సంభాషించలేదు. అందుచేత తంజమాంబ భరించ రాని దుఃఖావేశంతో కుంగి కృశిస్తున్నది. అప్పైన కొంచెం ముసురు పట్టడంవల్ల ఎన్ని విధాల ప్రయత్నించినా పొయ్యి రాజుకోలేదు. ముఖం




నిజం, ఈ క్రొత్త సబ్బు చాలా
బాగుగా శుభ్రపరుస్తుంది
ఆ తేడా నేను కనిపెట్టేను.

అది ఏ ఇతర సబ్బులకంటె
చాలా కాలము నిలవుంటుంది,
అంతకంటె ఇంకేమి కావాలి.




జ్ఞాపకముంచుకోండి, అది **ఝులక్**. ఏకుమరీ ఎక్కువ
ఖామీ ఏమిటంటే దానిని బజార్లలో అమ్మకము చేయుచున్న
వారు: దూరదర్శక సంస్థ. **గోద్రెజ్** సబ్బులలో ఉత్తమ నామము.

**ఉచితం:** ప్రతి ఝులక్ సబ్బుతో
ఒక మనోహరమైన దువ్వెన

ZA.3.10/62 (20cm × 3) TEL.

# విశాల నేత్రాలు

కుంకుమరాశిలా ఎఱ్ఱబడింది. కాటుక కన్నీరు చెక్కిళ్లపై ధారకట్టి ప్రవహించింది. ఇంటినిండా దట్టంగా పొగ అలుముకొన్నది. శుభమల్లే ఈవేళ ఇదేమి అపశకునమో మరి ! అని తంజమాంబ ఎంతయినా మథనపడింది. రామానుజుడు తెల్లవారకమునుపే లేచి స్నానార్థమై స్వామి పుష్కరిణివైపు వెళ్లిపోయాడు. ఇంచుమించుగా రెండు జాముల వేళ అతిక్రమిస్తున్నా అత డింటికి చేరుకోలేదు. తంజమాంబ ఆ తలపోతతో లోలోపల కుమిలి కుమిలి దుఃఖిస్తున్నది. అదే సమయంలో పొయ్యి అదే పనిగా ఊదడంవల్ల నిప్పు పెరసొకటి ఎగిరి కుడి కంటిలో పడింది.

అంతలోనే ముక్కాలి ముదుసలి బ్రాహ్మణు డొకడు ఆతిథ్యంకోసం తలుపుతట్టి గొంతెత్తి ఆక్రోశించాడు. అసలే పొయ్యి రాజుకోక పొద్దుటినించి సతమతమవుతున్న తంజమాంబ అదివిని 'బాబూ! ఇదేమి కర్మమో గాని ఈవేళ ఎంతసేపటికి పొయ్యి రాజుకోవడంలేదు. నేటికి అగ్రహారంలో ఇంకొకరి ఇంటి కెక్కడికయినా వెళ్లండి !' అని అనునయ గద్గతస్వరంతో ఆదేశించింది. ఆ ముక్కాలి ముదుసలి ఉసూరుమని నిట్టూర్చి 'పోనీ, స్వామి దేవాలయంలో నయినా పట్టెడు ప్రసాదం లభించ గలదేమో' అన్న ఆశతో అటువైపు తరలిపోయాడు.

దేవాలయ సింహద్వారం దాటి లోపల అడుగు పెట్టగానే రామానుజు డాతని కెదురుపడి ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించాడు:

'ఇదేమిటి ! బాబూ ! ఇంత నీరసంగా కనిపిస్తున్నారు. ఇంతవరకు భోజనమే చెయ్యలేదా ఏమిటి ?'

రామానుజుడు అతనికి కొంచెం పరిచితుడు. అందుచేత ఆకటి చిచ్చు నిగ్రహించుకోలేని ప్రగాఢ గద్గదికతో తన యథార్థస్థితి వెల్లడించాడు:

'లేదు నాయనా! నిన్న రాత్రి కూడా పచ్చి మంచి నీళ్లతోనే కాలక్షేపం చేశాను. ఏమిచెయ్యను? ఇప్పుడిప్పుడే మీ ఇంటికి వెళ్లాను. పిలుపడదన్నారు. మరి గత్యంతరంలేక .... '

రామానుజు డా ప్రతి సమాధానం విని రెండు మూడు నిమిషాలపాటు తనలో తానేదో ఆలోచించుకొన్నాడు:

'అదేమి మాట! ఎందుకు సిలుపడదు! మా ఇంట భోజనం చేసి వెళ్దురుగాని ఉండండి! ఇప్పుడే వస్తాను.'

ఒక అరగడియలోగానే తిరిగి రామానుజు డొక తాళపత్ర శుభలేఖతో తిరిగి అక్కడికి వచ్చి వచ్చి కొబ్బరి బొండము, పంచెల చాపు, చీర, పసుపు కుంకుమ ఆయన చేతిలో ఉంచాడు. మెల్లదిగా బ్రతిమాలుకొన్నాడు:

'వెంటనే వీటితోబాటు ఈ శుభలేఖ తీసుకుని వెళ్లి మా ఇంటిలో ఇవ్వండి ! ఇది తిరుచానూరినించి వచ్చినదని చెప్పండి. కొంచెం పని చూసుకుని త్వరగానే నే నక్కడికి వస్తున్నానని చెప్పండి ! మన మిద్దరము కలిసి భోజనం చేద్దాము !'

భోజనంమాట వినగానే ఆ వృద్ధ బ్రాహ్మణునికి


ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి




## హ్యూలెట్స్ మిక్స్చర్

### వాడి వెంటనే విముక్తి పొందండి




బిడ్డలను పోషించుకోడమేగాక ఇంటిపని కూడా చేస్తూ మీరు కష్టమైన రెండు బాధ్యతలను ఒకేసారి నిర్వహిస్తున్నారు. అలాంటప్పుడు అజీర్ణంవల్ల మీ దినచర్య చేసుకోలేక బాధపడటం దేనికి? హ్యూలెట్స్ మిక్స్చర్ తీసుకోండి. అది త్వరగా శాశ్వతమైన నివారణ నిస్తుంది. అది జీర్ణకోశం లోపలి భాగమున సురక్షకమైన పూతగా నేర్పడి అందలి చిరాకు కల్గించు ఆమ్లసారములను నిస్సారము చేసి ఆహారం సక్రమంగా జీర్ణమగుటకు తోడ్పడును

హ్యూలెట్స్ మిక్స్చర్ వల్లం జీర్ణాశయ బాధలకు కూడా చక్కగా పనిచేస్తుంది. అధికంగా విరేచనాలవుతుంటే నల్లమందు చేర్చిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను తీసుకోండి. హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి తోడ్పడును.

ఏ.జి. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
86/A నైనియప్ప నాయకన్ వీధి, మద్రాసు-3

JWT/CJH-1930

## లాభదాయకమైన లఘు పరిశ్రమ ప్రారంభించండి

"అధునాతన కుటీర పరిశ్రమలు" (తెలుగు) పుస్తకంలో లాభదాయకమైన వివిధ పరిశ్రమలు వున్నాయి. ఈ పరిశ్రమలలో వున్నవారు చక్కటి లాభాలను ఆర్జిస్తున్నారు. ప్రతి పరిశ్రమను గూర్చి సంక్షిప్తమైన వివరాలు. ముడి పదార్థాలు లభించే చోట్లు, ముడి పదార్థాల కొనుగోలుకు, వాయిదాల పద్ధతిన యంత్రాల కొనుగోలుకు ప్రభుత్వం యిచ్చే సహాయం — యిందులో వున్నాయి. లఘు పరిశ్రమలు ప్రారంభించ దలచుకున్న వ్యక్తుల సమస్యలకు తగిన పరిష్కార మార్గాలు యిందులో వున్నాయి. పుటలు 878, సుమారు 300 బొమ్మలు, ధర రూ. 13/– తపాలరుసుము రూ. 1·61· Phone: 229835·

**COTTAGE INDUSTRY, (WN-46), P. B. 1262, Jamuna Road, Delhi-6.**

## నాకాస్

నేటినుండి ఉబ్బసపు వ్యాధితో బాధపడ నవసరంలేదు. ఈ వ్యాధి నిర్మూలనకు గాను 30 సం॥ల పరిశోధనా ఫలితముగా లభ్య పరచుకొనబడి, పరమహంస క్రియలకు మూలికలతో తయారైన ఆయుర్వేదౌషధం. ఎంత మొండి వ్యాధికైనను తక్షణమే బాధ నివారింపజేయుటయే గాక కొంతకాలము సేవించిన తిరిగి చూపెట్టదు.

8 ఔ॥ రు. 3–75. పోస్టేజి ప్రత్యేకం.

ఇండియన్ మెడిసన్ హౌస్, విజయవాడ–2

సౌందర్య సీమ అంచులకు తేలిపోతారు

## "'హేజలైన్' స్నో" వాడండి



ఈ తేలికైన జిడ్డు లేని స్నో మీ ముఖమును మృదువుగా మనోహరముగా మరియు అందముగా ఉండేలా ఉంచుతుంది. "'హేజలైన్' స్నో" ముఖ వర్చస్సును పెంపొందించే వాటిలో ఎంతో సౌమ్యమైనది. దానిని పౌడరుకు అద్దుకొనే ముందు రాసుకోండి లేక దానిని రాసుకొని అందముగా ఉండండి.

"'హేజలైన్' స్నో" తరతరాలుగా సుందరాంగుల సౌందర్య సాధనం




బర్రోస్ వెల్‌కం ఉత్పత్తి



BWY-11-TEL

# విశాల నేత్రాలు

ప్రాణం లేచివచ్చింది. తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ తిరిగి రామానుజుని గృహంవైపు సాగిపోయాడు. ఆ శుభలేఖ చూడగానే తంజమాంబ పట్టరాని ఉల్లాసంతో ఉబ్బి తబ్బిబ్బయింది. అది ఆమె చెల్లెలి వివాహ మహోత్సవాహ్వాన పత్రిక. వెంటనే తంజమాంబను పుట్టింటికి పంపించవలసినదనీ, ఏమాత్రం వీలున్నా తప్పక ఆమెతో బయలుదేరవలసినదనీ ఆమె తండ్రి అల్లునిపేర వ్రాసిన శుభాహ్వాన మది.

తంజమాంబ ఎంతోకాలంనించి పుట్టింటి కొకమారు వెళ్ళవలెనని ఉబలాటపడుతున్నది. చెల్లెలి వివాహ మన్నమాట చెవిని పడగానే కొండంత సంతోషంతో వెంటనే ప్రయాణసన్నాహ మారంభించవలెనని నిశ్చయించుకొన్నది. అవిసె నూనెలో ముంచిన గుడ్డలే కట్టెలుగా వాడి అతి త్వరితంగా వంట ముగించుకొని అనుక్షణము భర్త రాకకోసం నిరీక్షించింది. రామానుజు డింటిలో అడుగు పెట్టగానే భర్తతోబాటు అతిథి కెంతో ఆదరంతో అన్నం వడ్డించింది. భోజనా లయిన తరవాత తనతో కలిసి పుట్టింటికి రావలసినదని ప్రాధేయపడింది. ఆ శుభసమయంలో నయినా తన తప్పిదాలు మన్నించవలసినదని తొణికిసలాడుతున్న డగ్గుత్తికతో బ్రతిమాలుకొన్నది. భర్త ముఖభంగిమలో ప్రసన్నత గోచరించగానే తనతోబాటు పుట్టింటికి రాగలడని ఎంతో సంబరపడింది.

కాని రామానుజు డార్ద్రహసితంతో తన అశక్తత వెల్లడించాడు:

'తిరుమల సేవించుకొంటున్న కాంచీపూర్ణులు నేడో రేపో తిరిగి ఇక్కడికి రానున్నారు. ఆ తరవాత ఆయన త్వరలోనే తిరిగి శ్రీరంగం వెళ్ళిపోతున్నారు. ఆయన స్వయంగా తా మిచ్చటికి విజయం చేస్తున్నామని కబురు పంపించారు. ఈ పరిస్థితిలో నాకేమి పాలుపోవడంలేదు! ఈయన నీకు నాకు సాక్షాత్తు తండ్రివంటివారు. వీరితో కలిసి ఈసారికి నువ్వు ఒక్కతెవే అక్కడికి వెళ్ళి బంధువు లందరిని చూసి రా! అత్తవారికి, మామగారికి నా నమస్కారాలని చెప్పడం మాత్రం మరిచిపోవద్దుసుమా! ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా రాలేకపోయానని చెప్పి మన్నించవలసినదని వేడుకో!'

తంజమాంబ తిరిగి బలవంతం చేసింది గాని ప్రయోజనం లేదని గ్రహించుకుని ఉసూరుమని నిట్టూర్చి భర్త పాదాలు రెండు కళ్ళ కద్దుకొని ఆ వృద్ధ బ్రాహ్మణునితో కలిసి పుట్టింటికి ప్రయాణమయింది. రెండెడ్లబండిమీద కాంచీపుర పొలిమేర వరకు వా రిద్దరిని సాగనంపిన తరవాత రామానుజు డుసూరుమని నిట్టూర్చి తిరిగి తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ మరునా డుదయమే లేచి వరదరాజస్వామిని సందర్శించి విరజా హోమం యథావిధిగా నిర్వర్తించి కాషాయాంబరధారణతో మనోవాక్కాయ కర్మల నిరంతరం నిగ్రహానికి చిహ్నమయిన త్రిదండంతో సన్యాసాశ్రమం స్వీకరించాడు. తన జన్మ తరించిందని అమందానంద భరితుడయినాడు. కాని శాస్త్రి కల్పించి లిఖించిన



ఉత్సాహానికి
హుషారుకు
కారణం!
రాగోలైన్


ఈ పుష్టికరమైన ఆహార పానీయమును
మీరుకూడా పుచ్చుకొని యెల్లప్పుడు
ఉత్సాహంగా వుండండి !!
ఫైన్ కెమికల్ వర్క్స్,
పి. బి. 71, మైసూరు-4

నిరాల సబ్బు
ఉతుకు పనిని సులభము చేయును
సమృద్ధియగు
నురుగు దర్శమూ అని



పొదుపు
ఎందుచేతననగా ఒకే ఒక్క-
బారుతో ఎక్కువ బట్టలు ఉతుకవచ్చును.
మేలురకము
అందులో శుభ్రముచేసే గుణము
యెక్కువగానుండుటచే
తెల్లబట్టలు మరింత తెల్లగాను, రంగు బట్టలు
ప్రకాశవంతముగాను చేయును.


తుంగభద్రా ఇండస్ట్రీస్ లి., కర్నూలు.
ASP/N-3

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు ప్రతి కలో ప్రచురిస్తూ ఉంటాయి.

హిందీ సులభంగా ఎలా నేర్చుకోవడం?




[illegible] కులు హిందీ ధారాళముగా మాట్లాడను, చదువను, వ్రాయను అత్యల్ప కాలంలో నేర్చుకొనుటకు వీలుగా అతిసులభమైన పద్ధతిలో, తేలికైన భాషలో విరచింపబడినది. వెల రు. 4-50 పోస్టు ఖర్చులు 0-85. వి. వి. జగన్నాథ్ కంపెని, 3, మునియప్ప మొదలివీధి, మద్రాసు-1.

# H. M. V. వారి "షెర్పా"

నాణ్యమైన 4 Speed "రికార్డు ప్లేయర్స్"

AC మరియు బ్యాటరీలతో లభించును
ధర. AC రు. 215/-; బ్యాటరీ రు. 185
(ఎక్సైజ్, స్థానిక పన్నులు అధికం)
మావద్ద L. P. & E. P. ఇండియన్/ఇంటర్నేషనల్ గ్రామఫోను రికార్డులు లభించును.

మాధవ & కో,
పార్కు రోడ్ _ విజయవాడ.1

## ఆదాయము కావాలంటే



ఇంటింటా కుట్టుపని నేర్చి మీ సొమ్ము ఆదా చేయండి. నేర్చుకొనుటకు ప్రత్యేక గ్రంథం-అందరు టైలర్లే రు. 5/- 266 పే. 180 బొమ్మలు, అందమైన ఫుల్ క్యాలికో బైండు. బేతాయింపు రు. 3-50. కత్తిరింపులు రు. 1/-. రహస్య బోధిని రు. 0-62 ఈ 4 తెలుగు. వి. పి. అదనము. జి. పున్నారావుచౌదరి, మోపర్రు, తెనాలి తా.

మీరు
# ఉబ్బసముతో బాధపడుతూ ఉంటే ఎఫాజోన్ వాడండి




తయారీ మరియు పంపకపు దారుడు:
జి.ఎల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి • కలకత్తా • మద్రాసు • ఢిల్లీ
JMEY-I-TEL

## RATNAM'S N-OIL
(పైపూతకు మాత్రమే)

అంగసరములు బలహీనతి చెంది. చిన్న దినచర్య తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి కలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం ఆర్డరు నకు రూ. 25.0 0 లు.
డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904)
[illegible]
వద్ద, హైదరాబాద్ -24 (ఆంధ్రప్రదేశ్)

స్థాపితం 1920
## రెడ్డి & కో. (రిజిష్టర్డు)
గోపాలపురం తూ. గో. జిల్లా
బొల్లి, మేహపొడ, మేహమచ్చలు మరియు సమస్త చర్మవ్యాధులకు ప్రత్యేక చికిత్స
శాస్త్రీయ ఆయుర్వేద ఔషధములు లభించును.
కేట్లాగు సలహా ఉచితం.

# విశాల నేత్రాలు

శుభలేఖతో తంజమాంబ నావిధంగా మభ్యపెట్టి పుట్టింటికి పంపించవలసివచ్చినందుకు లోలోపల ఇనుమిక్కిలిగా కించపడకపోలేదు. అయితే దైవ ప్రేరేపణ ఆ విధంగా పరిణమించినప్పుడు తా నిక చేయగలిగినదేది లేదని తిరిగి కొంతవరకు సమాధాన పడ్డాడు.

దాశరధి కీ వృత్తాంతాలలో చాలావరకు పన్ని హితబాంధవులవల్ల తెలిశాయి. మరికొన్ని శ్రీరంగంలో నివసిస్తున్న కొందరు వృద్ధ శిష్యుల ముఖతః విన్నాడు. ఎంతగా ఆలోచించినా అతనికి ఒక సదాచార పరత తప్ప తంజమాంబ యెడల ఎన్నదగిన అపరాధమేది కానరాలేదు! ఆ తప్పిదమయినా సాంప్రదాయికుల కెవరికి ఒక దోషంగా కనబడలేదు. పైగా గొప్ప సుగుణంగానే స్ఫురించింది. మరి అటువంటి సాధ్వి నన్యాయంగా ఒక కపటలేఖ సృష్టించి విడిచి పెట్టవలసినంత అక్కర ఏమి వచ్చింది? మహాపూర్ణుని వంటి ఆచార్య పురుషులే ధర్మపత్నులతో తమ వైష్ణవ ధర్మం పరిపాలించుకోవడంలేదా! ఆ సాధ్వి పాదధూళితో సరిపోల్చడానికయినా హేమసుందరి కేమాత్రము అర్హతలేదే! మరి ఆమె ఎడల, రంగనాయకుని యెడల ఆచార్యుని కింతటి ప్రగాఢ వాత్సల్యం పెంపొందడాని కేమి కారణము?

రామానుజుడు సన్యసించిన మరికొంత కాలానికి దాశరధి ఏదో పనిమీద తిరుచానూరు వెళ్లి తంజమాంబ నొకమారు సందర్శించాడు. అతనిని చూడగానే ఆమె ముఖంమీద చీరచెరగు కప్పుకుని క్షీణకంఠ స్వరంతో కుమిలి కుమిలి పలవించింది. హేమసుందరీ రంగనాయకుల అదృష్టానికే మాత్రము దాశరధి అసూయపడలేదు. కాని హేమ ఆచార్యుని ఆదరం చూరగొన్నప్పు డతనికి తంజమాంబ దుర్భర దైన్యాక్రోశం తటాలున జ్ఞప్తికి వచ్చి శ్రుతికుహరాలలో ప్రతిధ్వనించింది! సన్యసించిన క్షణం నుండి రామానుజా డెన్నడు ఆమె మాటే తలపెట్టలేదు. శ్రీరంగంలో గృహిణు లెందరో ఆచార్యుని సందర్శించి తమ నిగూఢ దుఃఖ భారాలు తొలగించుకొంటున్నారు. కాని తంజమాంబవంటి సాధ్వీమతల్లి అమాత్రం చల్లని ఓదార్పు మాటల కయినా నోచుకోలేదు! ఇంతకీ ఆమె చేసిన ఘోరాపరాధమేమి ఉన్నది?

ఆమె దుస్సహ మనోవేదన స్మరించినప్పుడు దాశరధి కొక్కొక్కమారు శ్రీ రామానుజుడు లక్ష్మణస్వామి దేవేరి ఊర్మిళాదేవి నీరవ వియోగ దుఃఖం జ్ఞప్తికి వచ్చేది. పరమకారుణికుడయినా ఆదికవి వాల్మీకి మహర్షి తన రామాయణంలో ఎక్కడ ఊర్మిళాదేవి గభీర శోకం మాటే ఉట్టంకించలేదు! భర్త అగ్రజనితోపాటు అరణ్యంలో నివసించినంతకాలం ఆమె ఆ వియోగయాతన కేవలం ప్రశాంతమౌనంతో, ఎడతెగని ఓరిమితో సహించింది. అదేవిధంగా మఠంలో పెద్ద లెవ్వరు మరి తంజమాంబ విషయమే పంస్మరించడంలేదు! రామానుజునివంటి కృపార్ద్రహృదయుడే ఆమె మాట పూర్తిగా విస్మరించినప్పు డితరు లెవ్వరు

తంజమాంబ గోడే పట్టించుకోకపోవడంలో ఆశ్చర్యమేమి ఉన్నది? ఆ గాథ తలపెట్టినప్పుడు దాశరథి కొక్కొక్కప్పుడు రామానుజుని వంటి వజ్రకఠిన హృదయులీ లోకంలో ఇంకెవ్వరు లేరని అనిపించింది! అయినా హేమసుందరీ రంగనాయకుల యెడల ఏర్పడిన తన వైఖరి ఎన్నడు సూచప్రాయంగా నయినా ఆచార్యుని కెరుకపడనీయలేదు. ఇటీవల కొన్నాళ్ల క్రితమే ఏదో ప్రసంగ సందర్భంలో గీర్వాణ కవి అనంతసూరితోను, కూరాగ్రహారాధిపతి కూరేశునితోను, మఠనిర్వహణాధికారి యజ్ఞమూర్తితోను మాత్రమే ఆ విషయం కొంచెం ముచ్చటించాడు.

అయితే తమ తమ ప్రత్యేక ధోరణులను బట్టి మాత్రమే వారా విషయం పర్యాలోచించారు. అనంతసూరికి జీవితంలో ఎక్కడ ఎటువంటి అదృష్టము పట్టలేదు. మనోహర కంఠస్వరంతో మేళవించిన కవితామాధురి ఒక్కటే చిన్ననాటి నుండి ఒక పెన్నిధిలా తోడుపడింది. అయితే అతనికి విపరీత మయిన పరధ్యానం. మరిచిపోయిన వస్తువులు, వ్యవహారాలు, తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొని వాని అన్వేషణలో, అనుసరణలోనే అతని ఆయుర్దాయంలో సగం భాగం గడిచిపోయింది! అయిదారుగురు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు మొదలయిన ఆత్మీయుల నందరిని విడిచి అనంతసూరి పత్నితో కలిసి శ్రీరంగంలో వేరే ఒక చిన్న కుటీరంలో నివసిస్తున్నాడు. ఆ పూటయినా గడవనీయని ఎడతెగని లేమితో తన మనుగడ కొనసాగించుకొంటున్నాడు. అయితే గీర్వాణ కవితాభిమానులు కొందరు అప్పుడప్పు డతనిని తగినంత ధనసహాయంతో ఆదుకోకపోలేదు. కాని అతని చేతిలో ఎంత సొమ్మయినా అట్టే సేపు నిలవదు. అనంతసూరి కొంచెం పొడగరి. కోలముఖము. చిటికిమాటికి ఆవేశంతో చలించిపోయే గభీర విలోచనాలు. ఆచార్యుని యెడల అతని భక్తి అపారము. అందుచేత హేమసుందరీ రంగనాయకులపై రామానుజుని అపూర్వ వాత్సల్య ధోరణి అతని కంతగా విపరీతంగా కనిపించలేదు. అదీగాక ఆ యువ లోతు గుండెల కదలిక లెవ్వరికి తెలియవని అతని గట్టి నమ్మిక. అందుచేత ఆ విషయాన్ని గురించి అతడంతగా పట్టించుకోలేదు.

ఇక కూరాగ్రహారాధిపతి కూరేశుడు శ్రీరంగం రాకపూర్వం పేరెన్నికగన్న సంపన్న గృహస్థుడు. కాని అతని కెంతకాలానికి సంతతి కలగలేదు. ఎంత సంపత్తి ఉంటే మాత్రం! ఏం లాభం! నట్టింట పారాడే పసిపాప లేకపోవడంవల్ల అతని మహనీయ మందిరం బావురుమన్నది. కూరేశుడు తన అగ్రహారంలో గొప్ప విద్వాంసుడన్న ప్రతిష్ఠ గడించుకొన్నాడు. అందుచేత శిష్య సంతతికి విద్యాదానంతో, అగ్రహార వ్యవహారాల పర్యవేక్షణతో అతని కేదో విధంగా కాలక్షేప మయింది. కాని సంతాన దారిద్ర్యంతో అతని భార్య క్రమక్రమంగా మతిలేని మనిషిలా మారిపోయింది. వారిద్దరికి భోగభాగ్యాల కేవిధమయిన కొదవ లేదు. అయితే జీవితంలో ఒక అధిగమించరాని అఖాతమేదో ఏర్పడ్డట్టు కనబడింది. బ్రతుకంతా బాగా మునురుపట్టిన దుర్దినంలా తయారయింది. ఆనాటికానాటికి కూరేశుని పత్ని ఆరోగ్యం పాడయింది. చిక్కి శల్యమయిపోతున్న ఆమె పరిస్థితి గమనించగానే అతని గుండె బరువెక్కువయింది. ఆ సమయంలోనే అతనికి రామానుజయతితో అతి సన్నిహితమయిన పరిచయభాగ్యం లభించింది. క్రమక్రమంగా అది ప్రగాఢభక్తిగా పరిణమించింది. కూరేశు డానాటినించి సంపత్తి అంతా మఠంకోసము, నిరంతర దాన ధర్మాల కోసము వ్యయం చేశాడు. పట్టి కట్టుబట్టలతోనే భార్యతోబాటు శ్రీరంగం చేరుకొని వేరొకచోట నివసిస్తున్నాడు. కేవలం పురాణ ప్రవచనాలతో లభించిన స్వల్పాతిస్వల్పమయిన ద్రవ్యంతోనే తన దైనందిన జీవిక కొనసాగించుకొన్నాడు. రంగనాయకుని రాకపోక లెక్కువయిన కొద్దీ మఠ ప్రతిష్ఠ మంటగలిసి పోగలదేమో అని అతని కొకింత అలజడి కలిగింది.

ఒకనా డదే విషయం గోవిందయతితో ప్రస్తావించాడు. ఇటీవల ఆయన ఎవ్వరితోను ఎక్కువగా ప్రసంగించడంలేదు. కొంతకాలంనించి మౌనవ్రతం స్వీకరించాడు. ఎప్పుడయినా కొంచెం మాట్లాడినా సూత్రప్రాయంగానే ప్రసంగించాడు. అందుచేత కూరేశుని ప్రసంగం వినగానే 'ఏది ఎలాగ జరగవలసి ఉంటే అలాగ జరుగుతుంది. అన్నిటికి రామానుజులే ఉన్నారుగదా! అనవసరంగా మన కెందుకీ మథన?' అని వేరొక విషయం ప్రసంగించాడు, అంతేగాని మరి ఆ మాటే ఎత్తుకోలేదు.

గోవిందయతి పూర్వాశ్రమంలో రామానుజుని పినతల్లి కుమారుడు. ఆయనతోబాటు యాదవప్రకాశుడన్న అద్వైత వేదాంత విద్వాంసుని సన్నిధిని బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఉపనిషత్తులు కూలంకషంగా అభ్యసించిన విద్యాఖని. ఒకసారి తన గురువులతో కలిసి వారణాసి సేవించుకొని బాగిరథీ నదిలో లభించిన అపూర్వ శివలింగంతో తిరిగి వచ్చి అది కాళహస్తిలో ప్రతిష్ఠించాడు. ఆనాటినించి కేవల శైవుడై కాళహస్తీశ్వరుని నిరంతర సేవలో పంచాక్షరీమంత్రం ప్రగాఢ జపంలో నిమగ్నుడై పరమ మాహేశ్వరుడన్న మహాప్రతిష్ఠ గడించుకొన్నాడు. కాని మరికొంతకాలం గడిచిన తరవాత శ్రీశైల పూర్ణుడన్న వేంకటేశ్వర భక్తాగ్రేసరుని సాంగత్యశక్తివల్ల శ్రీవైష్ణవదీక్ష స్వీకరించి, సన్యసించి శ్రీరంగక్షేత్రం చేరుకొని రామానుజుని కంతేవాసి అయినాడు. గోవిందయతి మిక్కిలి వృద్ధుడు. మఠంలో నివసిస్తున్న బ్రహ్మచారులందరు ఆ వృద్ధయతిని రామానుజునితో సరిసమానంగా గౌరవిస్తూంటారు. మఠ నిర్వహణాధికారి యజ్ఞమూర్తియతి ఎడదలో ఆయన యెడల ఎనలేని భక్తి, ప్రపత్తి పాదుకొన్నవి. అందుచేత మఠ నిర్వహణలో చిన్న చిన్న వ్యవహారాలలో గోవిందయతి అభిప్రాయాల ప్రకారమే నడుచుకొంటూ ఉంటాడు. కాని గోవిందయతి ప్రశాంత మౌనవ్రతం విసర్జించిన వేళ ఎన్నడో కాని తటస్థపడదు. బాగా ముడతలు పడిన ఆ వృద్ధమూర్తి కనుబొమలలో అంతర్లీనములయిన వీక్షణా లెల్లవేళల శ్రీరంగేశుని చరణకమలాలే ధ్యానిస్తూ మిణుగురులవలె మెరుస్తూ ఉంటాయి!

—ఇంకా ఉంది.


తారల సౌందర్య రహస్యము
క్రొత్త ఫేషనులను అనుసరించుట



మోడల్ నెం. 4. ఉచిత కేటలాగుకు:
వి. వి. డ్రస్ Mfg. కో., రాజమండ్రి

SWASTIK

పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లపొతుకుపోయి పాదము నేలపై బెట్టలేక రాళ్ళు తగిలిన త్రుళ్లిపడు వారు పైపూతగా వాడిన వ్రేళ్లతోసహా మాయంచేయగల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4–25న.పై.

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1–50
దాంపత్య రహస్యములు ... రు. 3–00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4–50

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.
3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు–1.

కుటీర పరిశ్రమ గైడ్

మీ తీరికవేళలో, మీయింటిలో కొద్ది మూలధనంతో యేదైనా చిన్న పరిశ్రమ ప్రారంభించండి. ఈ పుస్తకంలో 112 చిన్న మరియు సామాన్య పరిశ్రమలు ప్రారంభించు పద్ధతి, మిషీనరి, ముడివస్తువులు మొదలగు పూర్తి వివరాలు గలవు. ప్రభుత్వమునుండి ఋణ సహాయం పొందుటకు, ముడివస్తువులు, మిషనరీలు హాయర్ పద్ధతిలో కొనుటకు, సరకుల ఎగుమతి, దిగుమతి వగైరా వివరాలు ఇందులోగలవు. పేజీలు: 1100. (400 చిత్రములు) ధర: రు. 11/50. వి. పి. పి. చార్జీలు రు. 2/–అదనం.

KUBER & Co. (AM. 14)
P. O. Box 1268, Delhi-6.

పండిత
డి. గోపాలాచార్యులవారి
అరుణ
స్త్రీల ఆరోగ్యసౌభాగ్యాలకు
ఆయుర్వేదాశ్రమం
ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు-17

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి. వివరాలకు: ఎడ్వర్టయిజ్‌మెంట్ మేనేజర్‌కి వ్రాయండి.

# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతోగాని, చక్కెర లేకుండాగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన రోగము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈ వ్యాధి, తన బంధంలో చిక్కినవారిని అరోజకారోజు మృత్యువుకు ఆసన్నం చేయును. ప్రథమదశలో శారీరక, మానసిక శ్రమలకు యిష్టగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడలో తిమ్మిరి, చరముం బలహీనతతో ఈ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు ఆరి యెండుట, దురదలు, కాళ్ళలో పగుళ్ళు, తూకం తగ్గడం, శరీరమంతా పొక్కు, కీళ్ళ నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవించవచ్చును.

"పినస్ ఫారస్" మాత్రలు వాడి అనేకులు తమ బాధనుండి విమోచనపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి. "పినస్ ఫారస్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యునాని వైద్య విధానం ప్రకారం అమూల్య ఔషధుల కలయిక ము, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమార్లు మూత్ర విసర్జనచేయు అవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలా భాగము నివారణ యగును. కొద్దిరోజులలోనే మీకు నరాలకిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "పినస్ ఫారస్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేక పథ్యములేదు. నిరాహారముతోనుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము తినేందుకై ఎదివరకటికంటె ఎక్కువరకాల ఆహార పదార్థములు తీసికొనవచ్చును. వివరములు గల ఇంగ్లీషు కరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళల శీశ రు. 8-75 న.పై. మాత్రమే. ప్యాకింగ్ మరియు పోస్టేజి ఉచితం.

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
(W. A. P.)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.

# వచ్చేవారమే!

# "విచిత్ర వివాహం"

## (డిటెక్టివ్ సీరియల్ కథ ప్రారంభం)

రిటైర్డ్ పోలీస్ అధికారి పరిశోధనలకు

కథారూపం!

## రచయిత: శ్రీ 'యో'

# అందరూ మనుషులే!

వి. ఎస్. రమాదేవి

స్త్రీలు తమ చేష్టలు, హావభావవిలాసాలు, పురుషులు వివిధ మనస్తత్వాలు ప్రదర్శించడానికనువైన విశాలరంగం కల్పించి, క్లబ్బుల్లో కాలక్షేపం, స్టూడియోల్లో చిత్రనిర్మాణం, పల్లెజీవనం, పట్టణవాసం—యిలా మధ్యతరగతి కుటుంబాల మానసిక సమస్యలెన్నో చర్చించబడిన నవల. జీవితంలో అభ్యున్నతి నందుకున్న రేఖపై అనూయా బాష్పవాయువులు వదిలిన మహిళామండలిలో కొత్తపెళ్లి వంటి అమాయిక, గుంటనక్కలాంటి జిత్తులమారి, మృగరాజంత గంభీర వనిత, గుర్రాతు పిల్లినిబోలు గూఢకటాక్షాలు విసరే వింత మనస్క—యిలాంటి వారెందరో కన్పిస్తారు. నేటి సమాజాన్ని యింత నగ్నంగా చిత్రించిన ఇలాంటి నవల యింతవరకు తెలుగులో రాలేదంటే నమ్మండి. 738 పుటలు. వెల రు. 10

సౌందర్యము—సౌశీల్యం (సోమరాజు) 3-00, సువర్ణ (నాగరాజు) 3-50 శాపగ్రస్తులు (వాసుదేవరావు) 3-00, ఆదర్శాలు — అవరోధాలు (సోమరాజు) 2-25 అడంట జానకిరామ్ గారి 'సాగుతున్న యాత్ర' 5-00. పోస్టేజి ఫ్రీ

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Stree, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

